# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 12 హైదరాబాద్ 113 డిసెంబర్ 2010 పేజీలు : 68 రు. 10

- ఫోకస్ : చదవవలసిన పుస్తకాలు
- 2జి స్పెక్ట్రమ్, ఆదర్శ్ కుంభకోణాలు
- ఒబామా పర్యటన సాధించిందేమిటి?
- పోలవరం ప్రాజెక్ట్‌పై పునరాలోచన
- జాతీయ ఫైబర్ విధానం
- నారాయణపట్నా ఆదివాసి ఆందోళన
- గతి తర్క పరిశీలనా పద్ధతి

ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న

**ముదునూరి భారతి, ఆర్.ఎస్. రావు** ల

పుస్తకాలు వెలువడ్డాయి




## అభివృద్ధిని ఇలా చూద్దాం

వ్యాసాలు, సమీక్షలు

ముదునూరి భారతి

**పేజీలు 206**

**వెల రు. 80**

## కొత్తచూపు

'అభివృద్ధి వెలుగునీడలు', ఇతర వ్యాసాలు

ఆర్. ఎస్. రావు

**పేజీలు 296**

**వెల రు. 100**




ప్రతులకు, వివరాలకు :

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్

హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

113

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2010
సంపుటి : 8
సంచిక : 12

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

సంపాదకీయం

## ముఖ్యమంత్రి మారితే సమస్యలు సమసిపోతాయా?

ముఖ్యమంత్రిగా పద్నాలుగు నెలల పాలన తర్వాత కొణిజేటి రోశయ్య స్థానంలో నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డిని నియమించాలని కాంగ్రెస్ అధిష్టానం భావించింది. రాష్ట్రానికి పదహారో ముఖ్యమంత్రిగా కిరణ్‌కుమార్ రెడ్డి నవంబర్ 25న పదవి చేపట్టారు. ప్రజలు ఎన్నుకున్న శాసనసభ్యులు తమంతట తాము సమావేశమై తమ నాయకుడిని ఎన్నుకుంటారనీ, ఆ నాయకుడినే ముఖ్యమంత్రిగా ప్రభుత్వం స్థాపించమని గవర్నర్ ఆహ్వానిస్తారనీ రాజ్యాంగంలో చదువుకున్న పాఠం ఈ దేశంలో ఇప్పటికే వందలాది సార్లు వమ్మయి పోయింది గాని ఈ వ్యవస్థ మీద ఇంకా నమ్మకం ఉన్నవారికోసం మరొకసారి గుర్తు చేయవలసి ఉంది. ఆధునిక ప్రజాప్రాతినిధ్య రాజకీయాలతో, రాజ్యాంగ నిబంధనలతో, ప్రజాభిప్రాయంతో, చివరికి ప్రజాప్రతినిధులనబడేవారి అభిప్రాయంతో ఏమీ సంబంధం లేకుండా ఢిల్లీ చక్రవర్తులు రాష్ట్రాల సామంతులను, పాళెగాళ్లను నియమించుకునే భూస్వామ్య రాచరిక పాలనే ఇంకా కొనసాగుతున్నదనడానికి ఇది మరొక నిదర్శనం. అయితే ఆ స్థానంలో ఎవరుపోయి ఎవరువచ్చినా ప్రజలకు ఒరిగేదేమీ లేదు. గద్దె మీద ఎవరు కూచున్నా, ఎవరు కూచున్నట్టు కనిపించి మరెవరు పాలించినా, ప్రజలకు జరుగుతున్న మేలేమీ లేదనే చేదు వాస్తవాన్ని ఆరు దశాబ్దాల చరిత్ర చెపుతున్నది. ఎంతో మారినట్టు, ఎప్పటికప్పుడు మారుతున్నట్టు కనిపిస్తున్నా ప్రజాజీవితంలో రావలసిన నిజమైన మార్పు రావడం లేదు. నిజానికి ఇవాల్టికివాళ ఆంధ్రప్రదేశ్ సమాజంలో, రాజకీయాలలో లోతయిన మార్పులు రావలసి ఉంది. ఈ సమాజం నిప్పుల గుండంలా సమస్యలతో అట్టుడికిపోతున్నది. ఈ అగ్ని పర్వతం ఎప్పుడు పేలుతుందో చెప్పలేము గాని ప్రతి సామాజిక బృందం నుంచీ, ప్రతి ప్రాంతం నుంచీ చిటపటమని నిప్పురవ్వలు ఎగుస్తున్నాయి. ఆ అగ్నిపర్వతపు భుగభుగలకు స్పందించవలసిన రాజకీయ పక్షాలన్నీ, అధికార పక్షమనే పేరుతో ఉన్నా, ప్రతిపక్షమనే పేరుతో ఉన్నా, నిమ్మకు నీరెత్తినట్టు ప్రవర్తిస్తున్నాయి. ఇప్పుడు తెలుగు సమాజం నిజంగానే మార్పును కోరుకుంటున్నది. కాని ఆ మార్పు కేవలం ముఖ్యమంత్రి గద్దెమీది ముఖం మారినందువల్ల జరిగే మార్పు కాదు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ గురించి కేంద్ర ప్రభుత్వం గత డిసెంబర్ 9న ప్రకటించినప్పటినుంచీ రాష్ట్రం సంక్షుభితంగా ఉన్నది. ఆ తర్వాత ఎన్ని అతుకులు, మాట్లు వేసినా అసలు సమస్య అలాగే ఉండిపోయింది. పైగా ఈ సమస్య పరిష్కారం కోసం నియమించిన శ్రీకృష్ణ కమిటీ తన నివేదికను మరొక నాలుగు వారాల్లో సమర్పించవలసి ఉంది గనుక ఈ ఆందోళన మరొకసారి పెల్లుబికే అవకాశం ఉంది. ఇప్పటికే బి.ఇడి కౌన్సిలింగ్ సమయంలోనూ, పోలీసు అధికారుల రాత పరీక్షల సందర్భంలోనూ ఈ సమస్య ఎంత తీవ్రతరం కాగలదో రుజువయింది. బహుళ జాతి సంస్థల పారిశ్రామిక అవసరాల కోసం, కృష్ణా–గోదావరి డెల్టా రైతులకు మూడో పంటకోసం, తెలంగాణ నోరుకొట్టి నిర్మించదలచిన పోలవరం పొరుగు రాష్ట్రాల అభ్యంతరాలను ఎదుర్కొంటోంది. లక్షలాది రైతుల భూమిని గుంజుకుని నిర్వాసితులను చేసి దేశంలోకెల్లా ఎక్కువ ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేసిన రాష్ట్రంగా పేరు తెచ్చుకున్న చోట ఆ నిర్వాసితులకు పునరావాసమూ దొరకలేదు, ఆ సెజ్‌లలో ప్రకటించిన పారిశ్రామికీకరణా, పెట్టుబడుల ప్రవేశమూ, ఉద్యోగ కల్పనా జరగలేదు. షెడ్యూల్డ్ కులాల వర్గీకరణ సమస్య యథాతథంగా ఉంది. ఈ దీర్ఘకాలిక, చారిత్రక సమస్యలను అలా ఉంచినా తక్షణమే పరిష్కారాన్ని ఆశిస్తున్న వివిధ ఉద్యోగ బృందాల, సామాజిక బృందాల సమస్యలూ ఉన్నాయి. గతంలో అమలయిన సంక్షేమ పథకాలను రద్దుచేయడం, కోత విధించడం జరిగినందుకు నిరసనగా విద్యార్థులు, వెనుకబడిన కులాలు, వృద్ధులు, అనారోగ్య పీడితులు ఇప్పటికే ఆందోళననూ, అసంతృప్తినీ ప్రకటిస్తున్నారు. పదిలక్షల మంది రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు తమ సమస్యల పరిష్కారంకోసం ఉద్యమ పథం పట్టారు. వారి సమస్య సామరస్యపూర్వకంగా పరిష్కారం కాకపోతే నిరవధిక సమ్మెకు పూనుకుంటామని హెచ్చరిస్తున్నారు. మరొకవైపు నుంచి ఎనిమిది లక్షల మంది బీడీ కార్మికులు తమ వేతనాల పెంపుదలకోసం ఉద్యమిస్తున్నారు. అక్టోబర్ – నవంబర్ లలో కురిసిన భారీ వర్షాలవల్ల, వరదల వల్ల పంటలు, ఇళ్లు కోల్పోయిన కోస్తా, రాయలసీమ రైతాంగం కొన్ని లక్షలమంది నష్టపరిహారం కోసం, బీమా కోసం ఆందోళన చేస్తున్నారు. వైద్య, ఆరోగ్య సిబ్బంది, పారా మెడికల్ సిబ్బంది సమ్మెలో ఉన్నారు. చేనేత కార్మికుల రుణ మాఫీ కోసం ఆందోళన సాగుతోంది. ఔట్ సోర్సింగ్ ఉద్యోగులు జీతాల పెంపుదల కోసం ఆందోళన చేస్తున్నారు. సూక్ష్మ రుణాల బాధితులను ఆదుకోవడానికనే పేరుతో ఆర్డినెన్స్ తెచ్చినా సూక్ష్మ రుణసంస్థల ఆగడాలు ఆగలేదు, బాధితుల ఆత్మహత్యలు ఆగలేదు. ముఖ్యమంత్రి గద్దెమీద కూచునే వ్యక్తి మారినంత మాత్రాన ఈ వ్యవస్థాగత సమస్యల పరిష్కారం జరగదు. ఎక్కువలో ఎక్కువ ఆ వ్యక్తి కొన్ని సమస్యలకు తాత్కాలిక, పాక్షిక పరిష్కారం కనుగొనేందుకు ప్రయత్నించవచ్చు. కాని కొత్త ముఖ్యమంత్రి అలాంటి వైఖరిని కూడ ఇంతవరకు ప్రకటించలేదు. ఒకవైపు ప్రజలకు అసంతృప్తి ప్రకటించే అవకాశం ఉందంటూనే, మరొకవైపు శాంతిభద్రతల పరిరక్షణే తనకు ముఖ్యమని హుంకరించారు. అంటే ప్రజా సమస్యలను పరిష్కరించకపోగా, ఆ సమస్యల పరిష్కారం కోరేవారిపై దమననీతిని ప్రయోగిస్తాము అని హెచ్చరించడమే. ఆ మాటల్లో కొత్త సీసాలో పాత సారా వాసనే కనబడుతున్నది. వీ

గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**

కరస్పాండెంట్/సబ్‌ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
92468 26191

**ప్రింటర్స్**
**చరితా ఇంప్రెషన్స్,**
**ఆజామాబాద్, హైదరాబాద్**
ఫోన్ : 040 - 27678411

## టెలికాం అవినీతి కొత్తది కాదు

**2జి** స్పెక్ట్రం అమ్మకాలకు సంబంధించిన టెలికాం కుంభకోణంలో ప్రభుత్వ ఖజానాకు ఒక లక్షా డెబ్బై ఆరు వేల కోట్ల రూపాయలు నష్టం జరిగిందని ప్రభుత్వ సంస్థలే ప్రకటించాయి. అనేక అక్రమాలలో స్వయంగా కేంద్ర కాబినెట్ మంత్రి పాత్ర ఉన్నదని కూడ బయటపడింది. ఆ మంత్రి మిశ్రమ మంత్రివర్గంలో మరొక రాజకీయ పార్టీకి చెందినవాడయినందువల్ల రాజీనామా కూడ చేయవలసి వచ్చింది. అసలు మొత్తం వ్యవహారం మీద సమగ్ర దర్యాప్తు జరపడానికి సంయుక్త సభా సంఘాన్ని వేయాలని ప్రతిపక్షాలు పట్టు పడుతుండగా, ఆ అవసరం లేదని అధికారపక్షం అంటున్నది. ఈ లోగా అసలు ఆ మంత్రికి ఆ పదవి రావడానికి పెద్ద ఎత్తున బేరసారాలు జరిగాయని, ఆ బేరసారాలలో ప్రఖ్యాత జర్నలిస్టుల పాత్ర కూడ ఉందని వారి టెలిఫోన్ సంభాషణలలో బయటపడింది. సుప్రీంకోర్టు కూడ ఈ విషయంలో జోక్యం చేసుకుని ప్రశ్నల మీద ప్రశ్నలు గుప్పిస్తున్నది. ఈ కుంభకోణం ఇప్పుడు మాత్రమే జరిగినట్టు ప్రచారసాధనాలు, ప్రతిపక్షాలు చాల హడావుడి చేస్తున్నాయి. కాని ఇవాళ చాల పవిత్రుల లాగ నటిస్తూ అధికారపక్షం మీద విమర్శలు గుప్పిస్తున్న పార్టీల పాలనా కాలంలోనూ, ఇతర పార్టీల పాలనకు సహకరించిన కాలంలోనూ కూడ ఈ టెలికాం కుంభకోణాలు సాగుతూనే వస్తున్నాయి. నూతన ఆర్థిక విధానాల వెల్లువలో టెలికాం రంగాన్ని ప్రైవేటీకరించడానికి, టెలికాం రంగంలో పరికరాలు దిగుమతి చేసుకోవడానికి అప్పటి మంత్రి సుఖ్ రాం చేసిన అవినీతి నాటి నుంచి అంటే 1993–94 నుంచి ఈ అవినీతి జరుగుతున్నది. తర్వాతి కాలంలో మొబైల్ ఫోన్ సాంకేతిక పరిజ్ఞానం దేశంలోకి ప్రవేశించాక, దేశాన్ని సర్కిళ్లుగా విభజించి, ఆయా సర్కిళ్లలోని ధ్వని తరంగాలను వాడుకునే హక్కులను ప్రైవేటు కంపెనీలకు, బహుళజాతి సంస్థల దళారీలకు అమ్మడం ప్రారంభించాక, ఆ ధ్వని తరంగాల మీద ప్రభుత్వానికీ, రక్షణ శాఖకూ ఉన్న గుత్తాధిపత్యాన్ని తగ్గిస్తూ వచ్చాక ప్రభుత్వాలేవయినా, మంత్రులెవరయినా ఈ అవినీతి కుంభకోణాలు జరుగుతూనే పెరుగుతూనే వచ్చాయి. గత ఇరవై సంవత్సరాలలో కేంద్రప్రభుత్వంలో టెలికాం మంత్రులుగా పనిచేసిన ఎనిమిదిమంది మంత్రులూ ఒక్కొక్కరూ ఒక్కొక్క రకంగా ఈ అవినీతిని విస్తరించినవారే. పి.వి. నరసింహారావు మంత్రివర్గంలో పనిచేసిన కాంగ్రెస్ వాది సుఖ్ రాం గాని, బైటి నుంచి సిపిఎం, లోపలి నుంచి సిపిఐ కూడ మద్దతు ఇచ్చిన యునైటెడ్ ఫ్రంట్ మంత్రివర్గంలో పనిచేసిన వేణీప్రసాద్ వర్మ (సమాజ్ వాది పార్టీ), భారతీయ జనతా పార్టీకి చెందిన జగ్‌మోహన్, ప్రమోద్ మహాజన్, అరుణ్ శౌరీ గాని, జనతాదళ్ (యు) కు చెందిన రామ్‌విలాస్ పాశ్వాన్ గాని, డిఎంకె కు చెందిన దయానిధి మారన్, ఎ. రాజా గాని, ఆ మంత్రిత్వశాఖను ఎవరు నిర్వహించినా దాన్ని పాడి ఆవు గానే చూసి అందినంత పిండుకున్నారు. రాజా ద్వారా బయటపడుతున్న ఈ తాజా కుంభకోణం ఈ దేశ పాలకవర్గ పార్టీలన్నీ ఒకే తానులోని ముక్కలేనని మరొకసారి తెలియజేస్తోంది.

## చిన్న జైలులోనుంచి పెద్ద జైలులోకి ఆంగ్ సాన్ సూచీ

**బ**ర్మాను పాలిస్తున్న సైనిక నియంతల దౌష్ట్యం ఒక వెనుకడుగు వేయవలసి రావడం, గత ఇరవై ఒక్క సంవత్సరాలలో పదిహేను సంవత్సరాలకు పైగా గృహ నిర్బంధంలో ఉన్న ప్రజాస్వామిక ఉద్యమ నాయకురాలు ఆంగ్ సాన్ సూచీ ఈ నవంబర్ 13న ఎట్టకేలకు విడుదల కావడం వ్యక్తిగా ఆమెకూ, ప్రపంచవ్యాప్తంగా స్వేచ్ఛాప్రియులకూ ఆనందదాయకమైన విషయం. అయితే ఆమె ఇంటి గేటు దాటి బయటికి రాగలగడం మొత్తంగా బర్మా సమాజం చుట్టూ ఉన్న ముళ్లకంచె పడిపోయిందనడానికి చిహ్నమేమీ కాదు. చిన్నజైలు లోంచి ఆమె పెద్ద జైలు లోకి రాగలిగింది. ఆ పెద్ద జైలు బద్దలుకొట్టే పని ఇంకా మిగిలే ఉంది. ఆరుకోట్ల జనాభా గల బర్మాను నాలుగు లక్షల సైనికుల సహాయంతో ఒఅక్ సైనిక నియంతల ముఠా పాలిస్తున్నది. ఆ పాలన తుపాకి మడమల కింద, ఉక్కుపాదం కింద, రక్తపుటేర్లతో, కనీస మానవహక్కులు మృగ్యమైన స్థితిలో సాగుతున్నది. జాతీయ బడ్జెట్ లో సగభాగం సైనికుల కోసమే ఖర్చవుతున్నది. దేశంలో భయానకమైన బలవంతపు వెట్టి చాకిరీ కొనసాగుతున్నదని, కనీసం పది లక్షల మంది తమ ఇళ్లనుంచి బయటికి తరిమేయబడి దిక్కులేని బతుకు గడుపుతున్నారని, రెండున్నరవేల మంది రాజకీయ ఖైదీలు జైళ్లలో మగ్గిపోతున్నారనీ, రాజకీయ విశ్వాసాలున్నందుకు ప్రజలను విపరీతమైన చిత్రహింసలకు గురిచేస్తున్నారని, చిన్నారి పిల్లలను కూడ నిర్బంధంగా సైనికులుగా చేర్చుకుంటున్నారనీ, శిశు మరణాలు, స్త్రీల మీద అత్యాచారాలు పెద్ద ఎత్తున జరుగుతున్నాయని వార్తలు వస్తున్నాయి. ఐక్యరాజ్యసమితి, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్, హ్యూమన్ రైట్స్ వాచ్ వంటి సంస్థలు ఎంతగా గగ్గోలు పెట్టినా, కొన్ని దేశాల ప్రభుత్వాలు మాటవరుసకు, పెదవుల మీదినుంచి సైనిక ప్రభుత్వాన్ని ఖండించే ప్రకటనలు జారీచేస్తున్నా, సైనిక నియంతలకు చీమ కుట్టినట్టయినా లేదు. భారత్ తో సహా అనేక దేశాలు ఆ సైనిక నియంతృత్వ ప్రభుత్వంతో స్నేహ సంబంధాలు నెరపుతూనే ఉన్నాయి. భారత ఉపఖండంతో పాటుగానే బ్రిటిష్ వలసగా ఉండిన బర్మాలో కూడ భారతదేశంలో లాగనే 1948లో అధికార మార్పిడి జరిగింది. స్వాతంత్ర్యోద్యమ నాయకుడిగా ఉండిన సూచీ తండ్రి ఆంగ్ సాన్ 1947లో, ఆమె రెండేళ్ల వయసులో హత్యకు గురయ్యారు. ఆ తర్వాత కొంతకాలం పార్లమెంటరీ పాలన సాగినా, బర్మా సోషలిస్ట్ ప్రోగ్రాం పార్టీ అని పేరు పెట్టుకున్న సైనికాధికారుల ముఠా 1962లో సైనిక కుట్ర ద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకుని, అప్పటినుంచీ దేశంలో చీకటిపాలన నెలకొల్పింది. ప్రజాస్వామిక పునరుద్ధరణ కొరకు జరిగిన ప్రజా ప్రదర్శనలమీద దాడులు చేసి, మూకుమ్మడి హత్యాకాండలు సాగించింది. భారతదేశంలోనూ, బ్రిటన్ లోనూ, అమెరికాలోనూ చదువుకుని బర్మాలో 1988లో ప్రవేశించిన సూచీ అప్పటికి ఉవ్వెత్తున సాగుతున్న ప్రజాస్వామిక పునరుద్ధరణ ఉద్యమంలో భాగం కావలసి వచ్చింది. ఆమె ప్రధాన కార్యదర్శిగా నేషనల్ లీఫ్ ఫర్ డెమొక్రసీ ఏర్పడి బర్మాలో 1990లో జరిగిన ఎన్నికలలో పోటీచేసింది. పార్లమెంటులోని 485 స్థానాలలో 392 గెల్చుకుని ప్రభుత్వాధికారానికి చేరువైంది. కాని ఆ ఎన్నికల ఫలితాన్ని ఆమోదించని సైనిక అధికార ముఠా ఆమె మీద, దేశం మీద నిర్బంధాన్ని కొనసాగించింది. బర్మా ప్రజల విముక్తిని ఆకాంక్షించడం ప్రపంచ ప్రజలందరి బాధ్యత. వీ

# లోపలి పేజీల్లో...

## ఫోకస్ : చదవవలసిన పుస్తకాలు

అసలు పుస్తకం చదవడం ఎందుకు? చదువు ద్వారా మనిషికి తన గురించీ, సమాజం గురించీ, ప్రకృతి గురించీ అవగాహన పెరుగుతుంది. తన జీవితంలోనూ, తన చుట్టూ ఉన్న సమాజంలోనూ, ప్రకృతిలోనూ జరుగుతున్న మార్పులను అర్థం చేసుకోవడానికి చదువు ఉపయోగపడుతుంది. తాను పొందుతున్న అనుభవాలు తనకే ప్రత్యేకమైనవి కావనీ, ఇతర వ్యక్తులు ఏదో ఒక కాలంలో ఒక స్థలంలో అనుభవించినవేననీ మనిషికి పుస్తక పఠనం ద్వారానే తెలుస్తుంది. తనలో ఉన్న ప్రత్యేకతలేమిటో, తనలో జరుగుతున్న మార్పులేమిటో, బయటి పరిణామాలకు తన స్పందన ఎలా ఉండడం అవసరమో, సముచితమో తెలుసుకోవడానికీ, తెలిసినదాన్ని మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడానికీ పుస్తక పఠనమే వీలుకలిగిస్తుంది. అంటే మనిషి సామాజికవ్యక్తిగా మారడం ఎలాగో పుస్తక పఠనం నేర్పుతుంది.



'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు.
'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్‌తో పాటు ఫోన్ నంబర్ తప్పకుండా రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్

(ఉ.10 నుంచి సా. 6 గం. వరకు) 040-66843495







- **మతతత్వంపై బాలగోపాల్** – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 317 పేజీలు, 1/8 డెమీ, రు. 150
- **బెంగుళూరు నాగరత్నమ్మ – జీవిత చరిత్ర** – శ్రీరాం. వి. – అనువాదం: టి. పద్మిని – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 143 పేజీలు, 1/8 డెమీ, రు. 60

  పై రెండదు ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067; ఫోన్ : 040 – 23521849; www.hyderabadbooktrust.blogspot.com
- **చదువుల సారం – 1 – అనుభవాలు పంచుకుందాం – 1** – మంచి పుస్తకం – జన విజ్ఞాన వేదిక ప్రచురణ – 212 పేజీలు, 1/8 డెమీ, రు. 100
- **చదువుల సారం – 1 – అనుభవాలు పంచుకుందాం – 2** – మంచి పుస్తకం – జన విజ్ఞాన వేదిక ప్రచురణ – 236 పేజీలు, 1/8 డెమీ, రు. 110

  పై రెండు ప్రతులకు : జన విజ్ఞాన వేదిక ప్రచురణల విభాగం, 162, విజయలక్ష్మి నగర్, నెల్లూరు – 524004; ఫోన్ : 9440503061; మంచి పుస్తకం, 12–13–450, వీధి నెం. 1, తార్నాక, సికింద్రాబాద్ – 500017; ఫోన్: 9490746614; ఇమెయిల్ : info@manchipustakam.in, website : www.manchipustakam.in
- **మార్క్సిజం – కుల సమస్య** – ఒక పరిచయం – సి.పి. – సమత ప్రచురణలు – 62 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : సమత ప్రచురణలు, డోర్ నెం. 26–14–164, రఘురామ్‌నగర్, నగరంపాలెం, గుంటూరు – 4
- **ప్రసార భాషగా తెలుగు** – సంపాదకులు : డా. నాగులపల్లి భాస్కరరావు, నాగసూరి వేణుగోపాల్, ఆర్.వి.వి. కృష్ణారావు – సెంటర్ ఫర్ మీడియా స్టడీస్ ప్రచురణ – 123 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : సెంటర్ ఫర్ మీడియా స్టడీస్, 1300 ఎ, రోడ్ నెం. 66, జూబ్లీ హిల్స్, హైదరాబాద్ – 500033; ఫోన్ : 040–23450493, 23608188; ఇమెయిల్ : cmshyderabad@gmail.com, www.cmsindia.org
- **దూరాల చేరువలో...** – ప్రపంచ సాహిత్యం – కొన్ని పుటలు – డా. దిలావర్ – సమతా ప్రచురణలు – 158 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : ఎం.డి. అక్బర్, ఎస్.ఐ.ఐ.ఎల్. క్యాంపస్, పాల్వంచ, ఖమ్మం – 507154; డా. దిలావర్, ఎస్.ఐ.ఐ.ఎల్. క్యాంపస్, గాంధీనగర్, పాల్వంచ, ఖమ్మం – 507154, సెల్ : 9866923294, 9618395499; సమాంతర, సహచర, దిశ, విశాలాంధ్ర, నవోదయ, ప్రజాశక్తి
- **పాగల్ షాయర్** – రాజా హైదరాబాదీ – ఝరీ పొయిట్రీ సర్కిల్ ప్రచురణ – 107 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : ఝరీ పొయిట్రీ సర్కిల్, 16–2–740/75/40, వి.కె. ధాగేనగర్, గడ్డిఅన్నారం, హైదరాబాద్ – 500060, ఫోన్ : 040 – 24064195; విశాలాంధ్ర బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్
- **శ్రీకృష్ణదేవరాయల తెలుగు శాసనాలు** (క్రీ.శ. 1509–1531) – ఈమని శివనాగిరెడ్డి, దామరాజు సూర్యకుమార్, కుర్రా జితేంద్రబాబు – డెక్కన్ ఆర్కియాలజికల్ అండ్ కల్చరల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (డి.ఎ.సి.ఆర్.ఐ.) ప్రచురణ – 240 పేజీలు, 1/8 క్రౌన్, రు. 150, ప్రతులకు : కె. జితేంద్రబాబు, డైరెక్టర్, డి.ఎ.సి.ఆర్.ఐ., ఫ్లాట్ నెం. 105, పద్మావతి రెసిడెన్సీ, సలీంనగర్ కాలనీ, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036, సెల్ : 9848882600
- **గమ్యం** – ప్రభాకర్ జైని – శకుంతల, లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ చారిటబుల్ ట్రస్ట్ ప్రచురణ – 208 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : శకుంతల, లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ చారిటబుల్ ట్రస్ట్, 111, 'సి' బ్లాక్, విష్ణు రెడిడెన్సీ, కెనరా బ్యాంక్ దగ్గర, గాంధీనగర్, హైదరాబాద్ – 500080







వీక్షణం నవంబర్ 2010 సంచికలో ప్రచురితమైన 'ఎన్.టి.ఆర్. ప్రజాద్రోహ పాలన' అన్న వ్యాసం మరుగున పడిపోయిన చారిత్రక అవసరాల్ని తట్టిలేపింది. ఆనాడు తెలుగుదేశం పార్టీ కబంధ హస్తాల కింద నలిగిపోయిన పౌర, ప్రజా హక్కుల విలువైన చారిత్రక సమాచారాన్ని అందించిన విప్లవ రచయిత వరవరరావుకి నా కృతజ్ఞతాభివందనాలు. ఆయన పాలన భేష్ అని విర్రవీగే తెలుగు దేశ అధినాయకులకిది చారిత్రక చెంప దెబ్బ. యథా ప్రకారంగా వీక్షణం ఇటువంటి అమూల్య సామాజిక, ఆర్థిక, చరిత్రను వర్తమాన పరిస్థితులను తర్వాతి తరాలకు అందించే గొప్ప చారిత్రక సాక్ష్యం కావాలి.

**– పసునూరి మధూకర్**
సూర్యాపేట, నల్లగొండ

వీక్షణం చాలా విజ్ఞానదాయకంగా ఉంది. నవంబర్ 2010 సంచికలో 'మైక్రో రుణాలు ప్రపంచీకరణ శక్తుల సృష్టే' కొణతం దిలీప్ వ్యాసం చాలా బాగుంది. ప్రతినెల డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ వరుస వ్యాసాల ద్వారా విద్యా సంస్థలు నేర్పని విషయాలను అందిస్తున్నారు. అలాగే కొత్త పుస్తకాల గురించి తెలియజేయడం అభినందనీయం. గత సంచికలోని వ్యాసాలు, ఈ సంచికలోని వ్యాసాలు చాలా బాగున్నాయి. నిజంగా ఇది చాలా మంచి విజ్ఞానదాయక మిత్రుని వంటిది. వీక్షణం పత్రిక ముందు ముందు ఇంకా అభివృద్ధి చెందాలని ఆకాంక్షిస్తూ...

**– ఎ. నర్సింలు (వాణి)**
రామేశ్వర్‌పల్లి, నిజామాబాద్

వీక్షణం నవంబర్ సంచిక లోని రెండు వ్యాసాలు – కులాల ఆవిర్భావం కొనసాగింపు, కాపిటల్ చదవబోయే ముందు – ఆలోచింపచేసాయి. డా గోపీనాథ్ కులాల గురించి కొంత వివరంగా పరిశీలిస్తారని ఎదురుచూస్తే, హడావుడిగా ముగించారు. ఈ విషయంలో నాకు పెద్దగా పరిజ్ఞానం లేకున్నా, నాకు తట్టిన కొని ప్రశ్నలు, ప్రతిపాదనలు చర్చకు పెదుతున్నాను. ఆర్. ఎస్. శర్మ, వేదకాలంలో పూజలు చేసేవారికీ చెప్పులుకుట్టే వారికీ ఒకే గౌరవం ఉండేదని రాసారని, ఆయన శర్మ కాబట్టి అలా రాసారని వ్యాఖ్యానించారు అటువంటి ప్రతిపాదనలో సామాజిక ఉద్దేశం ఉండవచ్చు, కాని దానికి ప్రశ్నించవలసినది దాని అంతర తర్కం (ఇన్నర్ లాజిక్), సమకాలీన ఆధారాలతో. కులం ఏర్పడిన సమాజంలోని సాంస్కృతిక విలువల ఆధారంతో కాదు. ఇక భారత దేశానికి వచ్చిన ఆర్య పూజారి వర్గం అతి ప్రమాదకరమైనది, అందువల్లనే ఇక్కడ కులాలు ఏర్పడ్డాయి అని రాసారు. కొన్ని వేల సంవత్సరాలుగా ఉన్న కుల వ్యవస్థకు మూలం కొందరి వ్యక్తిగత లక్షణాలలో దొరుకుతుందా, లేక సామాజిక సంబంధాలలో, వాటి వెనుక దాగిన ప్రయోజనాలలో దొరుకుతుందా? కేవలం అడపాదడపా జరిగిన యుద్ధాలే గాక, వ్యవస్థాపరమైన (ఇన్ స్టిట్యూషనల్) హింస, ఉదాహరణకు భూమి, తదితర వనరుల మీద హక్కు. ఎందుకంటే, భారత దేశానికి వచ్చిన ఇండో–ఆర్యన్ పూజారి వర్గమే, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ తదితర పశ్చిమ ప్రాంతాలకు కూడా వెళ్ళింది. మరి అక్కడ కులాలు ఎందుకు ఏర్పడలేదు అనే ప్రశ్న ఉదయిస్తుంది. తదుపరి పరిశీలించదగిన విషయలు నాలుగు వర్ణాలకు, సుమారు 2000 కులాలకు సామాన్య అంశం ఉందా? ఏ సామాజిక దశలో కులాలు స్థిరంగా ఉన్నాయి? బ్రిటిష్ వలస పాలనకు ముందు కుల వ్యవస్థలో కొంత కదలిక వచ్చిందా ? వలస పాలన ప్రభావం వల్ల కుల వ్యవస్థలో కదలిక వెనుకబడిందా? మొత్తం కుల వ్యవస్థ అంతం కావడానికి మార్గం భూమిని సమష్టి, సహకార వ్యవసాయంలోకి తీసుకొచ్చి, కనీస అవసరాలు మాత్రమే తీర్చే (సబ్సిస్టెన్స్) చిన్న ఉత్పత్తి స్థానే ఏర్పడే కొత్త సామాజిక సంబంధాలు, కులానికి వృత్తికి మిగిలిన గుర్తింపుస్థానే కొత్త పరిజ్ఞానాన్ని, తద్వారా కొత్త నిపుణులు ఆవిర్భవించడం ద్వారా సాధ్యమా? లేక ఎన్ జీ వోలు చెప్పే సాధికారత, లేక మత మార్పిడి లేక పెరియార్, నారాయణ గురు వంటి వారు నడిపిన సాంస్కృతిక ఉద్యమాల ద్వారా సాధ్యమా? ఈ ప్రశ్నలు చర్చిస్తే కొంత ప్రయోజనం ఉంటుంది. చివరిగా ఆస్ట్రేలియాలో మవోరి తెగలు (వ్యాసం రెండో భాగం చివర) అని రాసారు. మవోరి తెగలు ఆస్ట్రేలియాలో లేవు, న్యూజిలాండ్ లో ఉన్నాయి. పొరపాటు గమనించగలరు.

'కాపిటల్ చదవబోయే ముందు' వ్యాసంలో అనువాదకులు పడ్డ ప్రయాసకు తగ్గ ఫలితం దక్కలేదు. చాలా చోట్ల ఇంగ్లిష్‌లో ఏమి రాసి ఉంటారో అని ఊహించుకొని చదవవలసి వచ్చింది. ఇక మార్క్స్ రచనలలోని జర్మన్ తత్వవేత్తల ప్రభావం గురించి ప్రస్తావన ఉంది. నాకు తెలిసినంతవరకు, మనకు తెలుగులో యూరపియన్ తత్వవేత్తల గురించి రచనలు, చాలాకాలం క్రితం గోపీచంద్ రాసిన తత్వవేత్తలు పుస్తకం మినహా, అందుబాటులో లేవు. కారణాల జోలికి పోకుండా, యూరపియన్ తత్వశాస్త్రంలో జరిగిన పరిణామం, భారతీయ, చైనా, అరబ్ తత్వ శాస్త్రాలలో జరగలేదు. ప్రాచీన గ్రీక్ తత్వశాస్త్రాన్ని అరబ్/ఇస్లామిక్ తత్వవేత్తలు పదిలపరిచి అభివృద్ధి చేసారు కానీ ఆధునిక యూరపియన్ తత్వశాస్త్ర పరిణామం వంటిది ఆసియాలో జరగలేదు. మౌలిక0గా భావ, భౌతికవాదాల (పదార్థవాదం అనడం మూల భావానికి దగ్గరగా ఉంటుంది) వివాదం తత్వశాస్త్ర అభివృద్ధికి ప్రేరణ ఐనా, యూరపియన్ తత్వశాస్త్రంలో అనుభవ – బుద్ధి వాదాల (ఎంపిరిసిజం, రేషనలిజం) సంఘర్షణ (లాక్, బర్కిలీ, హ్యూమ్ – దేకార్త్, లీబ్నిజ్), వాటిని సమ్మేళనం (సింథసిస్) చేసే ప్రయత్నం (కాంట్) ఆధునిక తత్వశాస్త్రానికి దోహదం చేసాయి. మార్క్స్, లెనిన్ వంటి వారి తాత్విక దృక్పథం వెనుక ఉన్న ఈ క్రమాన్ని అర్థం చేసుకోకపోతే వారిని మతం లేని (సెక్యులర్) ప్రవక్తలుగా చూసే ప్రమాదం ఉంది.

**– కె. నరేంద్ర మోహన్**
మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా

వీక్షణం సంపాదకులకు అభినందనలు. ఇంతటి సామాజిక దృక్పథం, చక్కని విశ్లేషణ, నిబద్ధతలతో కూడిన పత్రికను నాకు పరిచయం చేసిన బి. సాంబశివరాజుకు నా కృతజ్ఞతలు. నాకు తెలిసిన, మీ ఉద్దేశాలకు దగ్గరి దృక్పథం కలిగిన నా మిత్రులకు బహుమతిగా మన పత్రిక చందా పంపిస్తాను. నా స్నేహితుల చిరునామాలు సేకరించి ఉంచుతాను.

**– రాజా**
హైదరాబాద్

ప్రతి నెలా వస్తున్న వీక్షణం పత్రిక మమ్మల్నెంతో ఆకర్షించింది. ఎన్నో కీలక విషయాలు ప్రచురించి పంపిణీ చేస్తున్నందుకు కృతజ్ఞతలు, సంతోషం వెలిబుచ్చుతున్నాం. రాబోవు పత్రికల పేజీలు పెంచండి. అదే రేటుకు విక్రయించండి. మంత్రివర్గ పదవులు ఎన్ని ఉండాలి? ప్రస్తుతం ఎన్ని ఉన్నాయి? రాష్ట్రంలో ఎన్ని మంత్రి పదవులు ఉండాలి? ఇప్పుడు ఎన్ని ఉన్నాయి? సుప్రీంకోర్టులో పెండింగ్ కేసులు ఎన్ని? రాష్ట్రంలో పెండింగ్ కేసులు ఎన్ని ఉన్నాయి? దేశం మొత్తం మీద నిరుద్యోగుల సంఖ్య ఎంత? రాష్ట్రంలో నిరుద్యోగుల సంఖ్య ఎంత? ప్రస్తుతం ఉన్న కొలువులు ఎన్ని? అలాగే వలస కార్మికులు ప్రస్తుతం ఎందరు? ఇటువంటి కీలక విషయాలను తెలియపర్చగలరని కోరుతున్నాం.

**– గంటేడ అప్పలరాజు**
తాటిగూడ గ్రా., గరివిడి మం., విజయనగరం

*సవరణ : గత సంచికలో అచ్చయిన డా. ఎం.ఎఫ్. గోపీనాథ్ గారి 'కులాల ఆవిర్భావం కొనసాగింపు' వ్యాసం రెండవ భాగంలో పేజీ 48, రెండవ కాలం చివరి పేరాలో కింది నుంచి రెండవ లైన్‌లో 'దాస్యులుగా' అన్న పదాన్ని 'దస్యులుగా', 49వ పేజీ మొదటి కాలం మొదటి లైన్‌లో 'దాస్యులను' అన్న పదాన్ని 'దస్యులను' గా, మొదటి పేరా రెండవ లైన్‌లో 'దాస్యులుగా' అన్న పదాన్ని 'దాసులుగా' అని సరిచూసుకోగలరు. అచ్చు దోషాలకు చింతిస్తున్నాం. – సం.*

వీక్షణం పత్రికను ప్రతి నెల 29–30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి.
చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.
**కార్యాలయం ఫోన్ : 040 - 66843495 (ఉ. 10.30 నుండి సా. 5.30 లోపు)**

## బాలగోపాల్ స్మారక ఉపన్యాసం

అక్టోబర్ 26న వరంగల్ కాకతీయ విశ్వవిద్యాలయంలో డా. కె. బాలగోపాల్ తొలి స్మారకోపన్యాస సభ జరిగింది. ఆ సభలో ప్రముఖ హక్కుల కార్యకర్త అరుణారాయ్, 'మానవ హక్కు – సమాచార హక్కు' అనే అంశంపై ప్రసంగించారు. ఈ సందర్భంగా ఆమె 'చట్టాల అమలులో ప్రజల భాగస్వామ్యం ఉన్నప్పుడే వాటికి సార్థకత చేకూరుతుంది' అని అన్నారు. బి.జె.పి., వి.ఎచ్.పి. లాంటి అనేక పార్టీలు ప్రజాస్వామ్య మూలసూత్రాలకు ఏ స్థాయిలో విఘాతం కల్పించినా పట్టించుకోని కేంద్ర ప్రభుత్వం అణగారిన వర్గాల తరపున ప్రశ్నించే అరుంధతీరాయ్, జిలానీ వంటి వారిపై మాత్రం దేశద్రోహం కేసులు పెట్టడం సిగ్గుచేటు అన్నారు. ఈ కార్యక్రమంలో పలువురు మేధావులు, వక్తలు, హక్కుల ఉద్యమాల కార్యకర్తలు పాల్గొన్నారు.

## డి.ఎడ్.లకూ అవకాశం

సెకండరీ గ్రేడ్ టీచర్ల నియామకాలను జి.ఒ. 28 ప్రకారం 70:30 శాతం ప్రాతిపదికన చేపట్టేందుకు రంగం సిద్ధమైంది. ఆ మేరకు రాష్ట్ర ప్రభుత్వం అక్టోబర్ 28న నిర్ణయం తీసుకుంది. ఈ నిర్ణయంతో ఇరవై ఎనిమిది వేల ఎస్.జి.టి. పోస్టులు భర్తీ కానున్నాయి. ప్రభుత్వ నిర్ణయం ప్రకారం ముప్పై శాతం ఎస్.జి.టి. పోస్టులను డి.ఇడి. అభ్యర్థులతోనూ, మిగిలిన డెబ్బై శాతం పోస్టులను డి.ఇడి., బి.ఇడి. అభ్యర్థుల కామన్ మెరిట్ ప్రాతిపదికన భర్తీ చేస్తారు.

## హైదరాబాద్ రాష్ట్ర విద్యుత్ బోర్డు శతాబ్ది

హైదరాబాద్ రాష్ట్ర విద్యుత్ బోర్డు శతాబ్ది ఉత్సవాలు అక్టోబర్ 29న ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జరిగాయి. ఈ సందర్భంగా డిసెంబర్ 31 తరువాత తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు జరిగి తీరాలంటూ పలువురు నినదించారు. లేని పక్షంలో తెలంగాణలోని పది జిల్లాల పరిధిలో విద్యుత్ సరఫరాను నిలిపివేస్తామని హెచ్చరించారు. ఈ ఉత్సవాల్లో టి.ఆర్.ఎస్. అధ్యక్షుడు కె. చంద్రశేఖర రావు, సి.పి.ఐ. రాష్ట్ర కార్యదర్శి కె. నారాయణ, బి.జె.పి. నాయకుడు బండారు దత్తాత్రేయ, తెలంగాణ జె.ఎ.సి. కన్వీనర్ కోదండరామ్, న్యూ డెమొక్రసీ నేత సూర్యం తదితరులతో సహా ముస్లిం సంస్థల ప్రతినిధులు సభకు హాజరై ప్రసంగించారు.

## అలిపిరి దాడి పై తీర్పు

అలిపిరిలో ఏడేళ్ల క్రితం (1 అక్టోబర్ 2003) అప్పటి ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుపై జరిగిన హత్యా యత్నం కేసులో తిరుపతి అదనపు సీనియర్ సివిల్ జడ్జి డి. వెంకటరమణ అక్టోబర్ 29న తీర్పు చెప్పారు. మావోయిస్టు నేత పాండురంగారెడ్డి (సాగర్), దాడికి సహకరించారన్న ఆరోపణతో ముప్పిరెడ్డి నారాయణ స్వామి రెడ్డి, జోతం నాగార్జున, పుల్లం గంగిరెడ్డిలకు ఏడేళ్ల కారాగార శిక్ష, ఐదు వేల రూపాయల జరిమానా విధిస్తూ యాభై తొమ్మిది పేజీల తీర్పును చదివి వినిపించారు. అలిపిరి కేసులో వెలువడిన తీర్పు చూస్తుంటే, న్యాయస్థానాలలో న్యాయం చచ్చిపోయినట్టు కనిపిస్తుందని నిందితుల తరపున వాదించిన న్యాయవాది క్రాంతి చైతన్య వ్యాఖ్యానించారు. ఎలాంటి సాక్ష్యాధారాలు లేకుండా సాగర్‌కు శిక్ష విధించడం శోచనీయం అన్నారు.

## హైకోర్టు బెంచ్ ఉద్యమం

గుంటూరు, విజయవాడల మధ్య హైకోర్టు బెంచ్ కోసం న్యాయవాదుల ఉద్యమం కొనసాగుతోంది. న్యాయవాదులు తమ ఉద్యమాన్ని మరింత ఉధృతం చేయాలని నిర్ణయించారు. న్యాయవాదుల జె.ఎ.సి. సభ్యులను ప్రభుత్వం చర్చలకు పిలవాలని బార్ అసోసియేషన్ కార్యదర్శి ఎస్. శివరామకృష్ణ, ఉపాధ్యక్షులు కేశవరావులు నవంబర్ 11న పత్రికా ప్రకటనలో డిమాండ్ చేశారు.

## నవంబర్ 1: మిన్నంటిన నిరసనలు

రాష్ట్ర అవతరణ వేడుకలకు తెలంగాణ ప్రాంతమంతటా నిరసనలు వెల్లువెత్తాయి. రాజధానిలో ముఖ్యమంత్రి, జిల్లాల్లో మంత్రులు పాల్గొన్న అధికారిక కార్యక్రమాలను అడ్డుకునేందుకు ఆందోళనకారులు ప్రయత్నించారు. మరోవైపు సమైక్యంగా ఉంటేనే అభివృద్ధి అంటూ సీమాంధ్ర ప్రాంతంలో ఆంధ్రప్రదేశ్ అవతరణ వేడుకలు జరిగాయి.

## వరద నష్టం

అక్టోబర్ నెలాఖరులో ఈశాన్య రుతుపవనాల ప్రభావంతో దాదాపు వారం రోజుల పాటు ఎడతెరపి లేకుండా కురిసిన వర్షాలతో ఏడు కోస్తా జిల్లాలలో, రాయలసీమ ప్రాంతంలో రెండు జిల్లాల్లో అపార పంట నష్టం వాటిల్లింది. ఇరవై ఐదు మంది చనిపోయారు. మూడు లక్షల డెబ్బై నాలుగు వేల హెక్టార్లలో పంట నీట మునిగింది. తొంభై వేల ఇళ్లు నీట మునిగాయి. రెండు వందల ముప్పై నాలుగు చెరువులు గండ్లు తెగిపోయాయి. పన్నెండు వేల కిలోమీటర్ల రహదారి దెబ్బతిన్నది.

## రైతు స్వరాజ్య యాత్ర

వ్యవసాయ రంగంలో సంక్షోభం, కార్పొరేట్ విదేశీ సంస్థల ప్రమేయం వల్ల జరిగే నష్టాన్ని దేశవ్యాప్తంగా తెలియజెప్పడానికి తొమ్మిది రాష్ట్రాల మీదుగా సాగిన 'రైతు స్వరాజ్య యాత్ర' నవంబర్ 10న విశాఖ చేరుకుంది. ఈ సందర్భంగా పలు రాష్ట్రాలు, పొరుగు జిల్లాల నుంచి పెద్ద ఎత్తున తరలివచ్చిన ఆదివాసి, ఎస్.సి., చిన్న, సన్నకారు రైతులతో డాక్టర్ అంబేద్కర్ హాలులో బహిరంగ సభ జరిగింది. అక్టోబర్ 2న గుజరాత్ సబర్మతిలోని గాంధీ ఆశ్రమంలో మొదలైన ఈ యాత్ర ఇరవై రాష్ట్రాలు, ఇరవై వేల కిలోమీటర్లు సాగి డెబ్బై ఒకటో రోజు డిసెంబర్ 11న ఢిల్లీ చేరుకుంటుంది.

## దళిత, బహుజనులకు రాజ్యాధికారం

ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ రజతోత్సవాలు సందర్భంగా సామాజిక, రాజకీయ మహాసదస్సు నవంబర్ 13న విజయవాడలో జరిగింది. తెలంగాణ, సీమాంధ్ర రాష్ట్రాలను ఏర్పాటు చేస్తూ కేంద్రం వెంటనే ప్రకటన చేయాలని, అదీ దళిత, బహుజనులు, మైనారిటీల నాయకత్వంలో జరగాలని దళిత మహాసభ తీర్మానించింది. మనువాదం కాదని, జనవాదం నేటి అవసరమని ఈ సందర్భంగా కత్తి పద్మారావు అన్నారు. సభలో ముస్లిం నాయకుడు రఫీ, మహాసభ అధ్యక్షులు చింతపల్లి గురుప్రసాద్, ఉపాధ్యక్షులు కోటీ జేమ్స్, ఆంథోని తదితరులు ప్రసంగించారు.

## ప్రమాదపు అంచున చెంచుల బతుకు

నల్లమలలో వజ్రాలు, బంగారం తవ్వకాల కోసం, డిబీర్స్ అనే బహుళజాతి కంపెనీకి అనుమతిస్తూ ప్రభుత్వం జారీచేసిన జి.ఒ. వివాదాస్పదం అవుతోంది. ఐదు జిల్లాల్లో ఐదు లక్షల డెబ్బై ఐదు వేల హెక్టార్లలో నల్లమల అడవులు ఉన్నాయి. ఇక్కడి 113 చెంచు పెంటలలో ప్రభుత్వ లెక్కల ప్రకారం 42,253 మంది చెంచుల జనాభా ఉంది. డబ్బు ఆశ చూపి చెంచులను తరలించే ప్రయత్నాలు ఇటీవల వెలుగు చూశాయి. చెంచుల హక్కుల కోసం ఉద్యమిస్తున్న పలు ప్రజాసంఘాలు ఆందోళనకు దిగడంతో అప్పట్లో ప్రభుత్వం వెనక్కి తగ్గింది. తాజా ఉత్తర్వులతో డిబీర్స్ సంస్థకు సర్వేకు అనుమతి ఇవ్వడంతో సర్వత్రా ఆందోళన నెలకొంది.

## ఎస్.ఐ. పరీక్షలు వాయిదా

తెలంగాణ విద్యార్థుల ఆందోళనతో ఎస్.ఐ. పరీక్షలు వాయిదా పడ్డాయి. హైదరాబాద్‌ను ఫ్రీజోన్‌గా పరిగణించి పోస్టులు కేటాయించడంతో వివాదం రాజుకుంది. హైదరాబాద్ ఆరో జోన్‌లో భాగమంటూ తెలంగాణ విద్యార్థులు ఆందోళనకు దిగారు. ఈ పరిణామాలతో ప్రభుత్వం పరీక్షలను వాయిదా వేస్తున్నట్టు నవంబర్ 19న ప్రకటించింది. వీ

*బహుళజాతి సంస్థలూ, నాయకులూ, అధికారులూ బందిపోట్లలా మారి దేశ సంపదను కొల్లగొడుతున్నారనీ, ఈ దోపిడీకి ప్రాంతం, పార్టీ ఏదీ అతీతం కాదనీ అంటున్నారు* **ఎడ్ల పోచయ్య**

# ఆదర్శ్, 2జి స్పెక్ట్రమ్ - దొంగల దోపిడీ

**కా**మన్‌వెల్త్ క్రీడల విషయంలో అధికార యంత్రాంగం, రాజకీయ నాయకులు ఎట్లా వందల కోట్ల రూపాయల అవినీతికి పాల్పడ్డారో చిత్రవిచిత్రమైన కథలు చదవడం ఇంకా పూర్తి కాకముందే పత్రికా పాఠకులకు మరొక రెండు రసవత్తరమైన కథలు అందాయి. ఒకదాని పేరు ఆదర్శ దోపిడీ. మరొకదానిపేరు గాలి అమ్మకంలో అక్రమాలు. మొదటిదానికి ఒక ముఖ్యమంత్రి తల దొర్లింది, రెండో దానికి ఒక కేంద్ర మంత్రి తల దొర్లింది. నిజం చెప్పాలంటే తలలు దొర్లినట్టు నాటకం జరిగింది గాని ఆ రెండు కుంభకోణాలలో దోపిడీ – మొదటి దానిలో వెయ్యి కోట్ల రూపాయల పైన, రెండవదానిలో లక్షకోట్ల రూపాయల పైన – యథావిధిగా జరిగిపోయింది. ప్రజల వనరులను కొల్లగొట్టి కొద్దిమంది రాజకీయ నాయకులు, వ్యాపారులు పోగు చేసుకున్న సంపదలోంచి ఒక్క పైసా వెనక్కి రాలేదు, రప్పించాలనే ఆలోచనా లేదు. ఈ మహా అవినీతికి పాల్పడిన వారిలో ఒక్కరిని బోనెక్కించి శిక్షించిన, శిక్షించబోతున్న దాఖలా లేదు. పైగా ఈ అవినీతి కుంభకోణాలలో గతంలో లాగా కేవలం వ్యాపారవేత్తలకు, రాజకీయ నాయకులకు మాత్రమే సంబంధం లేదు. ఈ సారి వీటిలో జర్నలిస్టులకూ, అత్యున్నత రాజకీయ నాయకుల సమీప బంధువులకూ కూడా సంబంధం ఉందనీ, న్యాయవ్యవస్థ కూడా ఈ అవినీతి నుంచి దూరంగా లేదనీ వివరాలు బయటపడుతున్నాయి.

### ఆదర్శ్ హౌజింగ్ సొసైటీ

తమ దోపిడీ ఎక్కడెక్కడి దొంగలకూ ఆదర్శవంతమైన నమూనాగా ఉండాలని కాబోలు, ముంబైలో ఈ దోపిడీకి పూనుకున్న పెద్దలు దానికి ఆదర్శ్ హౌజింగ్ సొసైటీ అని పేరు పెట్టుకున్నారు. ఈ వ్యవహారం మొదలయినది పది సంవత్సరాల కింద. పదవీ విరమణ చేసిన సైనికాధికారులకు, కార్గిల్ యుద్ధంతో సహా ఇతర యుద్ధాలలో మృతి చెందిన సైనికుల కుటుంబసభ్యులకు ముంబైలోని అత్యంత సంపన్నమైన కొలాబాలో చౌకధరలకు ఇళ్లు, ఫ్లాట్స్ కట్టి ఇవ్వడానికి ఈ సొసైటీ 2000 ఏప్రిల్‌లో ఏర్పడింది. ఈ సొసైటీలో సైనికులు కానివారికి, సాధారణ ప్రజలకు కూడ సభ్యత్వం ఇవ్వడానికి అనుమతించాలని 2000 జూన్‌లో వచ్చిన ఒక అభ్యర్థనను అప్పటి రెవెన్యూ మంత్రి అశోక్‌రావు చవాన్ ఆమోదించాడు. అప్పటి ముఖ్యమంత్రి విలాస్‌రావు దేశముఖ్ నుంచి, ఆ తర్వాతి ముఖ్యమంత్రులు సుశీల్ కుమార్ షిండే, నారాయణ్ రాణే, అశోక్‌రావు చవాన్ అనేక అక్రమ మార్గాలలో, చట్ట నిబంధనలను అతిక్రమిస్తూ ఈ సొసైటీకి ఎన్నెన్నో రాయితీలు, తాయిలాలు, బహుమతులు ఇస్తూ వచ్చారు. అధికారికంగానే అబద్ధాలు చెపుతూ వచ్చారు. వీరిలో రాణే శివసేనకు చెందిన నాయకుడు, మిగిలిన ముగ్గురూ కాంగ్రెస్ నాయకులు. అంటే వాళ్లందరూ కలిసి ఈ దేశంలో అవినీతికి పార్టీ భేదం లేదని ప్రకటిస్తున్నారన్నమాట. (ఒకవైపు కాంగ్రెస్ నాయకత్వంలోని యు.పి.ఎ. ప్రభుత్వ అవినీతి గురించి భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని ఎన్.డి.ఎ. కూటమి విమర్శలు సాగిస్తుండగానే, భారతీయ జనతా పార్టీకి చెందిన కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం దేశంలోకెల్లా అత్యంత అవినీతికరమైన ప్రభుత్వమని సమాచారం బయటపడుతోంది.) 2001 అక్టోబర్‌లో, పట్టణాభివృద్ధి మంత్రిత్వ శాఖను కూడ నిర్వహిస్తున్న అప్పటి ముఖ్యమంత్రి దేశముఖ్ ఈ సొసైటీకి ఇవ్వబోయే స్థలం పక్కనే ఉన్న రోడ్డు వెడల్పు తగ్గిస్తూ, ఆ స్థలాన్ని కూడ సొసైటీకి ఇవ్వడానికి మార్గం సుగమం చేశాడు. కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖ నుంచి ఈ భవన నిర్మాణానికి అనుమతి రాకపోయినా, వచ్చిందని తప్పుడు ఆధారం సృష్టించి బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్‌ను తప్పుదారి పట్టించడంలో కూడ దేశముఖ్ చెయ్యి ఉంది. ఇందుకు ప్రతిఫలంగానే కావచ్చు, దేశముఖ్ చెప్పిన ముగ్గురు వ్యక్తులకు ఈ భవనంలో ఇళ్లు ఇచ్చారు. ఆ తర్వాత ముఖ్యమంత్రిగా వచ్చిన షిండే కూడ 2003 మార్చిలో ఈ భవనానికి కేంద్ర ప్రభుత్వ అనుమతి వచ్చిందని తప్పుడు ప్రకటన చేశాడు. చివరికి ముఖ్యమంత్రిగా 2004 జూలైలో ఈ స్థలాన్ని సొసైటీకి కేటాయించాడు. దానికి ప్రతిగా షిండే సన్నిహితుడి తండ్రికి ఒక ఫ్లాట్ అందింది. ఆ తర్వాత 2007 ఆగస్టులో సైనికేతర వ్యక్తులను సొసైటీ సభ్యులుగా తీసుకుంటున్నప్పుడు అప్పటి రెవెన్యూ మంత్రి రాణే బంధువు ఒకరు సభ్యులయ్యారు. ఇక చవాన్ భార్య సోదరుడు, సోదరి, తల్లి ముగ్గురూ కూడ ఈ సొసైటీలో సభ్యులే. వారు తన కుటుంబ సభ్యులు కారని, తన కుటుంబం అంటే తన భార్య, తన ఇద్దరు పిల్లలు మాత్రమేనని చవాన్ వాదిస్తున్నారు.

ఇంతమంది ముఖ్యమంత్రుల అండతో తయారయిన ఆదర్శ్ హౌజింగ్ సొసైటీ సాగించిన చట్ట అతిక్రమణలకు లెక్కలేదు: ఈ స్థలం సముద్రతీరానికి దగ్గరగా, కోస్టల్ రెగ్యులేషన్ జోన్ 2 లో ఉంది గనుక ఇక్కడ ఏ నిర్మాణం జరపాలన్నా, కోస్టల్ జోన్ మేనేజిమెంట్ అథారిటీ, కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖ అనుమతులు కావాలి. కాని దీనికి ఏ అనుమతులూ లేవు. పైగా ఇద్దరు ముఖ్యమంత్రులు పర్యావరణ,

అటవీ మంత్రిత్వ శాఖ నుంచి అనుమతి వచ్చిందని ముంబయి మున్సిపల్ కార్పొరేషన్‌కు అబద్ధం చెప్పారు. నిబంధనల ప్రకారం ఈ ప్రాంతంలో భవనాల ఎత్తు స్థల వైశాల్యానికి 1.33 రెట్లకు మించకూడదు. కాని ఆ నిబంధనలను అతిక్రమించి 103 మీటర్ల ఎత్తయిన భవనం నిర్మించారు. ఈ స్థలం పక్కనే మొదట ఒక బస్‌డిపో కోసం స్థలం కేటాయించి, భవనం ఎత్తు పెంచడం కోసం ఆ స్థలాన్ని కూడ కలిపి లెక్కించారు. నిజానికి ఇక్కడ మొదట ఆరు అంతస్తుల భవనం కోసం మాత్రమే అనుమతి మంజూరయింది. ఆ తర్వాత దాన్ని ఎనిమిది అంతస్తులుగా మార్చారు. ఆ తర్వాత 14 అంతస్తులకు, 52 ఫ్లాట్స్‌కు మార్చారు. చివరికి 31 అంతస్తులకు మార్చారు.

ఈ స్థలం మొత్తం వైశాల్యం 6,450 చదరపు మీటర్లు. ముంబాయిలో ఈ ప్రాంతంలో ఉన్న మార్కెట్ ధరలను బట్టి ఈ స్థలం ఖరీదు రు. 50-60 కోట్లు ఉంటుంది. కాని ప్రభుత్వానికి ఆదర్శ్ సొసైటీ రు. 16 కోట్లు మాత్రమే చెల్లించింది. సొసైటీలో మొదట 30 మంది సభ్యులే ఉండేవారు. కాని ఎడాపెడా సభ్యులను చేరుస్తూ వెళ్లి సభ్యుల సంఖ్య మొదట 70కి, ఆతర్వాత 103కు పెంచారు. 625 చదరపు అడుగులు, 1000 చదరపు అడుగులు ఉండే ఫ్లాట్లను ఒక్కొక్కటి రు. 50 నుంచి రు. 80 లక్షలకు అమ్మారు. కాని ఇక్కడ అటువంటి ఒక ఫ్లాట్ రు. 6 కోట్ల నుంచి రు. 9 కోట్ల వరకు ఖరీదు చేస్తుంది. అంటే ఒక్కొక్క రాజకీయ నాయకుడికి ఒక్క ఫ్లాట్ ఇచ్చినా రు. 5 నుంచి 8 కోట్లు ఇచ్చినట్టేనన్నమాట.

ప్రస్తుతం ఈ కుంభకోణం మీద కేంద్ర నేర పరిశోధక శాఖ దర్యాప్తు జరుగుతోంది. కేసులు నడుస్తున్నాయి. అశోక్ రావు చవాన్ తన పదవి నుంచి దిగిపోయాడు. కాని ఆ కుంభకోణానికి సంబంధించిన వాస్తవాలను బయటపెట్టే కీలకమైన ఫైళ్లు, కాగితాలు కనిపించడం లేదని వార్తలు వస్తున్నాయి.

కార్గిల్ మృతుల బంధువులు, మాజీ సైనికాధికారుల పేరు చెప్పి ముంబై సముద్రతీరంలో వెయ్యి కోట్ల రూపాయల పైన ఖరీదు చేసే భవనం ఇన్నిన్ని అక్రమాలతో నిర్మిస్తుంటే రెండు పార్టీలకు చెందిన నలుగురు ముఖ్యమంత్రులు, పది సంవత్సరాల కాలంలో పనిచేసిన వేరువేరు ప్రభుత్వాధికారులు ఈ అక్రమాల పరంపరకు వత్తాసు పలికారంటే, ఉద్దేశపూర్వకంగానే అబద్ధాలు చెపుతూ, చట్టబద్ధ సంస్థలను మోసగించారంటే ఈ దేశం ఎట్లా దొంగల దోపిడీకి నిలయమయి పోతున్నదో తెలియడం లేదా? అధికారంలో ఉన్నవారు, మంత్రులుగా, ముఖ్యమంత్రులుగా ఉన్నవారు, అందరికన్నా పెద్ద దొంగలుగా వ్యవహరిస్తున్నారని స్పష్టం కావడం లేదా? ఇప్పటికీ చట్టాలు పవిత్రమైనవని, చట్టాలను గౌరవించాలని, ముఖ్యమంత్రి, ప్రజా ప్రతినిధులు అనే పదవులు ప్రజాస్వామికమైనవని, గౌరవించవలసినవని అనుకునేవాళ్ళు ఎంత అమాయకులయి ఉండాలి?

### 2జి స్పెక్ట్రం

దాదాపు రెండు సంవత్సరాలుగా ఎక్కడో ఒకచోట, ఏదో ఒక స్థాయిలో తెలిసిన 2 జి స్పెక్ట్రం అమ్మకాల కుంభకోణం కాగ్ నివేదికతో హఠాత్తుగా బయటపడింది.

ఈ 2 జి స్పెక్ట్రం అనేది ఒక విచిత్రమైన ఆలీబాబా నలభై దొంగలను మించిన బందిపోటు కథ. 2జి అంటే రెండవ జనరేషన్ - తరం. స్పెక్ట్రం అంటే విద్యుదయస్కాంత తరంగాల పరిధి. గాలిలో విద్యుదయస్కాంత తరంగాలు అత్యంత వేగంగా పయనిస్తూ క్షణాల్లో భూగోళాన్ని చుట్టిరాగలవు. ధ్వనిని ఏ స్థాయిలో విద్యుదయస్కాంత తరంగాలుగా మారిస్తే ఎంత సమర్థంగా, ఎంత వేగంగా ఆ తరంగాలు ప్రయాణించగలవు అనేదాన్ని బట్టి స్పెక్ట్రం నిర్ణయమవుతుంది. దాన్ని మెగాహెర్జ్ అనే ప్రమాణంతో కొలుస్తారు. గత రెండు దశాబ్దాలలో ఈ స్పెక్ట్రం విషయంలో జరిగిన పరిశోధనల వల్ల, అన్వేషణల వల్ల వైర్‌లెస్ (సెల్‌ఫోన్) సంభాషణలకు, వైర్‌లెస్ లిఖిత సమాచార వినిమయానికి (ఎస్.ఎం.ఎస్. - ఇంటర్నెట్-డాటా ట్రాన్స్‌ఫర్) అవకాశం వచ్చింది. ఈ అవకాశాలను రెండవతరం అన్వేషణలు అంటారు. మూడవతరం అన్వేషణలు కూడ సాగి చిత్రాలను కూడ వైర్‌లెస్‌లో పంపే అవకాశం వచ్చింది.

ఈ రెండవతరం స్పెక్ట్రం అమ్మకాలలో జరిగిన అక్రమాల గురించి, దోపిడీ గురించి చెప్పుకోబోయే ముందు ఒక నవలను గుర్తు చేసుకోవాలి. కెన్యన్ రచయిత గూగీ వా థియోంగో నవల 'డెవిల్ ఆన్ ది క్రాస్' (మట్టికాళ్ల మహారాక్షసి)లో అంతర్జాతీయ దోపిడీ దొంగల సమావేశంలో ఒక్కొక్క బందిపోటూ వచ్చి తాను ఎంత తెలివైన దొంగతనం చేశాడో, ప్రజలను ఎట్లా మోసం చేసి ఎంత సంపాదించాడో చెపుతుంటాడు. భూమిని అమ్మినవాళ్లు, చదువును అమ్మినవాళ్లు, నీటిని అమ్మినవాళ్లు, తిండిని అమ్మినవాళ్లు, చివరికి ప్రాణవాయువును అమ్మినవాళ్లు ప్రజలకు అత్యవసరమైన వస్తువులమీద తమ ఆధిపత్యం సంపాదించుకుని, అమ్మి ఎట్లా ఇబ్బడిముబ్బడిగా డబ్బు సంపాదించారో చెపుతూ ఉంటారు. 1970ల చివర రాసిన ఆ నవలలో గూగీ ప్రాణవాయువును పొట్లాలు కట్టి అమ్మే దొంగలు వస్తారని కూడ ఊహించారుగాని, ఆయన ఊహను కూడ మించి గాలిని కూడ అమ్మే దొంగలు ఇప్పుడు భారత రాజకీయాల్లో, వ్యాపారంలో తేలారు.

రెండవతరం స్పెక్ట్రం గురించి ఇంకా తెలియక ముందే భారత దేశంలో టెలికమ్యూనికేషన్స్ రంగంలో లాభార్జనకు చాల అవకాశాలున్నాయని దేశదేశాల సంపన్నుల, బహుళజాతి సంస్థల నోళ్లు ఊరడం మొదలయింది. నూతన ఆర్థిక విధానాలు మొదలైనప్పటినుంచీ టెలికాం రంగాన్ని ప్రైవేటీకరించమని, ప్రభుత్వరంగ పెట్టుబడుల ఉపసంహరణ జరపమని ఒత్తిడి పెరుగుతోంది. అప్పటివరకూ టెలికమ్యూనికేషన్స్ రంగం పూర్తిగా ప్రభుత్వ అధీనంలోనే ఉండేది. వైర్ల సహాయంతో సాగే టెలికమ్యూనికేషన్స్ ప్రభుత్వరంగ సంస్థల కింద, వైర్‌లెస్ టెలికమ్యూనికేషన్స్ రక్షణ, శాంతి భద్రతల వ్యవస్థల కింద ఉండేవి. ఈ రెండిటినీ కూడా ప్రైవేట్ రంగంలోకి మార్చాలని అంతర్జాతీయంగా బహుళజాతి సంస్థల నుంచీ, దేశంలోని బహుళజాతి సంస్థల దళారీల నుంచీ ఒత్తిడి 1990లకు ముందు నుంచే సాగుతోంది. ప్రభుత్వాలు కూడ క్రమక్రమంగా ప్రభుత్వ రంగ సంస్థల పెట్టుబడులు ఉపసంహరిస్తూ, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిపై ఆంక్షలు ఎత్తివేస్తూ, సాంకేతిక పరిజ్ఞానం దిగుమతి ద్వారా ప్రజలకు హెచ్చు అవకాశాలు కల్పిస్తున్నామని ప్రగల్భాలు పలుకుతూ రాజమార్గంలోనూ, దొడ్డిదారిలోనూ టెలికాం రంగాన్ని బహుళజాతి సంస్థల చేతుల్లో పెట్టింది. అందుకే రెండు దశాబ్దాలలో ప్రభుత్వరంగ సంస్థలయిన భారతీయ సంచార్ నిగమ్ లిమిటెడ్ (బి.ఎస్.ఎన్.ఎల్.), మహానగర్ టెలిఫోన్స్ నిగమ్ లిమిటెడ్ (ఎం.టి.ఎన్.ఎల్.), ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ (ఐటిఐ), హిందుస్తాన్ కేబుల్స్ లిమిటెడ్ (ఎచ్.సి.ఎల్.) వంటివి చితికిపోతుండగా దేశదేశాల

టెలికాం కంపెనీలు ఇక్కడ తమ ప్రాబల్యాన్ని, మార్కెట్లను, లాభాలను పెంచుకుంటున్నాయి. ఈ క్రమంలో 1991 నుంచి 1996 దాకా పి. వి. నరసింహారావు మంత్రివర్గంలో టెలికాం మంత్రిగా పనిచేసిన సుఖ్‌రాం హిమాచల్ ఫ్యూచరిస్టిక్ కంపెనీ అనే పేరుతో నాణ్యతలేని టెలికాం యంత్రపరికరాల దిగుమతికి అనుమతించి, ఐ.టి.ఐ. ని దెబ్బతీసి ఆరోజుల్లోనే రు. 3000 కోట్ల అవినీతికి తెరతీశారు. ప్రైవేటు కంపెనీలను అనుమతించే జాతీయ టెలికాం విధానం కూడ అప్పుడే అమలులోకి వచ్చింది.

ఆ తర్వాత సాంకేతిక పరిజ్ఞానంలో కూడ వేగవంతమైన మార్పులు వచ్చాయి. వైర్‌లెస్ సాంకేతిక పరిజ్ఞానం విస్తరించి, సెల్‌ఫోన్ వాడకందార్ల సంఖ్య పెరిగి, భారత మార్కెట్ ప్రపంచంలోనే పెద్ద మార్కెట్లలో ఒకటిగా లాభసాటిగా మారింది. అంతర్జాతీయ టెలికాం వ్యాపారులు, బహుళజాతి సంస్థలు, బ్రోకర్లు భారత మార్కెట్ లో ప్రవేశించడానికి మార్గాలు వెతకడం మొదలయింది. దేశాన్ని సర్కిళ్లుగా విభజించి, ఆ సర్కిళ్లలో సెల్‌ఫోన్ సర్వీసులు అందజేయడానికి ప్రైవేట్ కంపెనీలకు అప్పగించడం, మొదట రెండు ప్రైవేట్ కంపెనీలతో ప్రారంభించి, దాన్ని విస్తరించడం, సాంకేతిక పరిజ్ఞానం పెరిగినకొద్దీ, కొత్త కొత్త సర్వీసుల అవకాశాలను అమ్మకానికి పెట్టడం సాగుతూ వచ్చాయి. ఇలా బహుళజాతి సంస్థలతోనూ, వారి దళారులతోనూ నిరంతర బేరసారాలు జరిపే అవకాశం ఉండడంతో, ఆ బేరసారాలలో ముడుపులకు అవకాశం ఉండడంతో టెలికాం శాఖలో నిర్ణయాధికారంగల ఉన్నతోద్యోగాల కోసం, అత్యున్నతాధికారం గల కేంద్ర మంత్రి పదవి కోసం వెంపరలాట మొదలయింది. అలా 2004 ఎన్నికల తర్వాత కాంగ్రెస్ ను బలపరచి కేంద్ర మంత్రివర్గంలో చేరడానికి తనకు టెలికాం మంత్రిత్వశాఖ కావాలని డి.ఎం.కె. బేరాలాడింది. ఆ పదవిలో మూడు సంవత్సరాలు ఉన్న దయానిధి మారన్ అవినీతి ఆరోపణలపై రాజీనామా చేసిన తర్వాత కూడ ఆ మంత్రిత్వశాఖ తనకే కావాలని అడిగిన డి.ఎం.కె. ఎ. రాజాకు ఆ పదవి ఇచ్చింది.

టెలికాం మంత్రిగా రాజా 2008 జనవరిలో 2జి స్పెక్ట్రం కోరుతూ దరఖాస్తులు పెట్టుకున్న కంపెనీలలో అర్హులకు లైసెన్సులు ఇచ్చేందుకు అప్పటికే ఏర్పడి ఉన్న వేలం పద్ధతులకు, ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయం అందజేసే వారికి లైసెన్సు ఇచ్చే పద్ధతులకు భిన్నంగా మొదట వచ్చిన వారికి మొదట లైసెన్సు అనే పద్ధతి ప్రవేశపెట్టారు. (నిజానికి ఇది కూడ రాజా ప్రారంభించినది కాదు, ఎన్.డి.ఎ. ప్రభుత్వ కాలంలో టెలికాం మంత్రిగా పనిచేసిన అరుణ్ శౌరి 2003లోనే ఈ పద్ధతి ప్రారంభించాడు). ఆరకంగా కంపెనీల చరిత్ర, గత పనితీరు, ఆర్థిక సామర్థ్యం, సాంకేతిక సామర్థ్యం వంటివేవీ పరిగణనలోకి తీసుకోకుండా 122 లైసెన్సులను మంజూరు చేశారు. ఈ కొత్త సాంకేతిక పరిజ్ఞానం వల్ల రోజురోజుకూ ధరలు పెరుగుతుండగా, 2008లో ఇచ్చిన ఈ లైసెన్సుల మంజూరీ 2001 ధరల ప్రకారం జరిగింది. ఇలా ఏడు సంవత్సరాల వెనకటి ధరల మీద ఇంత లాభసాటి వ్యాపార అవకాశాన్ని అప్పగించడంలో ఏదో కుంభకోణం ఉన్నదని అప్పుడే కొన్ని పత్రికలు రాశాయి. కొందరు రాజకీయ నాయకులు మాట్లాడారు. కానీ, ఆ విమర్శలు ముందుకు సాగలేదు.

ప్రభుత్వంలోని వివిధ విభాగాల పనితీరు మీద, ముఖ్యంగా ఆర్థిక నిర్వహణమీద చట్టబద్ధంగా పర్యవేక్షణ జరిపి, పార్లమెంటుకు నివేదిక సమర్పించే కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (సి ఎ జి) ఈ లైసెన్సుల పంపిణీని పరిశీలించినప్పుడు లెక్కలేనన్ని అవకతవకలు కనబడ్డాయి. ఇచ్చిన 122 లైసెన్సులలో 85 లైసెన్సులు పొందిన కంపెనీలకు నిబంధనల ప్రకారం ఉండవలసిన అర్హతలు లేవని తేలింది. ఇటువంటి అనర్హ కంపెనీలలో యునిటెల్ గ్రూపు, వీడియోకాన్ ఉన్నాయి. అలాగే నిబంధనలు విరుద్ధంగా రిలయన్స్ గ్రూపు మరొక సంస్థలో హెచ్చు వాటా తీసుకుని ఆ కంపెనీ పేరుమీద లైసెన్సు పొందింది. ఇంకా ఘోరంగా, 2008 జనవరిలో ఇలా రు. 1,357 కోట్ల లైసెన్సు ఫీ చెల్లించి లైసెన్సు పొందిన కంపెనీ ఒకటి సెప్టెంబర్‌లో తన కంపెనీలో 45 శాతం వాటాను ఒక దుబాయి కంపెనీకి రు. 4,500 కోట్లకు అమ్మింది. అంటే, రు. 1,357 కోట్లకు కొన్న వ్యాపార అవకాశం ఎనిమిది నెలలు తిరగకుండానే రు. 10,000 కోట్ల అవకాశంగా మారిందన్న మాట. అలాగే మరొక కంపెనీ రు. 1,651 కోట్లకు సంపాదించిన లైసెన్సులో 60 శాతం వాటాను రు. 6,200 కోట్లకు అమ్మింది. ఈ మారుబేరం చేసిన దొంగ కంపెనీలకు తమిళనాడులో డి.ఎం.కె. ప్రభుత్వంతో కూడ సత్సంబంధాలున్నాయనీ, ఆ కంపెనీ తమిళనాడులో కూడా వ్యాపారాలు నిర్వహిస్తోందనీ తేలింది. స్వయంగా రాజా భార్య ఈ దొంగ కంపెనీకి డైరెక్టర్ల బోర్డులో ఉన్నారు. మొత్తం మీద ఈ అక్రమ లైసెన్సుల వల్ల దేశ ఖజానాకు రావలసి ఉండిన రు. 1,76, 645 కోట్లు రాకుండా పోయి నష్టం వాటిల్లిందని కాగ్ నివేదిక తెలియజెప్పింది.

ఈ నివేదిక గురించి తర్జనభర్జనలు జరుగుతుండగానే, 3జి స్పెక్ట్రం వేలం జరిగింది. ఆ వేలం పాటలో ప్రభుత్వానికి ఒక లక్షా ఆరు వేల కోట్ల రూపాయల ఆదాయం రావడంతో, 2జి స్పెక్ట్రం వేలం జరిగి ఉంటే తప్పనిసరిగా ఎక్కువ ఆదాయం వచ్చి ఉండేదనే నిర్ధారణ జరిగింది. రాజా తన పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది.

ఈ కథ ఇంతటితో అయిపోలేదు. 2009 ఎన్నికల తర్వాత కూడ కేంద్ర ప్రభుత్వానికి డి.ఎం.కె. మద్దతు అవసరమయింది గనుక మంత్రి పదవుల కోసం బేరంలో రాజా తనకు టెలికాం మంత్రిత్వపదవే కావాలని పట్టుపట్టాడు. ఆ పదవి ఆయనకు ఇప్పించడానికి అటు రిలయన్స్ అంబానీలకు, ఇటు టాటాలకు ప్రజాసంబంధాలు, పైరవీలు చేసిపెట్టే నీరా రాడియా అనే మహిళ వీర్ సంఘ్వీ, బర్ఖా దత్ వంటి జర్నలిస్టులతోనూ, భాజపా నాయకుడు వాజపేయి అల్లుడు రంజన్ భట్టాచార్యతోనూ జరిపిన సంభాషణల రికార్డులు సుప్రీం కోర్టు ముందుకు చేరాయి. ఆ సంభాషణల్లో స్వయంగా రాజా 'నన్ను ఇంకో అయిదేళ్లు భరించాల్సి ఉంటుందని మిత్తల్‌కు చెప్పండి' అన్నాడంటే బెదిరింపులూ, బేరసారాలూ ఏ స్థాయిలో జరిగాయో అర్థమవుతుంది. సునీల్ మిత్తల్ టెలికం వ్యాపారవేత్త, ఎయిర్‌టెల్ యజమాని.

కామన్‌వెల్త్ గేమ్స్ నిర్వహణలో జరిగిన కోట్ల రూపాయల కుంభకోణం వార్తలు ఇంకా చల్లారకముందే ఆదర్శ్ హౌజింగ్ సొసైటీ కుంభకోణం బయటపడి మహారాష్ట్ర ముఖ్యమంత్రి పదవి నుంచి దిగిపోవలసి వచ్చింది. ఆ కుంభకోణం వార్తలు అలా ఉండగానే 2జి స్పెక్ట్రం అమ్మకాలలో టెలికాం మంత్రిత్వశాఖ అక్రమాల గురించి కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదికలు, కేంద్ర ఆర్థిక మంత్రిత్వశాఖ సుప్రీంకోర్టుకు సమర్పించిన ఫోన్ సంభాషణల రికార్డులు బయటపడ్డాయి. టెలికాం మంత్రి ఎ రాజా రాజీనామా చేయవలసి వచ్చింది. ఈ కుంభకోణం మీద పూర్తి విచారణ కోసం సభాసంఘాన్ని

వేయాలని డిమాండ్ మీద పార్లమెంటు సమావేశాలు అట్టుడుకుతుండగానే ఎల్.ఐ.సి. హౌజింగ్ ఫైనాన్స్, కొన్ని బ్యాంకులు, కొన్ని రియల్ ఎస్టేట్ కంపెనీలు కలిసి సాగించిన వేల కోట్ల రూపాయల గృహ రుణాల కుంభకోణం వార్తలు వస్తున్నాయి.

ఈ మూడు కుంభకోణాలు ఈ రెండునెలలవే కాగా యుపిఎ పాలన అంతా కుంభకోణాల రాజ్యమేనని పత్రికలు రాస్తున్నాయి. ఈ మూడు కుంభకోణాల కంటె ముందు ఐపిఎల్ కుంభకోణం, జలాంతర్గాముల కొనుగోలు కుంభకొణం, బియ్యం ఎగుమతుల కుంభకోణం, అణు ఒప్పందం సందర్భంగా పార్లమెంటు సభ్యులకు డబ్బు ఇవ్వజూపిన కుంభకోణం, ప్రసారభారతి కాంట్రాక్టుల కుంభకోణం వంటివి ఎన్నో రెండోసారి యుపిఎ అధికారానికి వచ్చిన తర్వాతనే జరిగాయి. ఇక మొదటి యుపిఎ పాలనాకాలంలో కూడ ఇటువంటి కుంభకోణాలకు, అవినీతికి తక్కువేమీలేదు.

ప్రపంచీకరణ మొదలయిన తర్వాత దేశంలో అవినీతి, కుంభకోణాలు, చీకటి బజారు పెరిగిపోయాయంటూ 1999లో 'బ్లాక్ ఎకానమీ ఇన్ ఇండియా' రాసిన ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర అధ్యాపకులు అరుణ్ కుమార్ ప్రస్తుతం జాతీయాదాయంలో సగం ఇటువంటి అక్రమ ధనంతోనే నిండి ఉన్నదని అంటున్నారు. ఆర్థిక వ్యవస్థలోకి ఎక్కువ డబ్బు ప్రవహించడమంటే ఎక్కువ అవినీతికి తావు దొరకడమే అంటున్న అరుణ్ కుమార్ 1980లలో మొత్తం మీద పెద్ద అవినీతికుంభకోణాలు బోఫోర్స్ కుంభకోణంతో సహా 8 నమోదయ్యాయని, 1990లలో వాటి సంఖ్య 26కు పెరిగిందని, ఈ దశాబ్దంలో దాదాపు నెలకు ఒకటి చొప్పున బయటపడుతున్న కుంభకోణాలు మూడంకెల సంఖ్యలో ఉండవచ్చునని అన్నారు. నీతిమంతుడుగా, నిరాడంబరుడుగా పేరున్న డా. మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా, ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడే పరిస్థితి ఇలా ఉందంటే తన చుట్టూ జరుగుతున్న అవినీతి పట్ల ఆయన కళ్లు మూసుకుని ఉన్నారనుకోవాలి.

క్రీడలు, ఎగుమతులు, భూమి, సముద్ర తీరాలు, శవపేటికలు, రక్షణ సామగ్రి, ఖనిజాలు, కార్గిల్ యుద్ధంలో పాల్గొన్న సైనిక కుటుంబాల పేరు మీది గృహాలు, ధ్వనితరంగాలను పంపే గాలి, లేని మనుషుల పేర్లమీద గృహ రుణాలు మంజూరు చేయడం...అవినీతికి ఆలవాలం కాని ఒక్కటంటే ఒక్క సామాజిక రంగం కూడ లేని స్థితి సూచిస్తున్నదొక్కటే. ఈ వ్యవస్థ యథాతథంగా కొనసాగడానికి వీలులేనంతగా కుళ్లిపోయిందని. అరవై సంవత్సరాలుగా రాజ్యాంగం హామీ ఇచ్చిన ఏ ఒక్క హక్కూ అందక, కూడూ గూడూ గుడ్డా వంటి కనీసావసరాలు తీరక, అవి తీర్చమని అడిగితే లాఠీలూ తూటాలూ చెరసాలలూ జవాబు చెపుతున్న జీవన వాస్తవం ఒకవైపు, అధికారం చేజిక్కించుకుని, ఆ అధికారాన్ని అడ్డుపెట్టుకుని వందల, వేల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని కైంకర్యం చేస్తున్న పిడికెడు మంది సంపన్నులూ రాజకీయవేత్తలూ అధికారులూ ఒకవైపు ఉన్నప్పుడు మౌనంగా ఉండడం నేరం కాదా? ఆ అసహ్యకరమైన సంపద పోగుచేస్తున్న వారిమీద రాయయినా విసరడం కర్తవ్యం కాదా?

*(రచయిత పాత్రికేయులు)*

*అమెరికా బహుళజాతి కంపెనీల వ్యాపార ప్రయోజనాల కోసం, భారత ప్రజలను నష్టపరిచే అనేక వ్యాపార ఒప్పందాలు చేసుకోవడం కోసం ఒబామా పర్యటించారని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

# ఒబామా పర్యటనతో లాభపడిందెవరు?

ఒబామా తన పది రోజుల ఆసియా పర్యటనలో తొలి మజిలీగా చైనా తరువాత అతి పెద్ద మార్కెట్‌ను కలిగివున్న భారత్‌ను ఎంచుకున్నాడు. ఈ పర్యటనకు బయలుదేరడానికి ముందు న్యూయార్క్ టైమ్స్ పత్రికకు ఆయన ఒక వ్యాసం రాస్తూ "నూతన మార్కెట్లలో నూతన ఖాతాదారుల కోసం ప్రయత్నించడమే" తన పర్యటన ఉద్దేశమని పేర్కొన్నాడు. అమెరికా కాంగ్రెస్ ఎగువ, దిగువ సభలకు ఇటీవల జరిగిన ఎన్నికల్లో ప్రతిపక్ష రిపబ్లికన్ పార్టీ చేతుల్లో ఘోర పరాజయం మూట కట్టుకున్న తరువాతే బరాక్ ఒబామా భారత్‌లో మూడు రోజుల పర్యటనకు బయల్దేరాడన్నది బహిరంగ రహస్యమే. ఆయన భార్య మిషెల్, 2 వేల మంది మార్బలం, 200 మంది అమెరికా బహుళజాతి సంస్థల సి.ఇ.ఒ.లతో కలిసి నవంబర్ 6న ముంబాయి చేరుకున్నాడు. తొలిరోజే ఏవియేషన్, విద్యుత్, హోమ్‌లాండ్ సెక్యూరిటీ, రైల్వేస్ తదితర రంగాల్లో సుమారు (పది బిలియన్ డాలర్లు) నలభై నాలుగు వేల కోట్ల రూపాయలు విలువ చేసే ఒప్పందాలు కుదిరాయి. అదేరోజు అమెరికా – ఇండియా బిజినెస్ కౌన్సిల్‌లో ఒబామా ప్రసంగించాడు. భారతీయ పారిశ్రామిక వేత్తలతో భేటీ అయ్యాడు. మొత్తంగా 20 ఒప్పందాలు ఖరారైనట్లు ఆయన తెలిపాడు. అమెరికా అధ్యక్షుడు ఏ దేశంలో పర్యటించినా దాని పరమార్థం అగ్ర రాజ్య ప్రయోజనాలేనన్నది వేరే చెప్పనక్కర లేదు. పైకి కన్పించే ఒప్పందాలు, అవగాహన పత్రాలపై సంతకాలు వంటివి ఎన్ని ఉన్నా అమెరికా వేసే ప్రతి అడుగు వెనకా 'వ్యూహాత్మక లక్ష్యం' ఉంటుంది. అవి భౌగోళిక రాజకీయాలు కావచ్చు లేదా మార్కెట్ ప్రయోజనాలు కావచ్చు. ఒబామా భారత్ పర్యటన ఇందుకు మినహాయింపు కాదు.

1930 నాటి ఆర్థిక మాంద్యం తర్వాత అంతటి క్లిష్ట పరిస్థితిని అమెరికా 2008 నుంచి అనుభవిస్తోంది. అప్పటిలా తిరిగి సాంకేతిక పరిజ్ఞానం మరో అడుగు ముందుకు వేస్తే సమస్య పరిష్కరించుకోగల స్తోమత వ్యవస్థాగతంగానే అమెరికాకు ప్రస్తుతం లేదు. ఎందుకంటే మరింత సాంకేతిక వృద్ధి, మరింత నిరుద్యోగాన్ని పెంచే స్థితి దీనికి కారణం. విస్తరించడానికి కావలసిన మార్కెట్లు కూడా నేడు లేవు. కాబట్టి అమెరికాలో గుట్టలుగా పోగుపడిన ఆయుధాలు, యుద్ధ విమానాలు అమ్ముకోవడమొక్కటే ఆ దేశ పాలకులకు మిగిలిన చివరి ఆశ. ఎటొచ్చీ ఈ అంతిమ క్షణాల్లో అమెరికా ఆశలను చిగురింపజేసే పనికిమాలిన పనికి మన పాలకులు తోడ్పడటం దేశ ప్రజల దౌర్భాగ్యం. అమెరికాలో నెలకొన్న సంక్షోభ భారాన్ని మన నెత్తిన రుద్ది బయట పడాలని ఒబామా తాపత్రయపడుతున్నాడు. అందులో భాగంగానే అమెరికా అణు విద్యుత్ యంత్రాలు, యుద్ధ విమానాలు అమ్మడంతో పాటు ఆహార ధాన్యాలను మన దేశానికి ఎగుమతి చేసే విధంగా ఒప్పందాలు కుదుర్చుకోవడం జరిగింది. మన దేశ ఆర్థిక, వ్యవసాయ, బ్యాంకింగ్ రంగంలోకి అమెరికన్ బడా పెట్టుబడిదారులకు భాగస్వామ్యం కల్పించే విధంగా మనదేశంతో ఒప్పందాలు చేసుకొని మన దేశ ఆర్థిక వ్యవస్థను దెబ్బతీసి అమెరికా ఆర్థిక వ్యవస్థకు జవసత్వాలు కల్పించే లక్ష్యంతోనే ఒబామా భారత్ వచ్చాడు.

ఔట్‌సోర్సింగ్‌పై ఆంక్షలు తొలగించాలని, పౌర – సైనిక రంగాలు రెండింటిలోను వినియోగించే అత్యాధునిక సాంకేతిక విజ్ఞానం బదిలీపై నియంత్రణను తొలగించాలని, భద్రతా మండలిలో మన దేశానికి శాశ్వత సభ్యత్వ ప్రతిపాదనకు మద్దతు ఇవ్వాలనీ, ఉగ్రవాద చర్యలకు ఊతమిస్తున్న పాకిస్తాన్‌కు తీవ్ర హెచ్చరిక జారీ చేయాలని అమెరికా అధ్యక్షుడు ఒబామా నుంచి భారత్ ఆశించిన అంశాలు. అయితే వీటన్నింటిపై ఒబామా స్పందన నిరాశ పరచక పోయినా, ఇప్పటికిప్పుడు ఇవి సాకారమయ్యే అవకాశం లేదు. అంతేగాని భారత్‌కు మౌలిక సదుపాయాల కొరకు రాబోవు మూడేళ్లలో వెయ్యి కోట్ల డాలర్లు పెట్టుబడులు కావాలంటున్న మన్‌మోహన్‌సింగ్ అభ్యర్థనను మాత్రం పట్టించుకోలేదు. ఒబామా మాటలు 'ఎన్నడు చెల్లుతుందో తెలీని చెక్కు' లాంటివని చైనా విదేశాంగ శాఖ ప్రతినిధి హంగ్‌లీ పేర్కొనడం గమనార్హం.

భారతీయ కార్పొరేట్ రంగ ప్రతినిధుల సమావేశంలో గ్యారీలాక్‌తో కలిసి పాల్గొన్న భారత వాణిజ్య శాఖ మంత్రి ఆనంద శర్మ 'ఓ సమగ్ర ఆర్థిక భాగస్వామ్య ఒప్పందం కోసం సంప్రదింపులు ప్రారంభించాలి' అని అనగానే గ్యారిలాక్ 'అలాంటి ఒప్పందం పట్ల అమెరికా హడావిడి పడడం లేదని తన మాటల ద్వారా పరోక్షంగా వ్యక్తం చేశాడు. ప్రతీది దశల వారీగా జరుగుతుంది అని అంటూ భారతదేశంలో ఎఫ్.డి.ఐ. నిబంధనలు సంక్లిష్టంగా, పారదర్శక రహితంగా, వాణిజ్యానికి అవరోధం కల్గించే విధంగా ఉన్నాయన్నాడు. రిటైల్ రంగంలో ప్రత్యేకించి మల్టీ బ్రాండ్ రంగాలలో ప్రవేశాన్ని అనుమతించాలి. భారతదేశం వేగవంతంగా అభివృద్ధి చెందుతున్నందున కొన్ని నిర్దిష్ట రంగాలలో సరళీకరణ గురించి ఆలోచించాలని, లేకుంటే అభివృద్ధి మందగిస్తుందని' హెచ్చరించాడు.

ఔట్ సోర్సింగ్‌పై అమెరికన్లెలా భయపడుతున్నారో, వాల్‌మార్ట్ వంటి రిటైల్ దిగ్గజాలపై ఇండియన్లూ అలాగే భయపడుతున్నారని, ఈ రెండూ అర్థం లేని భయాలని అంటూనే తాను మాత్రం పెద్దన్న పాత్ర విడనాడ లేదు. ఒక పక్క తాను ఇతర దేశాలకు తలుపులు మూసేస్తూ మన దేశంలోని వ్యాపార పరిమితులను తొలగించాలనడం

సామ్రాజ్యవాద తత్వానికి నిదర్శనం. ఐ.టి. ఔట్ సోర్సింగ్ వ్యవహారంలో మరియు రక్షణాత్మకమైన వ్యాపార విధానాలను ప్రోత్సహించడం లాంటివి ఆ దేశం అవలంబిస్తున్న అసమాన వ్యాపార ధోరణులకు నిదర్శనం. భారతీయ ఐ.టి. కంపెనీలకు నష్టం చేకూర్చేలా పలు విధాన నిర్ణయాలను అమెరికా అమలులోకి తెచ్చింది. ఇమిగ్రేషన్‌పై ఆంక్షలు, హెచ్1, ఎల్1 వీసా ఫీజుల పెంపు, రహదారి భద్రతా చట్టం వగైరాలన్నీ భారత్‌కు నష్టం కలిగించేవే. పలు రంగాలలో భారత్‌లో ఇప్పుడున్న విదేశీ పెట్టుబడుల పరిమితిని 26 శాతం నుంచి 74 శాతానికి పెంచాలని అమెరికా వ్యాపార వేత్తలు కోరుతున్నారు. అలాగే ఆర్థిక సేవల్లో బహుళ వీధి చిల్లర వ్యాపార (రిటైల్) రంగంలో వ్యవస్థీకృత సంస్థలకు ప్రవేశం కల్పించాలని అమెరికా బహుళజాతి సంస్థలు పట్టుబడుతున్నాయి. అందువలన అమెరికా భారత్‌ను మార్కెట్ అవకాశాలు అపరిమితంగా ఉన్న దేశంగా మాత్రమే పరిగణిస్తుంది. అమెరికా ఒక అగ్ర రాజ్యంగా, సామ్రాజ్యవాద ప్రతినిధిగా తన స్వప్రయోజనాలకే ప్రాధాన్యత ఇస్తుందనేది జగమెరిగిన సత్యం.

పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో బరాక్ ఒబామా లోక్‌సభ రాజ్యసభ సభ్యులను ఉద్దేశించి నవంబర్ 8వ తేదీన దాదాపు 45 నిమిషాలు ప్రసంగించారు. భారత్-అమెరికా భాగస్వామ్యం వర్థిల్లాలి అంటూ ఆయన ప్రసంగం ముగిసింది. ఎవరైనా స్నేహం వర్థిల్లాలి అని చెబుతారు కానీ భాగస్వామ్యం వర్థిల్లాలి అనడంలో ఆయన భారత్ నుంచి ఆశిస్తున్న అంచనాలు వేరే ఉన్నాయని విదితం చేస్తోంది. అవి ప్రధానంగా ఉద్యోగ కల్పన, వ్యాపార సంబంధాలు, భద్రతా సహకారం, వ్యూహాత్మక భాగస్వామ్యం, అణు నిరాయుధీకరణలతో పాటు ఆసియా ఖండంలో చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను నిలుపడమేనన్న భౌగోళిక రాజకీయ ఎత్తుగడ తప్ప మరొకటి కాదు. అమెరికా చేస్తున్న తప్పుల్ని కప్పి పుచ్చి, వాస్తవాలను మరుగుపరిచిన ఒబామా అణ్వాయుధాల తయారీని నిరోధించటం, మానవ హక్కులు, ప్రజాస్వామ్యం, ఉగ్రవాదం గురించి సుద్దులు చెప్పడం మరీ హాస్యాస్పదంగా ఉంది. అబూ గ్రాహిబ్ జైలులో ఇరాకీ యుద్ధ ఖైదీలను చిత్ర హింసల పాలు చెయ్యడం, ఇరాక్, అఫ్ఘనిస్తాన్‌లలో సాగించిన నరమేధం అమెరికా వంచనకు పరాకాష్ట. 26/11 ముంబాయి కుట్రదారుడైన హెడ్లీ అమెరికాలో పట్టుబడినా ఎందుకు భారత్‌కు అప్పగించలేదు. అంతకంటే దారుణమైన భోపాల్ గ్యాసు దుర్ఘటనకు బాధ్యుడైన అండర్సన్ అమెరికాలోనే ఉంటున్నా దాని గురించి ఒబామా మాట్లాడరు. అణు కర్మాగారాలు కలిగి ఉందన్న సాకుతో ఇరాన్‌పై ఆంక్షలు, మరోవైపు యుద్ధానికి సన్నాహం, ఇదే సమయంలో ఇజ్రాయిల్ అణ్వాయుధాలు కలిగి ఉన్నప్పటికీ, పాలస్తీనియన్లను నిత్యం హింసిస్తుంటే అమెరికా దానికి వత్తాసు పలకటం ఏ ప్రజాస్వామిక, మానవ హక్కుల పరిరక్షణకు నిదర్శనం. నిజానికి టెర్రరిజాన్ని ప్రోత్సహిస్తున్నది అమెరికా. టెర్రరిస్టుగా వ్యవహరిస్తున్న అమెరికా టెర్రరిజాన్ని రూపుమాపాలని భారత్‌ను కోరడం విడ్డూరంగా ఉంది.

ఒబామా భారత్‌కు వచ్చింది పక్కా వ్యాపారం కోసమే. భారత్ అమెరికాల మధ్య వాణిజ్యం ప్రస్తుతమున్న స్థాయి నుండి రాబోయే ఐదేళ్లలో రెట్టింపు చేయాలని ఒబామా ఉద్ఘాటించాడు. రక్షణ రంగానికి సంబంధించిన ఒప్పందాలతో పాటు ఆరు లక్షల కోట్ల రూపాయలు విలువ చేసే అణు విద్యుత్ యంత్రాల కొనుగోలుకు సంబంధించిన ఒప్పందాలు చేసుకోవడమే ఆయన పర్యటన సారాంశం. ఒక వస్తువు అమ్మిన తర్వాత దాని వాడకం, మరమ్మత్తులు వంటి అన్ని హక్కులు కొనుగోలు దారుకు చెందుతాయి. కాని మెయింటెనెన్స్, మరమ్మత్తులు చేసే హక్కు కూడా (ఆర్డర్లు) అమెరికాకే ఉండాలని పట్టుబడుతుండడం శోచనీయం. అంటే అమెరికా నుండి కొనుగోలు చేసిన ఏ ఆయుధమైనా, యుద్ధ విమానమైనా స్వదేశీ సాంకేతిక పరిజ్ఞానంతో అభివృద్ధి పరుచుకోవడానికి వీలు లేదు. అంతేకాకుండా విడి భాగాలు కూడా వారినుండే కొనుగోలు చేయాలి. మరమ్మత్తులు వాళ్ల నిపుణులే చేయాలి. వారు విడి భాగాలు సరఫరా చేసేవరకు, వారి సాంకేతిక నిపుణులు వచ్చి మరమ్మత్తులు చేసే వరకు మన యుద్ధ విమానాలు నిరుపయోగంగా ఉండాల్సిందే. ఇది మన స్వతంత్రతను, ఎదుగుదలను నియంత్రించే కుతంత్రం కాదా? అణు విద్యుత్ రంగంలో కూడా అమెరికా వైఖరి ఇలాగే ఉంది. అణు విద్యుత్ యంత్రాల లోపం వలన ప్రమాదం సంభవిస్తే నష్ట పరిహారం (అది కూడా నామమాత్రం) యంత్రాల సరఫరాదారుడు భరించాలన్న నిబంధనలను మరింత సరళీకరించాలని అమెరికా పట్టుపడుతుంది.

గత కొంతకాలంగా ఆసియాలో అమెరికా ఆటలు సాగడం లేదు. చైనా కరెన్సీ యువాన్ విలువ పెంచాలని అమెరికా చేస్తున్న డిమాండ్‌ను చైనా అంగీకరించడంలేదు. స్థిరంగా ఉన్న యువాన్ విలువలో డాలర్ మారకం విలువ పతనమవుతున్న నేపథ్యంలో చైనా దిగుమతులను అమెరికా అడ్డుకునే పరిస్థితి నెలకొంది. అమెరికా-చైనా వాణిజ్యంలో అంతకంతకు చైనా ఆధిక్యత పెరుగుతున్నది. అందుకే చైనా అంటే గిట్టట్లేదు. అమెరికాకు అనుకూలంగా చైనా వినట్లేదన్న అక్కసుతో మన దేశాన్ని చైనాకు శత్రువుగా మార్చాలన్నది ఒబామా వ్యూహం. ఇది ఇరుగు పొరుగుతో భారత్‌కు తంపులు తెచ్చిపెట్టే కుతంత్రం తప్ప మరొకటి కాదు. చైనాను సాకుగా చూపి భారత్‌కు అధునాతన ఆయుధాలను, విమానాలను అమ్మడం ద్వారా అమెరికా కార్పొరేట్ శక్తులకు లాభాలు సంపాదించి పెట్టే ప్రయత్నం కూడా ఇందులో ఇమిడి ఉంది.

1998లో భారత్ నిర్వహించిన అణుపాటవ పరీక్షల దరిమిలా టెక్నాలజీకి సంబంధించి భారతీయ రక్షణ, అంతరిక్ష పరిశోధన సంస్థలపై విధించిన ఎగుమతుల ఆంక్షలను సడలించేందుకు ఆయన సంసిద్ధత వ్యక్తం చేశాడు. హామీలను గుప్పించడంతో పాటు రకరకాల భ్రమలకు లోను చేశాడు. అణు ఇంధన సరఫరా గ్రూపులో భారత్‌కు సభ్యత్వం, అమెరికా సాంకేతిక పరిజ్ఞానాన్ని సరఫరా చేయడంలో ఆంక్షలను పాటించే ఎంటిటీ జాబితా నుండి భారత్‌కు చెందిన సంస్థలను మినహాయించడం. అయితే అణు ఇంధన విభాగానికి సంబంధించిన సంస్థలను మాత్రం ఎంటిటీ జాబితా నుండి తొలగించలేదు. ఐక్యరాజ్య సమితిలోని భద్రతా మండలిలో భారత్ శాశ్వత సభ్యత్వం కొరకు మద్దతు ఇస్తామంటూనే 'భద్రతా మండలిలో సభ్యత్వమంటే శక్తి పెరిగిందనేందుకు నిదర్శనం. దాంతో పాటే బాధ్యతలు ఉంటాయి' అని ఒబామా వ్యాఖ్యానించాడు.

ఒబామా భారత్ పర్యటనకు బయల్దేరే ముందే దేశంతో కుదుర్చుకునే ఒప్పందాల జాబితాను ఇండియా రియల్‌టైమ్ వెబ్‌సైట్‌లో పోస్ట్ చేసింది. ఒబామా బయల్దేరే గంట ముందు ఈ ఒప్పందాలన్నింటినీ ముందుగానే ధ్రువీకరిస్తున్నట్లు అధ్యక్ష భవనం (వైట్ హౌస్) ప్రకటించింది. మొత్తం 53,670 ఉద్యోగావకాశాలు ఏర్పడతాయని వైట్‌హౌస్ తన ప్రకటనలో పేర్కొంది. ఈ కుదిరిన 20 ఒప్పందాల వల్ల భారత్‌కు ఒరిగింది పెద్దగా ఏమీ లేదు. భారత్‌లో ఉద్యోగ కల్పనా అవకాశాలు ఏమీ ఉండవు.

ఈ ఒప్పందంలోని ముఖ్యమైన విషయాలు: ఐదు వందల కోట్ల డాలర్ల విలువ గల రెండు కీలకమైన రక్షణ ఒప్పందాలున్నాయి. భారతదేశం పది 'సి-17 గ్లోబ్ మాస్టర్' సైనిక రవాణా విమానాలను అమెరికన్ బోయింగ్ కంపెనీ నుండి కొనుగోలు చేస్తుంది. భారీ రవాణాకు వినియోగించే ఈ సి-17 తరహా విమానాలకు అమెరికా వెలుపల భారత వాయుసేన యజమానిగా వ్యవహరిస్తుంది. దాదాపు 410 కోట్ల డాలర్ల విలువైన ఈ ఒప్పందం ద్వారా అమెరికాలో 22,160 ఉద్యోగావకాశాలు ఏర్పడతాయి. జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ (జి.ఇ.) నుండి 82 కోట్ల డాలర్ల ఖరీదైన ఎఫ్ - 414 ఇంజన్లు వందకు పైగా భారత్ కొనుగోలు చేస్తుంది. వీటిని తేలికపాటి యుద్ధ విమానాల్లో ఉపయోగిస్తారు. ఈ సంస్థ భారత వైమానిక అభివృద్ధి సంస్థతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం తేలికపాటి తేజస్ యుద్ధ విమానాలలో అమర్చేందుకు సరఫరా చేస్తుంది. ఈ కాంట్రాక్ట్ ద్వారా దేశంలో 4,440 ఉద్యోగావకాశాలు ఏర్పడతాయి. భారత్‌లోని ప్రముఖ ప్రైవేట్ వైమానిక సంస్థ స్పైస్ జెట్ కోసం చికాగో, ఇలినాయిస్‌లో ఉన్న బోయింగ్ కంపెనీ 30, బి 737-800 వాణిజ్య విమానాలను అందచేయనున్నది. 270 కోట్ల డాలర్ల విలువైన ఈ ఒప్పందం ద్వారా అమెరికాలో 12,970 ఉద్యోగావకాశాలు ఏర్పడతాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని సామర్లకోటలో రిలయన్స్ పవర్ కంపెనీ నిర్మిస్తున్న 2,500 మెగావాట్ల విద్యుత్ కేంద్రం కోసం ఆరు అత్యాధునిక 9 ఎఫ్.ఎ. గ్యాస్ టర్బయిన్లు, మూడు స్టీమ్ టర్బయిన్లు సరఫరా చేసే ఒప్పందాన్ని ఫెయిర్ ఫీల్డులో ఉన్న జి.ఇ. కంపెనీ దక్కించుకుంది. ఈ పరికరాల సరఫరా, నిర్వహణ కాంట్రాక్ట్ మొత్తం విలువ 76 కోట్ల డాలర్లు. ఈ ఒప్పందం ద్వారా అమెరికాలో 2,650 ఉద్యోగావకాశాలు ఏర్పడతాయి. 8 వేల మెగా వాట్ల గ్యాస్ ఆధారిత విద్యుత్ యూనిట్లు, రిలయన్స్‌కు 900 మెగావాట్ల పునరుత్పాదక ఇంధనాన్ని ఉత్పత్తి చేసేందుకు వీలుగా అమెరికా ఎక్సిం బ్యాంకు రిలయన్స్‌కు 500 కోట్ల డాలర్లు రుణం అందజేస్తుంది. రిలయన్స్ ఈ మొత్తంతో అమెరికా నుంచే సరుకులు, సేవల్ని కొనుగోలు చేయాల్సి ఉంటుంది.

భారత్ రైల్వే కూడా వందకోట్ల విలువగల డీజిల్ లోకోమోటివ్‌లను ఖరీదు చేస్తుంది. డీజిల్ లోకోమోటివ్‌లకు సంబంధించి జిఇ ట్రాన్స్‌పోర్టేషన్, ఎలక్ట్రిక్ లోకోమోటివ్ సంస్థలకు పదేళ్ల పాటు వెయ్యి డీజిల్ లోకోమోటివ్‌లను సరఫరా చేసే కాంట్రాక్ట్‌ను భారత రైల్వే మంత్రిత్వ శాఖ ప్రకటించింది. ఈ కాంట్రాక్ట్ విలువ సుమారు 100 కోట్ల డాలర్లు. మిల్వాకీకి చెందిన ప్రసిద్ధ హార్లీ డేవిడ్‌సన్ మోటార్ కంపెనీ భారత్‌లో తన మోటార్ సైకిల్ అసెంబ్లింగ్ యూనిట్‌ను ప్రారంభించనున్నట్లు ప్రకటించింది.

అంతేకాక భారత్‌లో ఈ సంస్థ తన మోటార్ సైకిళ్ల విక్రయానికి అడ్డుగా ఉన్న సుంకాల భారాన్ని కూడా ఈ యూనిట్ తగ్గిస్తుంది. భారత్‌లోని రిలయన్స్ పవర్‌కు చెందిన ససాన్ పవర్ కంపెనీకి ఎగుమతుల నిమిత్తం 90 కోట్ల డాలర్ల మేర ఎగుమతి ఆర్థిక హామీని అందించేందుకు అమెరికా ఎగ్జిం బ్యాంక్ గత అక్టోబర్ 21న ఒప్పందాన్ని కుదుర్చుకుంది. ఈ ఒప్పందం ద్వారా అమెరికాలో 3,460 ఉద్యోగావకాశాలు ఏర్పడనున్నాయి.

ముంబాయి నగరంలో నీటి సరఫరాకు సంబంధించి భూగర్భ సొరంగాలు, జల మార్గాల తవ్వకానికి అవసరమైన పరికరాల సరఫరాకు భారత్‌కు చెందిన ప్రముఖ ఇంజనీరింగ్ నిర్మాణ సంస్థ యూనిటీ ఐ.వి.ఆర్.సి.ఎల్‌తో ఒప్పందాన్ని కుదుర్చుకున్నట్లు ఓపియోలోని సోలోన్‌కు చెందిన రాబిన్స్ కంపెనీ ప్రకటించింది. దీనితోపాటు టన్నెల్ బోరింగ్ యంత్రాల సరఫరా, సాంకేతిక సహాయానికి సంబంధించి జయప్రకాశ్ అసోసియేట్స్‌తో కూడా రాబిన్స్ కంపెనీ ఒక ఒప్పందాన్ని కుదుర్చుకుంది. ముంబయికి సంబంధించిన ఎగుమతి కాంట్రాక్ట్ విలువే కోటి డాలర్లు.

వీటితో పాటు ఇంకా మహారాష్ట్ర హోమ్‌లాండ్ సెక్యూరిటీ పైలట్ ప్రాజెక్ట్, వేదాంత డ్యూక్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ ఏర్పాటు, గ్రామీణ టెలికమ్యూనికేషన్ల కోసం లాంగ్‌రేంజ్ ఏంటెన్నా వ్యవస్థల సరఫరా, ప్రీఫాబ్రికేటెడ్ గృహాల నిర్మాణం కోసం అవసరమైన పరికరాల సరఫరా, సెల్‌ఫోన్‌ల తయారీకి సంబంధించిన ఒప్పందం, విశిష్ట గుర్తింపు సంఖ్యల ప్రాజెక్టుకు సంబంధించిన సేవలు తదితర ఒప్పందాల ద్వారా అమెరికాలో మరికొన్ని ఉద్యోగావకాశాలు ఏర్పడనున్నాయి. ఇవన్నీ ముంబాయిలో మొదటి రోజే కుదుర్చుకున్న ఒప్పందం లోనివి.

ఇవిగాక మూడవరోజు ఢిల్లీలో మరో ఆరు ఒప్పందాలు కుదుర్చుకున్నది. ఈ ఒప్పందాల ప్రకారం గ్రామీణ ఇంధన రంగమైనా, వర్షాకాలంలో వాతావరణ మార్పులు కనిపెట్టేందుకు సహకారమైనా, టెలీకమ్యూనికేషన్ రంగమైనా అమెరికాకు చెందిన పరికరాలను, టెక్నాలజీని కొనుగోలు చేయవలసి వుంటుంది. వీటి మూలంగా ఇండియాలో ఉద్యోగ కల్పనలేవీ జరగవని కూడా ఒబామా స్వయంగా వివరించాడు. రాబోవు ఐదు సంవత్సరాల కాలంలో వాణిజ్యం యిరు దేశాల మధ్య 3,700 కోట్లు డాలర్ల నుండి 1,200 కోట్ల డాలర్లకు పెరుగుతుందన్నాడు. ఈ విధంగా అగ్రరాజ్యం మన దేశంలో ఒక పెద్ద మార్కెట్‌ను సృష్టించుకున్నది. కాని భారతదేశం కోరుతున్న ఔట్‌సోర్సింగ్‌ను మాత్రం ససేమిరా అంగీకరించలేదు. ఇదీ అగ్రరాజ్యంతో మన వ్యాపార సరళి. ఇదీ 'మా ఇంటికి వస్తూ మాకేమి తెస్తావు - మీ ఇంటికి వస్తే మాకేమి ఇస్తావు' అన్న సరళిలో ఒబామా సాగించిన వాణిజ్య ఒప్పందాల తీరు.

ఆసియాలోనే అతిపెద్ద ఆర్థిక వ్యవస్థ, ప్రపంచంలో అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న మార్కెట్, ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామిక వ్యవస్థ అంటూ భారత్‌ను పొగిడిన ఒబామా అన్ని రంగాలలోకి అమెరికా కార్పొరేట్ల ప్రవేశానికి వీలుగా ఒప్పందాలు కుదుర్చుకున్నాడు. అమెరికాకు లాభాలు సాధించిపెట్టడంలో ఒబామా సఫలమయ్యాడు. ఆ మేరకు భారత ప్రభుత్వం విఫలమైందనే చెప్పాలి. ఒబామా భారత్‌లో మూడు రోజుల పర్యటనలో తామనుకున్నది సాధించినట్లు నవంబర్ 9న వాషింగ్టన్ విలేకర్ల సమావేశంలో అమెరికా విదేశాంగ ప్రతినిధి పి.జె. క్రోలె ప్రకటించాడు. మన దేశానికి ఉపయోగపడే అంశాలు ఏవీ ప్రకటించనప్పటికీ, మన సర్కార్ అమెరికన్లే ఊహించని విధంగా ఒబామాకు మద్దతు ప్రకటించి ఆశ్చర్యచకితులను గావించింది. ఒబామా పర్యటన అమెరికాతో వ్యూహాత్మక పాత్రను మరింత పటిష్ట పరిచింది. భారతీయ మార్కెట్లను అమెరికా వ్యాపార, వాణిజ్య ప్రయోజనాల కోసం తెరవడం, భారత్‌ను మరింతగా భద్రత, సైనిక బంధం దిశగా నడిపేందుకు దోహద పడినట్లు ముగింపులో విడుదల చేసిన ఉమ్మడి ప్రకటన వెల్లడించింది.

అమెరికాలో తీవ్ర మాంద్యం, నిరుద్యోగం దాని ఆర్థిక వ్యవస్థను కుదుపుతున్న నేపథ్యంలో ఆర్థిక సహకారం ప్రణాళిక ఉమ్మడి ప్రకటనలో బహిర్గతమైంది. ఆహార భద్రత, వ్యవసాయ ఉత్పాదకతను పెంచే పేరిట వాల్‌మార్ట్, మోన్‌శాంటో వంటి అమెరికా అగ్రి బిజినెస్

*అమెరికా అధ్యక్షుడు నల్లవాడా, తెల్లవాడా అనే దానితో నిమిత్తం లేదనీ, ఎవరైనా యుద్ధ వ్యాపారులేననీ అంటున్నారు* **డా. జి లచ్చయ్య**

# మర్చంట్ ఆఫ్ అమెరికా

**భా**రత దేశాన్ని సందర్శించిన అమెరికా అధ్యక్షులలో అత్యధిక రోజులు గడిపిన అధ్యక్షుడిగా బరాక్ హుస్సేన్ ఒబామా రికార్డు సృష్టించాడు. నవంబర్ 6 నుంచి 8 దాకా మూడు రోజుల పాటు ఒకటిన్నర రోజులు దేశ ఆర్థిక రాజధాని అయిన ముంబాయిలో మిగతా ఒకటిన్నర రోజులు దేశ రాజధాని న్యూఢిల్లీలో గడిపారు. సాధారణంగా ఒక దేశపు అధ్యక్షుడో, ప్రధానమంత్రో మరో దేశ పర్యటనకు వెళ్లితే ఇరు దేశాల సంబంధాలపైన, భద్రతా వ్యవహారాలపైన, ద్వైపాక్షిక చర్చలు జరపడం, సాంస్కృతిక సంబంధమైన, విద్యా సంబంధమైన వ్యవహారాల గురించి మాట్లాడుకోవడం జరుగుతుంది. దేశ పర్యటనకు వచ్చిన వ్యక్తిని ఓ అతిథిగా వ్యవహరిస్తారు. దేశాధ్యక్షులు స్వాగతం పలుకుతారు. ఇచ్చిన ఆతిథ్యాన్ని గౌరవంగా స్వీకరిస్తారు. కాని వచ్చిన వ్యక్తి ప్రపంచ సి.ఇ.ఒ. కాబట్టి, పేరుకు పురాతన ప్రజాస్వామ్య సంపన్న దేశ అధ్యక్షుడు కాబట్టి, ప్రపంచాన్నే (అమెరికా 99 దేశాల్లో ప్రత్యక్ష, పరోక్ష అజమాయిషీ చేస్తున్నది) తన గుప్పిట్లో పెట్టుకొని శాసిస్తున్న వ్యక్తి కాబట్టి, ఒబామా భారత దేశపు అతిథిగా కాకుండా ఓ యజమానిగా, వ్యాపారిగా విచ్చేసి మనం పెట్టింది తినడం గాదు, ఆయన తెచ్చుకున్నది మనకు కొంత విదిలించి పోయాడు.

మొన్నటికి మొన్న కామన్‌వెల్త్ గేమ్స్‌లో బ్రిటిష్ రాకుమారున్ని పల్లకిలో మోసిన మనం, ఒబామాను మన కనుసన్నల్లో నడిపించ గలమా? అందుకే ఆయన ఎన్నికైన ఏడాది 2008 నవంబర్‌లోనే ధ్వంసమైన ముంబయిలోని తాజ్ హోటల్లో బస చేశాడు. దేశానికే ఆర్థిక రాజధానిగా విరాజిల్లుతున్న ముంబాయి లాంటి నగరం ఉగ్రవాద దాడులకు గురైతే (ఈ దాడులకు సూత్రదారిగా భావిస్తున్న హెడ్లీకి ఆశ్రయమిస్తున్నది కూడా అమెరికాయే) భారత్ లాంటి దేశంతో మల్టినేషనల్ కంపెనీల (ఎం.ఎన్.సి.) లావాదేవీలు దెబ్బతింటాయి కాబట్టి, అవి దెబ్బతింటే అమెరికా ప్రపంచ విపణికి కూడా ప్రమాదం కాబట్టి, ఆయన ముంబాయిని, అందునా 160 మంది మారణకాండకు కేంద్ర బిందువైన తాజ్ హోటల్‌ను ఎంచుకోవడం జరిగింది. మల్టినేషనల్ కంపెనీలకు నమ్మకం కలిగించాలన్నా, తిరిగి వ్యాపార సంబంధాలు పెరగాలన్నా ఒబామా లాంటి ప్రపంచ సి.ఇ.ఒ. తాజ్ హోటల్లో బస చేయాల్సిందే. అందుకే ఆయన తాజ్ హోటల్లోని ప్రీమియం సూట్‌లో బస చేశాడు. దీని కిరాయి రోజుకు అక్షరాలా పది లక్షల రూపాయలు మాత్రమే. ఈ ఖర్చంతా ఎవరు భరిస్తున్నారో ఎవరికీ తెలియదు. ఏదో ఒక మల్టినేషనల్ కంపెనీయో లేదా భారత దళారీ బూర్జువా వర్గం అయిన రిలయన్స్ అధినేతలో అయి ఉండాలి. అందుకే తాను తాజ్ హోటల్లో బస చేయడమే ఉగ్రవాదులకు ఒక హెచ్చరిక అని ఈ సందర్భంగా కూడా ఒబామా ఉద్ఘాటించడం గమనార్హం.

ఇదే కాకుండా, ఒబామా రాక సందర్భంగా తాజ్ హోటల్‌నే కాదు, మొత్తంగా ముంబాయి నగరాన్ని దిగ్బంధం చేసారు. తాజ్ హోటల్ చుట్టూ అయిదు కిలోమీటర్ల పరిధిలో అమెరికన్ సీక్రెట్ ఇంటలిజెన్స్ సంస్థ డేగ కళ్లతో భారీ బందోబస్తును చేసుకుంది. తాజ్ హోటల్లో పనిచేసే చిన్నా, చితకా ఉద్యోగుల్ని, అనుమానితుల్ని సెలవుపై పంపించింది. స్థానిక పోలీసులకు ఎలాంటి అధికారాలు లేకుండా చూడడంతో ముంబాయి నగర కమిషనర్ కేంద్రానికి ఫిర్యాదు కూడా చేయడం జరిగింది. (ఆ ఫిర్యాదును ఎవరు పట్టించుకోరనేది వేరే విషయం.) మన రాజకీయ నాయకులు అమెరికా వెళితే (మాజీ రక్షణ

---

బహుళ జాతి సంస్థల లాభాల కోసం భారతీయ వ్యవసాయాన్ని, రిటైల్ వ్యాపారాన్ని తెరిచే అజెండాను ముందుకు పెట్టింది. ఇది భారత్‌లోని కోట్లాది పేద ప్రజల, రైతుల, అసంఘటిత రంగ చిల్లర వ్యాపారుల ప్రయోజనాలకు హానికరంగా పరిణమించనుంది. అమెరికా ప్రభుత్వం త్వరలో 6,000 కోట్ల డాలర్ల ప్రభుత్వ బాండ్లను విక్రయించనున్నట్లు గతవారంలో ప్రకటించింది. ఈ చర్య డాలర్ విలువను తగ్గించి తన ఎగుమతులను పెంచు కొనేందుకు, ఇతర దేశాల ఎగుమతులను దెబ్బ తీసేందుకు ఉద్దేశించినట్లు జర్మనీ, బ్రెజిల్, చైనా దేశాలు విమర్శించాయి. అయితే మన ప్రధాని మన్మోహన్‌సింగ్ మాత్రం ఒబామాతో కలిసి ఢిల్లీలో ఏర్పాటు చేసిన పత్రికా గోష్టిలో అమెరికా చర్య సరైనదే అని ప్రకటించడం ప్రజాస్వామిక వాదులకు ఆశ్యర్యం కలిగించింది. అంతేగాకుండా అమెరికా ఫెడరల్ బ్యాంక్ ఆందోళన తనకూ ఆందోళన కలిగించేదే అని ప్రకటించడంతో సామ్రాజ్య వాదానికి తాను ఎంతగా దాసోహమయ్యాడో స్పష్టమయింది. అన్ని రకాలుగా భారత్‌కు పెద్ద పీట వేస్తామన్న ఒబామా మాటలు నమ్మిన మన నాయకులు దేశాన్ని అమెరికాకు తాకట్టు పెట్టడం దురదృష్టకరం. 2005 జూలై 7న అమెరికాతో చేసుకొన్న 'డిఫెన్స్ కో ఆపరేషన్ అగ్రిమెంట్', 2005 జూలై 18న చేసుకొన్న 'గ్లోబల్ స్ట్రాటజిక్ పార్ట్‌నర్‌షిప్ అగ్రిమెంట్', 2008 'సివిల్ న్యూక్లియర్ అగ్రిమెంట్'తో భారత్ అమెరికాకు అనుచర దేశంగా మారుతూ ఒక స్వతంత్ర విదేశాంగ విధానం లేకుండా అమెరికా ప్రపంచ ఆధిపత్య వ్యూహానికి జూనియర్ భాగస్వామిగా మారింది. మొత్తంగా చూస్తే స్వదేశీ, విదేశీ కార్పొరేట్ సంస్థలు లాభపడుతాయి తప్ప ప్రజలకు ఎలాంటి ప్రయోజనం సమకూరదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

మంత్రి జార్జి ఫెర్నాండేజ్) విమానాశ్రయాల్లో బట్టలూడదీసినా భరించిన మనవారు, అమెరికా అధ్యక్షుడి కోసం స్థానిక పోలీసులపై ఈ మాత్రం కటువు చూయించకపోతే బాగుండది కదా! భారత రక్షణ వ్యవస్థపై ఇంత అపనమ్మకమున్నా, ఒబామా రావడంలోని ఆంతర్యాన్ని అర్థం చేసుకోవాలి. ఎందుకంటే ఆర్థిక మాంద్యంతో, నిరుద్యోగ సమస్యతో (9-6 శాతం మంది అమెరికన్ యువకులు నిరుద్యోగులు), ప్రజల్లో పెరుగుతున్న నిరసనలతో గత దశాబ్దకాలంగా సతమతమవుతున్న అమెరికాను గట్టెక్కించాలంటే ఒబామాకు మిగిలింది ఈ వ్యాపార మార్గమొక్కటే.

గతంలో అయిదుగురు అమెరికా అధ్యక్షులు భారత్‌ను సందర్శించారు. 1959లో మొదటిసారి నాటి అమెరికా 31వ అధ్యక్షుడైన ఐషన్ ఓవర్ సందర్శించగా, 1969లో 34వ అధ్యక్షుడైన రిచర్డ్ నిక్సన్, 1979లో 36వ అధ్యక్షుడైన జిమ్మి కార్టర్, 2000లో 42వ అధ్యక్షుడైన బిల్ క్లింటన్, 2006లో 43వ అధ్యక్షుడైన జూనియర్ జార్జ్ బుష్ సందర్శించగా మొన్న 44వ అధ్యక్షుడి హోదాలో బరాక్ హుస్సేన్ ఒబామా రావడం జరిగింది. మొదట్లో ప్రతి దశాబ్దానికి ఒకసారి భారత పర్యటనకు వచ్చిన అమెరికా అధ్యక్షులు, 2000 నుంచి ఎంపికైన అధ్యక్షులందరు వరుసగా భారత్‌ను సందర్శించడం గమనార్హం. ఇదే కాలంలో ప్రపంచంలో పెను మార్పులు చోటు చేసుకోవడం, ప్రపంచీకరణకు, సరళీకరణకు, ప్రైవేటీకరణకు అంతర్జాతీయ స్థాయిలలో మార్గాలు సుగమం కావడం, చిన్న చిన్న రాజ్యాలు ఆర్థికంగా బలోపేతమై అగ్రరాజ్యాలకు, కొరుకుడు పడకుండా తయారు కావడంతో అమెరికాకు మార్కెట్ల కొరత కూడా మొదలైంది. ఇదే కాలంలో సద్దాం హుస్సేన్ లాంటి వారు అమెరికాను ధిక్కరించడంతో ప్రపంచ అధికార పీఠం ఎక్కడ కదిలిపోతుందో అని భీతిల్లిన అమెరికా సద్దాంపై అనేక తప్పుడు ఆరోపణలు మోపి ఆయన్ను ఉరితీసింది. చిన్న రాజ్యాలకు అమెరికా ఓ హెచ్చరికను చేసింది. ఈ విధంగా అమెరికా ప్రజాస్వామ్యం ముసుగులో, మానవ హక్కులను తాను మాత్రమే కాపాడుతాననే ముసుగుతో ప్రపంచాధిపత్యం కోసం అన్ని రకాల ఎత్తుగడలను వేస్తూనే ఉంది. ఇందులో భాగంగానే యుద్ధంగాని యుద్ధాల పేరుతో యుద్ధ సామాగ్రిని అమ్ముకోవాలనే దుర్మార్గపు ఆలోచనకు శ్రీకారం చుట్టింది.

ఒబామా భారతదేశాన్ని ఎందుకు ఎంచుకున్నాడంటే - ప్రేమ తోనో, అతిశక్తిమంతమైన దేశమనో మాత్రం కాదు. ఈ విధంగా అయితే ఆయన ముందుగా చైనాను ఎంచుకోవాలి. చైనాకు దేశ సార్వభౌమత్వాన్ని అంకుల్ శ్యాం ముందర పెట్టే బలహీనత లేదు కాబట్టి, ఈ పనిని భారత్ మనసా వాచా చేస్తుంది కాబట్టి ఆయన భారత్‌ను ఎంచుకున్నాడు. ఇక ముఖ్యమైన విషయమేమంటే, ప్రజాస్వామ్య ముసుగులో అత్యధిక జనాభాను కలిగి ప్రపంచంలోనే అత్యధిక వినియోగ వస్తువుల్ని, సౌందర్య సాధనాల్ని వాడుతున్న దేశం భారత్ కాబట్టి! ఈ మధ్యన అమెరికా జరిపిన సర్వేలో ఉపయోగానికి కూడా పనికిరాని టాయిలెట్లతో సహా ప్రజలకున్నవి 34 కోట్ల 20 లక్షలే. కాగా సెల్‌ఫోన్లు 60 కోట్లు దాటాయి. అంటే ప్రతి ఇద్దరికి ఒక సెల్‌ఫోన్ చొప్పున భారత్ అతి వేగంగా సెల్‌ఫోన్ వాడకంలో ముందుకు దూసుకపోతుంది. అమెరికన్ వారిలాగా నల్లవాళ్లనందర్నీ తెల్లగా చేస్తానని ప్రారంభించిన ఫేర్ అండ్ లవ్లీ లాంటి ముఖక్రీంలు, ఆడవారికే కాదు, మగవారికి కూడానంటూ టన్నుల కొద్ది ఉత్పత్తి చేసి మార్కెట్‌లోకి అమ్ముకుంటూ ముఖాలకు ముడతల్ని మాత్రం మిగిలిస్తూ భారతీయ యువతీ, యువకుల పర్సుల్ని ఖాళీ చేసే మార్కెట్ మాయాజాలం ఒక్క అమెరికాకే తెలుసు. షాంపుల పేరున, ఫేస్ ప్యాకుల పేరున, ఫ్యాషన్ టెక్నాలజీ పేరున యువతను మత్తెక్కిస్తూ, మన సంస్కృతి సంప్రదాయాలకు గండికొడుతున్న వైనాన్ని మన యువత గుర్తించే స్థితిలో లేదు కాబట్టి, సౌందర్య మత్తు పదార్థాల ప్రయోగాన్ని భారత యువతపై అమెరికా ఎంత ప్రయోగించాలో అంతకన్నా ఎక్కువగానే ప్రయోగిస్తోంది. శ్రమైనక జీవన సౌందర్యాన్ని గుర్తించలేని యువతను జిమ్‌ల వైపుకు తిప్పుకున్న ఘనత అమెరికాదే. ఇంత సులభంగా వినియోగ వస్తువుల వాడకానికి లొంగిపోయే యువత ప్రపంచంలో ఎక్కడా లేదు కాబట్టి, ఆ మాయల మరారి (మరారీలు క్షమించాలి) భారత్‌ను ఎంచుకోవడం జరిగింది.

వీటికి తోడుగా, భారతదేశ ఆర్థిక పరిస్థితి, సామాజిక, ఆరోగ్య స్థితిగతులు కూడా మార్కెట్ మాయాజాలానికి అనుకూలంగా ఉన్నాయి. రెండు వర్గాల (ఉన్నవారు - లేనివారు) మధ్యన రోజు రోజుకూ పెరుగుతున్న అఖాతం, ప్రజల్ని దోచుకుంటూ తరతరాలు కూర్చుని తిన్నా తరగని సంపదల్ని పోగుచేసుకుంటూ స్విస్ బ్యాంకుల్లో దాచుకుంటున్న డబ్బు మరోవైపు భారత ప్రజల్ని సామ్రాజ్యవాదులకు మోకరిల్లేలా చేస్తున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో అప్పుల్ని తెచ్చుకుంటూ పాలన సాగిస్తున్న పాలకులున్న ఈ దేశంలోనే అప్పులిచ్చే మహారాజు లున్న దేశం భారత్. గత అయిదు సంవత్సరాలుగా రెండంకెలకు మన జిడిపి ని తీసుకెళ్లుతామని పదే పదే ప్రకటనల్ని గుప్పిస్తున్నా, జిడిపి 8 శాతం కూడా దాటడం లేదు. మరోవైపు ఆకలి చావులు - అయినా మన గోదాముల్లో ఆహార ధాన్యాలు అవసరానికి మించి ముక్కిపోతూనే ఉన్నాయి. ఇంత అసమానతలున్న దేశం, కొనుగోలు శక్తిగల ప్రజలు మరెక్కడా లేరనే విషయం ఒబామాకు తెలుసు కాబట్టే ఆయన భారత్‌పై మొగ్గు చూపాడు.

ఇలాంటి బలహీనతల్ని గుర్తించే గత సంవత్సర కాలంగా భారత దర్శనకోసం ఒబామా ప్రణాళికల్ని సిద్ధం చేసుకున్నాడు. భారత సందర్శన కోసం రూపొందించిన ఎజెండాలో ఆర్థికపరమైన అంశాల్ని 26 సార్లు, ఉద్యోగాల రూపకల్పన గురించి, వస్తువుల ఎగుమతుల గురించి 17 సార్లు ప్రస్తావించగా, ఇరుదేశాల వ్యూహాత్మక సంబంధాల గురించి కేవలం మూడుసార్లు మాత్రమే ఎజెండాలో చేర్చడం జరిగింది. మన ప్రధాని మన్మోహన్‌సింగ్ కూడా అమెరికా గురించి ప్రస్తావించినప్పుడల్లా 3ఇ (ఇఇఇ) ల గురించి ప్రస్తావిస్తూ ఉంటాడు. అవి ఎకానమీ, ఎనర్జీ, ఎడ్యుకేషన్. యు.పి.ఎ. ప్రభుత్వం కోరుకున్నట్లుగానే ఈ మూడు అంశాల్లోని ఒక అంశమైన ఎనర్జీకి సంబంధించిన అణు ఒప్పందంపై సంతకాలు జరగనే జరిగాయి. ఇక మిగతా రెండు అంశాల పట్ల మన పాలకుల వైఖరి అందరికి తెలిసిందే. అవసరానికి మించిన విదేశీ పెట్టుబడుల్ని ఆహ్వానించడం, స్థానికంగా గల ఉత్పత్తి సంస్థల్ని దెబ్బతీయడం చాలా కాలంగా ఈ దేశంలో సాగుతూనే ఉంది. ఇక ఉన్నత విద్యలో విదేశీ పెట్టుబడిదార్లు సులభంగా పెట్టుబడులు పెట్టి వీధికో విశ్వవిద్యాలయాన్ని తెరవడానికి మనవారు పార్లమెంట్‌లో చట్టాల్నే సవరించారు. దీనికి మనవారు చెపుతున్న కారణం 11 శాతంగా ఉన్న ఉన్నత విద్యా అవకాశాల్ని 30 శాతంకు పెంచుకోవాలి కాబట్టి అని. ఈ విధంగా స్వయం ప్రతిపత్తితో నడుస్తూ, మన సామాజిక అవసరాలకు అనుగుణంగా నడవాల్సిన భారతీయ విశ్వవిద్యాలయాలు ఎప్పుడో తమ ఆలోచనల్ని అమ్ముకొని, అమెరికా అవసరాల్ని తీర్చిదిద్దే మేధో సంపత్తిని తయారు చేయడం, ఎగుమతి చేయడం మొదలు పెట్టాయి.

ఈ విధంగా వివిధ దేశాల బలహీనతల్ని, అవసరాల్ని గుర్తించిన అమెరికా పెట్టుబడి వర్గాలు తమ అధ్యక్షుల్ని ఒక వ్యాపారవేత్తగా మార్చుకుంటూ, వివిధ దేశాల్లోకి, ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న భారత్ లాంటి అత్యధిక వినియోగదారులున్న దేశాలతో లావాదేవీలు జరపడానికి ఉపయోగించుకుంటున్నాయి. ఈ సందర్భంగా 1860లో అబ్రహాం లింకన్ చివరి దశలో ఈ వర్గాల గురించి ఒక హెచ్చరిక చేస్తూ, అమెరికా పాలనా వ్యవస్థలో కార్పొరేట్ సంస్థలు పాగా వేస్తున్నాయనీ, దీంతో పాలనా వ్యవస్థలో అవినీతి శకం ప్రారంభం అవుతుందనీ, దేశ సంపద కొంతమంది కార్పొరేట్ల చేతుల్లోకి కేంద్రీకృతమై రాజకీయాలపై అధికారాన్ని చెలాయిస్తూ ప్రజల ఆకాంక్షల మేరకు ప్రపంచంలోనే ఏర్పాటైన మొట్టమొదటి రిపబ్లిక్ దెబ్బతింటుంది అని స్పష్టంగా చెప్పారు. 150 సంవత్సరాల తర్వాత లింకన్ మాటలు అక్షర సత్యాలని తేలింది. ఎందుకంటే, శ్వేతసౌధంలో అడుగిడుతున్న వ్యక్తి శ్వేత జాతీయుడా, నల్లజాతి వాడా అనేది కాదు - అమెరికా ప్రజాస్వామ్యాన్ని తమ కనుసన్నల్లో నడుపుతున్న అమెరికా కేంద్ర గూఢాచార వ్యవస్థ (సి.ఐ.ఎ.), అమెరికా యుద్ధ తంత్ర వ్యవస్థ అయిన పెంటగాన్‌లదే రాజ్యాధికారం. పాలకులు డెమోక్రాట్లా, రిపబ్లికన్లా అనేది ఈ సంస్థలకు అనవసరం. ఏ రాజకీయ పార్టీ అయినా ఈ రెండు సంస్థలు రూపొందించే సామ్రాజ్యవాద ఎజెండాతోనే పరిపాలన సాగించాలి. విదేశీ దౌత్యం జరపాలి. మనమందరం అతి బలవంతుడిగా ఊహించుకునే అమెరికా అధ్యక్షుడు ఈ సంస్థల చేతిలో కీలుబొమ్మ మాత్రమే. ఈ సంస్థల్ని నడిపేది పెద్ద పెద్ద కార్పొరేట్లే. నాటి డెమోక్రాటిక్ కెన్నడీ నుంచి మొన్నటి రిపబ్లికన్ జూనియర్ బుష్ దాకా జరిగిన తతంగం ఇదే. ఎవరైనా స్వతంత్రించి స్వంత ఎజెండాను అమలు చేయాలని చూస్తే లింకన్ లాగా, కెన్నడీ లాగా హత్యకు గురవుతారు. ఈ లెక్కన నల్లజాతీయుడైన ఒబామా ఓ లెక్కా. అందుకే ఆయనపై కూడా హత్యా ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి. ఈ కారణాల చేతనే కావచ్చు - అమెరికాకు ఇంతవరకు ఒక మహిళ అధ్యక్షురాలిగా కాలేకపోయింది.

కాబట్టి, ఒబామా కార్పొరేట్ల మార్కెట్‌ను విస్తరించడానికి భారత్‌ను సందర్శించాడు. అందుకే ఆయన వాల్‌మార్ట్, కోకా కోలా, పెప్సి, మాక్ డొనాల్డ్ లాంటి సంస్థల ఉత్పత్తుల్ని మరింతగా ప్రమోట్ చేయడానికి, అమ్ముకోవడానికి వచ్చాడు. ఈ సందర్భంగా అమెరికా అంతర్జాతీయ ఆర్థిక వ్యవహారాలను చూసే డిప్యూటీ నేషనల్ సెక్యూరిటీ సలహాదారుడైన మైక్ ఫోర్‌మెన్ మాట్లాడుతూ 'ఆర్థిక లావాదేవీల గురించి, అమెరికా ఎగుమతుల గురించి, అమెరికాలో ఉద్యోగాల రూపకల్పన గురించి, ఇతర వాణిజ్య సంబంధాల గురించి మాత్రమే ఒబామా భారతదేశ సందర్శనలో మాట్లాడుతాడని పదే పదే ప్రస్తావించడం జరిగింది. ఒబామా కూడా ఈ పరిధిలోనే మాట్లాడడం చూసాం. వీటికి అనుగుణంగానే పదిహేను వేల కోట్ల డాలర్ల విలువగల వ్యాపార లావాదేవీలను, యాభై వేల మందికి ఉద్యోగ అవకాశాలను కల్పించుకున్నాడు.

ఇవన్నీ బయటి జనాలకు కన్పించే ఒప్పందాలే. వీటితో పాటుగా యుద్ధవిమానాలను, సబ్ మెరైన్లను కూడా భారత్ కొనుగోలు చేసేలా ఒప్పించుకున్నాడు. అందులో భారత్ తీర రక్షణ సంస్థకు యాభై మిలియన్ డాలర్ల విలువగల కేటర్ పిల్లర్ సంస్థ మెరైన్ ఇంజన్లను అమ్మడం. ఇలా వీటిని భారతదేశానికి అంటగడితే, ఉపఖండంలో యుద్ధ మేఘాలు కమ్ముకుంటే, పాకిస్తాన్ లాంటి చిన్న చిన్న దేశాలకు కూడా యుద్ధ సామాగ్రిని అమ్మవచ్చు. లేదా ఆ దేశాలు అమెరికా చెప్పు చేతుల్లో ఉండేలా చేసుకోవచ్చు. అందుకే వీటితో పాటుగా 10సి-17 రకానికి చెందిన గ్లోబు మాస్టర్ 3 స్ట్రాటజిక్ ఎయిర్ క్రాఫ్ట్‌ను, ఇండియన్ ఎయిర్ ఫోర్స్ ఎయిర్ క్రాఫ్ట్స్ కోసం, ఎనిమిది వందల మిలియన్ డాలర్ల విలువ చేసే ఎఫ్ 414 రకానికి చెందిన 99 జనరల్ ఎలక్ట్రిక్ ఫైటర్ జెట్స్ ఇంజన్లను ఈ సందర్భంగా కొనుగోలు చేయడానికి కూడా ఒప్పందాలు జరిగాయి. వ్యాపారమంతా యుద్ధతంత్రం చుట్టూ తిరిగితే బాగుండదని, కొన్ని దేశీయ అవసరాలకు సంబంధించిన లావాదేవీలు కూడా చేసుకోవడం జరిగింది. అయితే ఈ లావాదేవీలు కూడా దేశీయ ఉత్పత్తుల్ని, శ్రమశక్తిని దెబ్బతీయడానికే. అందుకే స్వదేశీ పరిజ్ఞానాన్ని కాదని 2.7 బిలియన్ల డాలర్ల విలువగల 737 రకానికి చెందిన ముప్పై బోయింగ్ విమానాలను, జనరల్ ఎలక్ట్రానిక్ సంస్థ నుంచి హెవీ డ్యూటీ గల 9 ఎఫ్ఎ రకానికి చెందిన ఆరు గ్యాస్ టర్బైన్లను, భారతీయ రైల్వే కోసం కేటర్ పిల్లర్ సంస్థ నుంచి నాలుగు బిలియన్ డాలర్ల విలువగల లోకోమోటివ్ డీజిల్ ఇంజన్లను కొనుగోలు చేసేలా ఈ సందర్భంగా ఒప్పందాలు జరిగాయి. వీటితో పాటుగా హార్లే డెవిడ్‌సన్ సంస్థతో భారత్‌లో మోటర్ విడిభాగాల తయారీ యూనిట్లను కూడా స్థాపింప చేయాలని, ఇందులో అత్యధికంగా అమెరికా వారికే ఉద్యోగ అవకాశాలు ఉండేలా చూడాలనే ప్రయత్నం కూడా జరుగుతున్నది.

అందుకే, విదేశీ పర్యటన సందర్భంగా ఒబామా వెంట ఉండాల్సిన సెక్రటరీ ఆఫ్ స్టేట్ అయిన హిల్లరీ క్లింటన్, డిఫెన్స్ సెక్రటరీ రాబర్ట్ గేట్స్‌లకు బదులుగా కామర్స్ సెక్రటరీ గారిలాకె, వ్యవసాయ సెక్రటరీ టామ్ విల్‌ఫాక్‌లు ఉన్నారు. పోతే అందరి అధ్యక్షుల్లాగానే ఒబామా భార్య మిషెల్‌ని కూడా తీసుకరావడం జరిగింది. అయితే ఆమె ఏదో సరదా కోసం రాకుండా విద్యా సంబంధ లావాదేవీలను చూడడం జరుగుతుందని భారత్ పర్యటనకు ముందే వివరించడం గమనార్హం. అందుకే ఒబామా ముంబాయిలో సి.ఇ.ఓ.ల సమావేశం జరుపుతుండగా మిషెల్ సెంట్ జెవియర్ కళాశాలను, చెవిటి మూగ పాఠశాలను సందర్శించడం జరిగింది.

నిజానికి ఒబామా ఎన్నికను ప్రపంచ ప్రజలతో సహా భారత ప్రజలు కూడా స్వాగతించారు. మొట్టమొదటిసారి శ్వేతసౌధంలో ఒక నల్లవాడు అడుగు పెట్టడాన్ని గొప్ప విషయంగా భావించారు. ఆయన ఎన్నికతో పశ్చిమాసియా దేశాల్లో శాంతి నెలకొంటుందని భావించారు. ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ నుంచి అమెరికా సేనలు, సంకీర్ణ సేనలు ఉపసంహరించ బడతాయని కలలు గన్నారు. అమెరికన్ మిలిటరీలో పనిచేసేవారి తల్లిదండ్రులు సంతోష పడ్డారు. ఆయన ఎంపికైన కొద్దికాలంలోనే ప్రపంచ నోబుల్ శాంతి బహుమతిని ఒబామాకు ఇవ్వడం జరిగింది. బహుశా ఈ బహుమతి నేపథ్యంలోనన్నా ఆయన ప్రపంచ శాంతికి దోహద పడుతారని నోబుల్ బహుమతి కమిటీ భావించి ఉంటుంది. కాని అందరి అధ్యక్షుల్లాగానే ఒబామా కూడా యుద్ధ తంత్రం గల వాడేనని, సి.ఇ.ఓ. గుణాలు గల వ్యాపారేనని తేలిపోయింది.

ఒబామా అధ్యక్షపదవి పగ్గాలు చేపట్టి రెండు సంవత్సరాలైంది. ఈ రెండు సంవత్సరాల కాలంలో అమెరికా పరిస్థితులు మరింత తారుమారయ్యాయి. బ్యాంకింగ్ రంగం దెబ్బతిన్నది. సెక్యూరిటీల విలువలు అమాంతంగా పడిపోయాయి. అందరిని భ్రమల్లో ముంచిన సాఫ్ట్‌వేర్ రంగం కుప్పకూలింది. నిరుద్యోగ సమస్య మొదలైంది. ఇదే

కాలంలో ఆస్ట్రేలియాకు చెందిన అసెంజి పెంటాగాన్ దురాగతాలను (నాలుగు లక్షలకు పైగా) సేకరించిన 'వికీలీక్స్' అనే వెబ్‌సైట్‌లో పెట్టడంతో అమెరికా పరువు అంతర్జాతీయ స్థాయిలో మంటగలిసింది. ఇరాక్‌లో, ఆఫ్ఘనిస్తాన్‌లో అమెరికా జరిపిన అధర్మ యుద్ధాన్ని, పౌరుల ఊచకోతను ఈ వెబ్‌సైట్ ఆధారాలతో సహా చూపడంతో ప్రపంచ పోలీస్ ప్రతిష్ట దిగజారింది. వీటితోపాటుగా రెండేళ్ల కాలంలోనే డెమోక్రటిక్ పార్టీకి కష్టకాలం మొదలైంది. నవంబర్ 2న జరిగిన మధ్యంతర ఎన్నికల్లో డెమోక్రటిక్ పార్టీ ప్రతినిధుల సభలో మెజారిటీని కోల్పోగా, సెనేట్‌లో ఆధిపత్యం తగ్గింది. ఈ ఎన్నికల ప్రభావం 2012లో జరిగే సాధారణ ఎన్నికల్లో ప్రభావాన్ని కల్గిస్తుంది. ఈ మధ్యంతర ఎన్నికలు పరోక్షంగా ఒబామా పనితీరుకు, అమెరికా ప్రజల ఆకాంక్షకు అద్దం పడుతున్నాయి. ఈ విధంగా ఇబ్బందుల్లో ఉన్న ఒబామాకు అమెరికా సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రపంచ మార్కెట్లో అమ్ముకోవడం తప్ప వేరే మార్గం లేకుండా పోయింది. దీంతోపాటు కొంతమేరకు ఉపాధి అవకాశాలను పెంచుకుంటే, అమెరికా యువతకు కొంత ఊరట కూడా కలుగుతుందని ఒబామా అంచనా.

ఈ వ్యాపార లావాదేవీలతో అమెరికాలో ఉద్యోగ అవకాశాలు భారీగా పెరుగుతాయనేది ఒక అంచనా. అలాగే బోయింగ్ విమానాల సంస్థతో ఒప్పందాలు కుదిరితే అమెరికాలోని 44 రాష్ట్రాలలో గల 600 సప్లైయింగ్ యూనిట్లలలో కూడా వేలాదిగా ఉద్యోగ అవకాశాలు పెరుగుతాయని అమెరికా అధికారుల ఆలోచన. మరీ వ్యాపార లావాదేవీలైతే బాగుండదని భావించిన ఒబామా బోనస్‌గా భారత్‌తో మూడు అంశాలను చర్చించడం కొసమెరుపు. అవి కమర్షియల్ ఏర్‌స్పేస్‌లో, అంతరంగిక భద్రతా వ్యవహారాల్లో, వ్యవసాయ ఉత్పత్తుల్లో భారత్‌కు అమెరికా సహాయ పడాలనేది.

ఈ విధంగా ఒబామా ఒక నల్ల జాతీయుడిగానో, బడుగు జీవిగానో భారత్‌కు రాలేదు. సి.ఐ.ఎ. ఏజెంట్‌గా, పెంటగాన్ ప్రతినిధిగా మాత్రమే ఆయన రావడం జరిగింది. అందుకే ఆయన ముంబయిలో అతి ముఖ్యమైన వ్యక్తులతో ఒక వ్యాపార సమ్మేళనంలో (యు.ఎస్.ఐ.బి.సి. – సి.ఐ.ఐ., ఎఫ్.ఐ.సి.సి.ఐ.), తర్వాత ఇండియా–అమెరికా సి.ఇ.ఒ.ల సమావేశంలో పాల్గొని భారతీయ పెట్టుబడీదార్లను అమెరికాలో పెట్టుబడులు పెట్టాలని కోరాడు. మన జాతీయ బూర్జువా పెట్టుబడీదార్లు ఇప్పటికే అమెరికాలో ద్వితీయ స్థానంలో ఉంటూ 57,000 ఉద్యోగాలను కలిగిస్తున్నారు. ఈ సమావేశాల తర్వాత ఆయన భారతీయ, విదేశీ జర్నలిస్టులతో వేర్వేరుగా మాట్లాడడం గమనార్హం.

ఇంత చేసినా, న్యూక్లియర్ ఒప్పందంపై సంతకం పెట్టినా, ఐక్య రాజ్య సమితిలోని భద్రతా మండలిలో భారత్‌కు దక్కింది తాత్కాలిక సభ్యత్వమే. శాశ్వత సభ్యత్వంకై ఒత్తిడి చేసే స్థితిలో మన భారత పాలనా వ్యవస్థ లేకపోవడమే అమెరికాకు కల్సివస్తున్న అవకాశం కాదా!

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# ఒబామా రాకతో ఒరిగిందేమిటి?

**– ఆర్.ఎస్. చౌహాన్**

సామ్రాజ్యవాద దేశాలలో ఒకటైన అమెరికా దేశాధ్యక్షుడు బరాక్ ఒబామా భారతదేశానికి వచ్చిన సందర్భంలో పాలకపక్షం సకల గౌరవ అతిథి సత్కారాలను అందించిందనీ, ప్రధాన ప్రతిపక్షమైన బి.జె.పి. ఒబామా చేసిన ప్రసంగాన్ని ప్రశంసించిందనీ, వామపక్షాలు పెదవి విరుపులతో సరిపెట్టుకున్నాయనీ, మేధావివర్గాలు ఒబామా స్టేట్స్‌మన్ (రాజనీతిజ్ఞుడు)గా కాకుండా సేల్స్‌మన్ (అమ్మకందారు)గా వ్యవహరించినట్లు విశ్లేషించినారనీ, ప్రజాస్వామ్య వాదులు మాత్రం భారతదేశ మార్కెట్లను కైవసం చేసుకునేలా బహుళజాతి కంపెనీలకు గేట్లు బార్ల తెరచి భారతదేశ సంపదనూ, వనరులనూ కొల్లగొట్టాలన్న కుట్ర ఒబామా పర్యటనలోని అంతరార్థమని నిరసనలు చేసినట్లు వార్తా పత్రికలు ప్రచురించినాయి.

ఈ నేపథ్యంలో భారతదేశానికి బయలుదేరే ముందు 'ఆర్థిక మాంద్యం నుండి కోలుకుంటున్న అమెరికా ఆర్థిక వ్యవస్థను మళ్లీ నిర్మించడానికి కొత్త ప్రణాళికలను సిద్ధం చేసుకోవాలని, కొత్త ఉత్పత్తులను తయారుచేసి ప్రపంచవ్యాప్తంగా అమ్మాలని, అమెరికన్ ఉత్పత్తులను ప్రపంచంలో మార్కెటింగ్ ఎంతగా చేయగలిగితే అమెరికన్లకు ఉద్యోగ అవకాశాలు అంతగా పెరుగాతాయనీ, ప్రతి బిలియన్ డాలర్లకు అయిదు వేల ఉద్యోగాలను అమెరికన్లు పొందగలరని, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో మధ్యతరగతి ప్రజల చేతుల్లో సరుకులు కొనేందుకు బాగా డబ్బు ఆడుతుందని' కంపెనీ బోర్డు మీటింగ్‌లో ప్రసంగించిన ఒబామా తన ప్రి డిటర్మినేషన్‌ను వ్యక్తపరిచారనే విషయం వాస్తవమని తోస్తోంది. తదనుగుణంగా, ఒబామా మనదేశ రాజధాని ఢిల్లీకి బదులుగా ఆర్థిక రాజధానియైన ముంబయి నగరంలో తన ప్రథమ పాదాన్ని మోపడం, తనతో వచ్చిన 200 మంది సి.ఇ.ఒ.లను, పారిశ్రామికవేత్తలను ఒక వేదికమీద సమావేశపరిచి, వెయ్యి కోట్ల డాలర్ల విలువగల వాణిజ్య ఒప్పందాలు జరిగేలా చూడడం, ఈ ఒప్పందాల మూలంగా అమెరికన్ల కొరకు యాభై వేల డాలర్ల విలువగల వాణిజ్య ఒప్పందాలు జరిగేలా చూడడం, ఈ ఒప్పందాల మూలంగా అమెరికన్ల కొరకు యాభై వేల ఉద్యోగాలను సృష్టించగలడం, పైన చెప్పిన అతని ప్రిడిటర్మినేషన్‌ను ధృవీకరిస్తున్నాయి. ఇదే క్రమంలో తన వ్యూహాలకు అనుగుణంగా ఒబామా పాకిస్తాన్‌ను వ్యాఖ్యానించి, భారత దేశాన్ని పొగడ్తలతో, ప్రశంసలతో ముంచెత్తడం జరిగింది.

ఈ పరిస్థితులలో అమెరికా నుండి మన దేశానికి రాబోతున్న తెల్ల ధనం విలువ వెయ్యి కోట్ల డాలర్లు కాగా, ఈ తెల్లధనం క్రీనీడలలో రాబోవు నల్లధనం విలువ మాత్రం ఊహలకు అందని విషయం.

ఒబామా రాకతో మన దేశానికి ఒరిగిందేమిటని ఆలోచిస్తే, భారతదేశంలోని రైతులకు, విద్యావంతులైన నిరుద్యోగులకూ, మధ్యతరగతి వారికీ, పేద ప్రజలకూ ఒరిగిందేమీ లేదు.

అయినా, భారతదేశ ఆర్థికాభివృద్ధి కొరకు మన స్వయంకృషినీ, దేశంలోని వనరులనూ, ఖనిజ సంపదనూ, శాస్త్రవేత్తల, మేధావుల ప్రణాళికలనూ, దేశ ప్రజల ఉత్పాదక శక్తి, సామర్థ్యాలనూ మన పరిపాలకులు ఉపయోగించుకోవాలే గానీ, సామ్రాజ్యవాద దేశాలకు చెందిన బహుళజాతి కంపెనీలు మన దేశ సంపదనూ, ప్రజల శ్రమశక్తిని కొల్లగొట్టేలా ప్రోత్సహించే ఆర్థిక విధానాలను అములుపర్చడం సమర్థనీయం కాదు.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకుడు)* వీ

వర్తమానంలో జరుగుతున్న పర్యావరణ విధ్వంసం మనిషి ఉనికికే ప్రమాదకరంగా పరిణమించిందనీ, పోలవరం ప్రాజెక్ట్ కూడా అలాంటి విధ్వంసంలో భాగమేననీ అంటున్నారు **మేరుగు రాజయ్య**

# పోలవరం ప్రాజెక్ట్‌పై పునరాలోచించాలి!

చిన్న పిల్లలకు 'ప్రపంచమే ఒక కుటుంబం' అనే సూక్తిని బోధిస్తున్నాం. ప్రకృతిని మనం రక్షించుకుంటే ప్రకృతి మనలను రక్షించుతుందని పాలితులకు హితవు చెపుతున్నాం. ప్రజలందరూ సమానమని రాజ్యాంగంలోని 14వ అధికరణంలో పొందుపర్చుకున్నాం. నవీన విజ్ఞానంతో వ్యవసాయం, పశువుల అభివృద్ధి కోసం కృషి చేయాలని, ప్రకృతి సిద్ధమైన వాతావరణాన్ని, అడవులు, చెరువులు, నదులు, వన్య మృగ జీవనాన్ని కాపాడడానికి, పెంపొందించడానికి, అలాగే జీవ జంతుజాలం పట్ల కనికరం, ప్రేమ చూపాలని, ప్రజలు జీవించడానికి, వారికి కావలసిన వసతులను పొందడానికి రాజ్యాంగ పరంగా రక్షణ కల్పించాలని ఆదేశికసూత్రాల ద్వారా హామీ ఇచ్చుకున్నాం.

గోదావరి నదిపై పోలవరం దగ్గర ఐదు వందల టి.ఎం.సి.ల భారీ నీటి సామర్థ్యంతో పోలవలం ప్రాజెక్టను రు. 17,340 కోట్ల వ్యయంతో నిర్మించబోతున్నారు. 80 టి.ఎం.సి.ల నీటిని కృష్ణా జిల్లాకు, 181.53 కిలోమీటర్ల పొడవుతో ఎడమ కాలువ ద్వారా 150 టి.ఎం.సి.ల నీటిని విశాఖపట్నం; తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు, వంద టి.ఎం.సి.ల నీటిని; విశాఖపట్నం, తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలోని 540 గ్రామాలకు తాగునీరుకు అందించబోతున్నారు. అలాగే 960 మెగావాట్ల జలవిద్యుత్తు ఉత్పత్తి అవుతుందని కూడ చెపుతున్నారు.

తెలంగాణ ఖమ్మం జిల్లాలోని వరరామచంద్రాపురం మండలంలో 45 గ్రామాలు, కూనవరం మండలంలో 48 గ్రామాలు, చింతూరు మండలంలో 17 గ్రామాలు, కుకునూరు మండలంలో 34 గ్రామాలు, భద్రాచలం మండలంలో 39 గ్రామాలు, బూర్గంపాడు మండలంలో 13 గ్రామాలు, ఆంధ్రా పశ్చిమ గోదావరి జిల్లా పోలవరంలో 29 గ్రామాలు, తూర్పు గోదావరి జిల్లా దేవీపట్నంలో 42 గ్రామాలు, ఒడిషా, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాలలో కొన్ని గ్రామాలు ముంపుకు గురవుతాయని తెలుస్తోంది. సెంటర్ ఫర్ ఎకనమిక్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) పరిశోధన ప్రకారం 276 గ్రామాలు ముంపుకు గురవుతాయనీ, రెండు లక్షల ముప్పై ఏడు వేల మంది నిర్వాసితులవుతారనీ తెలుస్తుంది. వివిధ అధ్యయనాలు కూడా 94,357 ఎకరాల భూమి, 650 చదరపు కిలోమీటర్ల షెడ్యూల్డ్ ప్రాంత విస్తీర్ణం, ఇందులో 7,964 ఎకరాల రిజర్వ్ అడవులు ముంపుకు గురవుతాయని తెలుపుతున్నాయి.

'పోలవరం ప్రాజెక్ట్ వద్దే వద్దు' అనే ప్రధాన డిమాండ్‌తో మానవ హక్కుల వేదిక, ఆదివాసీ దళిత సంఘాలు, తెలంగాణ ఐక్య కార్యచరణ కమిటీ 2010 అక్టోబర్ 9, 10 తేదీలలో పోలవరం ముంపు గ్రామాలలో పాదయాత్రలు చేశాయి. ఛత్తీస్‌ఘడ్, ఒడిషా రాష్ట్రాలలోని అఖిల పక్షాలు కూడ పోలవరంను వ్యతిరేకిస్తున్నాయి. కుంట ఎం.ఎల్.ఎ. కొవ్వాసి లక్ష్మ నేతృత్వంలో భారీ ర్యాలీలు, బహిరంగ సభలను నిర్వహించారు.

పంచ భూతాల్లో ఒకటైన భూమి మీద లక్షల వేల సంవత్సరాలుగా ఏర్పడిన సారవంతమైన నేలలు, పర్వతాలు, అడవులు, జీవావరణాన్ని సృష్టించినట్లుగా, ప్రకృతి అందాలతో పచ్చదనంతో పోలవరం ముంపు గ్రామాలన్నీ సంతోషంగా ఉన్నాయి. నిరుపయోగమైన భూమి ఎక్కడ కనిపించదు. పంట పొలాల హద్దుల గట్ల వెంబడి లక్షల సంఖ్యలో తాటి వనం దిక్సూచిగా కనిపిస్తాయి. రాళ్లు, బీడు నేలలు కనిపించకుండా పచ్చని వృక్షాలతో, అడవులతో నిండి ఉన్న పర్వతాలు, గుట్టలు, గట్లు కనిపిస్తాయి. గోదావరి, శబరి నదులు, వాగులు, ఒర్రెలు, పరీవాహక ప్రాంతమంతా వరిపొలాలు, పత్తి, పెసరు, నువ్వు, మక్కజొన్న, మిరుప చేన్లు ఉన్నాయి. చింత చెట్లతో సహా అనేకమైన వృక్షాలు, ఔషధ మొక్కలు, కూరగాయ తోటలు కనిపిస్తాయి. గూన పెంక ఇండ్లు, ఆర్.సి. బిల్డింగ్‌లు చాల తక్కువగా ఉన్నాయి. తాటి కమ్మలతో కప్పబడిన ఇండ్లు, గుడిసెలు ఎక్కువగా ఉన్నాయి. దాదాపు ప్రతి ఊరికి రోడ్డు సౌకర్యం ఉంది. అన్నిటికంటే ముఖ్యమైన వరం ఏమిటంటే నైరుతి రుతుపవనాల కాలంలో 1400 మిల్లీ మీటర్ల వర్షపాతం కురిసి కరెంట్, భూగర్భజల వినియోగం లేకుండ పంటలన్నీ వాన నీళ్లతోనే పండుతాయి.

పోలవరంకు ఎగువన ఉన్న తెలంగాణ జిల్లాలకు ఇవ్వాల్సిన 680 టి.ఎం.సి.ల నీటి నుండి 500 టి.ఎం.సి.ల నీటిని ఆంధ్రకు తరలించి జల దోపిడీకి పాల్పడుతున్నారని విమర్శలు వస్తున్నాయి. అలాగే నిర్మించే అవకాశం ఉన్న ఇచ్చంపల్లి ప్రాజెక్ట్ ఊసేలేదు. పి.వి. నరసింహారావు కంతనపల్లి సుజల స్రవంతి బ్యారేజీ నిర్మాణానికి 19 ఫిబ్రవరి 2009న శంకుస్థాపన చేసి చేతులు దులుపుకున్నారు. దుమ్ముగూడెం ప్రాజెక్ట్ నిర్మాణం గురించి నాలుగు వందల యాభై కోట్ల రూపాయలు మొబిలైజేషన్ అడ్వాన్స్ ఇన్వెస్టిగేషన్‌కు ఖర్చు చేసి ఇంకా అధ్యయనం పేరుతో కాలయాపన చేస్తున్నారు. శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ దేవాదుల రెండవ దశ నిర్మాణాలు ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే అనే చందంగా ఉన్నాయి. ఎల్లంపల్లి ప్రాజెక్ట నిర్మాణం పనులు నత్తనడకన కొనసాగుతున్నాయి. ఇంకా సింగూరు కాల్వ, కొమురం భీం, రాలివాగు, నిల్వాయ, నెట్టంపాడు, భీమా, ప్రాణహిత ప్రాజెక్టుల పనులు ముందుకు సాగడం లేదు. ఇలా తెలంగాణలోని పదమూడు ప్రాజెక్టులను పూర్తి చేయడానికి ప్రభుత్వం చెప్పిన లెక్కల ప్రకారంగానే రు. 3,450 కోట్లు అవసరం కాగా, ఇప్పటికి కనీసం రు. 2,850 కోట్లు కూడ వ్యయం చేయలేదు. నల్లగొండ జిల్లాలో 690 ఫ్లోరైడ్ పీడిత గ్రామాలు ఉన్నాయి. రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ కూడ ఫ్లోరైడ్ పీడిత గ్రామాల ప్రజలకు రక్షిత మంచినీటిని సరఫరా చేయాలని సూచించింది. తెలంగాణలో నీటి సమస్య ఇంత తీవ్రంగా ఉంటే ఆంధ్ర పారిశ్రామికవేత్తలకు,

*ఒడిషాలోని నారాయణపట్నా ప్రాంతంలోని ఆదివాసి ప్రజల నైసర్గిక, సామాజిక, రాజకీయార్థిక సిత్థిగతులను, వర్తమాన ఆరాట పోరాటాలను వివరిస్తున్నారు* **బి.డి. దమయంతి**

# నారాయణపట్నా ఆదివాసీల పోరాటం

**20** నవంబర్ 2009 కి ముందు 'నారాయణపట్నా' చాలా మందికి తెలియక పోవచ్చు, కనీసం ఆ పేరు కూడా చాలా మంది విని ఉండకపోవచ్చు. ఎందుకంటే అందరికీ తెలియడానికి అది పెద్ద నగరం కాదు, పెద్ద పట్టణం కూడా కాదు. ఒక బ్లాక్ కేంద్రం మాత్రమే. అది కూడా సమాజం అంతగా పట్టించుకోని ఆదివాసీ ప్రజలు అత్యధికంగా నివసించే ప్రాంతం. (సమాజం అంతగా పట్టించుకోని ఆదివాసీ ప్రాంతాలను మల్టీ నేషనల్ కంపెనీలు ఎక్కువగా 'పట్టించుకోవడం' వల్లనే చరిత్ర మరింతగా కల్లోలభరితమవుతోంది.)

నవంబర్ 20న జరిగిన విచక్షణా రహిత పోలీసు కాల్పులూ, గాల్లో కల్సిపోయిన రెండు నిండు ప్రాణాలూ 'నారాయణపట్నా'ను దేశ ప్రజలందరికీ పరిచయం చేశాయి.

రెండు ప్రాణాలు పోవడం వల్ల అక్కడ జరుగుతున్న హింస వెలుగులోకి వచ్చింది గానీ నిజానికి ఆ కాల్పులు జరగడానికి కొన్ని నెలల ముందు నుండి నేటి వరకూ నారాయణపట్నా ప్రాంతమంతా ఇనుపబూట్ల కింద నలిగిపోతున్నది. ప్రస్తుతం ఒక్క నారాయణపట్నా పట్టణంలోనే రెండు బెటాలియన్ల (మూడు వేల) బి.ఎస్.ఎఫ్., సి.ఆర్.పి.ఎఫ్., తదితర బలగాలు మోహరించి ఉన్నాయి. మొత్తం దక్షిణ ఒడిషాలో అయిదు బెటాలియన్ల బలగాలు ఉన్నాయి.

సరిహద్దుల్లోనో, శత్రు సైనికులతో పోరాడుతూనో ఉండవల్సిన అర్ధసైనిక బలగాలు ఈ ఆదివాసీ ప్రాంతంలో ఎందుకు మోహరించి ఉన్నాయి?

ఇటీవలి కాలంలో మెజారిటీ ఆదివాసీ ప్రాంతాలు పోలీసు, అర్ధసైనిక బలగాల పదఘట్టనల కింద నలిగిపోతుండడం మనం చూస్తున్నాం, కనీసం వింటున్నాం. ఇలా నలిగిపోతుందనడానికి పలుకారణాలు పైకి కనబడుతుండవచ్చు. కానీ సారం మాత్రం ఒక్కటే – ఆ ప్రాంత ప్రజల అస్తిత్వాన్ని పాలకవర్గాలు సహించలేక పోవడమే. అయితే పాలకవర్గాలు

బహుళజాతి కంపెనీలకు ఉపయోగపడే పోలవరం ప్రాజెక్టులపై పాలకులు ఎక్కువగా శ్రద్ధ చూపుతున్నారని తెలంగాణ వాదులు విచారం తెలుపుతున్నారు. మన్మోహన్‌సింగ్ ప్రధానమంత్రిగా ఆంధ్రకు ఇచ్చిన గొప్ప వరం పోలవరం ప్రాజెక్ట్ అని, పోలవరం ప్రాజెక్ట్‌కు జాతీయ హోదాను కల్పించడానికి చేస్తున్న ప్రయత్నాలను ప్రాణహిత ప్రాజెక్ట్‌పై ఎందుకు చేయడం లేదని విమర్శలు వస్తున్నాయి.

అభివృద్ధి అంటే ప్రకృతి వనరులను, వృక్ష సంపదను, జంతు సంపదను నాశనం చేయడం కాదనీ, అలాగే ఒక వర్గ ప్రజల ఆదాయ అవకాశాలను పెంపుదల చేయడం కాదనీ డ్యాంల నిర్మాణంపై పరిశీలన కోసం ఏర్పాటైన అంతర్జాతీయ భారీ ప్రాజెక్టుల కమిషన్ తేల్చి చెప్పింది. ప్రపంచంలో 3600 పెద్ద డ్యాంలు ఉన్నాయనీ, అందులో 40 శాతం డ్యాంలు భారతదేశంలో ఉన్నాయని తెలిపినారు. 1990 వరకు నిర్మించిన వివిధ ప్రాజెక్టుల కింద రెండు కోట్ల పదమూడు లక్షల మంది ప్రజలు నిర్వాసితులైనారని తెలిపినారు. అపారమైన జల వనరులను ఒకచోట నిల్వ చేయడం వలన భూమిపై ఒత్తిడి పెరిగి భూకంపాలు సంభవించే అవకాశాలు కూడా ఉన్నాయని చెప్పారు. భారీ ప్రాజెక్టుల నిర్మాణం వలన పర్యావరణ పరిరక్షణకు విఘాతం కలుగుతుందని ప్రపంచ బ్యాంక్ నియమించిన మోర్సు కమిటీ తేల్చి చెప్పింది. అలాగే భారీ ప్రాజెక్టుల వలన ప్రజలకు కలిగే ప్రయోజనం కేవలం 10 శాతం మాత్రమేనని నొక్కి చెప్పారు. అది మన ఆహార పౌరసరఫరాల శాఖ వారు చెప్పిన యేటా మొత్తం ఆహార పంటల నుండి 10 శాతం ధాన్యాలను ఎలుకలు మెక్కుతున్నాయన్న దానికి సమానమేనని గుర్తించాలి. సహజ వనరులను ప్రస్తుత స్థాయిలో వినియోగించుకుంటూ పోతే 2030 నాటికి ప్రజల అవసరాలు తీర్చడానికి రెండు భూ మండలాలు కావలసి ఉంటుందని ప్రముఖ పర్యావరణ సంస్థ వరల్డ్ వైడ్ లివింగ్ ప్లానెట్ పేరుతో 2010 వార్షిక నివేదికలో వెల్లడించారు.

కేంద్ర ప్రభుత్వం జంతువుల మీద చూపిన ఔదార్యమును సామాన్య ప్రజల మీద చూపడం లేదు. ఛత్తీస్‌ఘడ్ జల్పాయ్‌గురి జిల్లాలో గూడ్సురైలు ఢీకొని ఏడు ఏనుగులు చనిపోయినాయి. దానికి కేంద్ర పర్యావరణ శాఖ చలించిపోయి ఏనుగుల రక్షణ గురించి రైలు మార్గం వెంబడి 168 కిలోమీటర్ల పరిధిలో ముళ్లకంచె నిర్మాణానికి, వాచ్‌టవర్ల నిర్మాణానికి ఏడు కోట్ల రూపాయల ప్యాకేజిని ప్రకటించింది. కాని ఇక్కడ పోలవరం ప్రాజెక్టు వలన 276 గ్రామాలు, రెండు లక్షల ముప్పై ఏడు వేల మంది నిర్వాసితులు, 650 చదరపు కిలోమీటర్ల షెడ్యూల్డ్ ప్రాంత విస్తీర్ణంలో తొంబై నాలుగు వేల మూడు వందల యాభై ఏడు ఎకరాల భూమి, ఏడు వేల తొమ్మిది వందల అరవై నాలుగు ఎకరాల రిజర్వ్ అడవులు ముంపుకు గురవుతున్నాయి. పర్యావరణవేత్తలు, మేధావులు, యావత్తు ప్రజానీకం, వివిధ అధ్యయనాలు పోలవరం ప్రాజెక్టును కట్టవద్దని కోరుతున్నాయి. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణంపై పునరాలోచించి ప్రజా బాహుళ్యానికి, ప్రకృతికి నష్టం జరగని రీతిలో నిర్మించినట్లయితే మానవాళికి ఉపయోగకరంగా ఉంటుంది.

*(రచయిత సింగరేణి మైనర్స్ అండ్ ఇంజనీరింగ్ వర్కర్స్ యూనియన్ కార్యదర్శి)*

వీ

చెప్పే కారణం మాత్రం, ముఖ్యంగా ఇటీవలి కాలంలో ఏ పోరాటాన్ని అణచడానికైనా అది సమర్థించుకుంటున్న సాకు మాత్రం – ఆ ప్రాంతాలలో మావోయిస్టులు ఉన్నారనేది. ఆ సాకుతోనైతే ఎంత హింసనైనా ప్రయోగించవచ్చు. ఎన్ని హత్యలనైనా చేయవచ్చు. ఎంత నెత్తుటినైనా పారించవచ్చు. ఎందుకంటే 'దేశ అంతర్గత భద్రతకు పెను ప్రమాదం' కదా వాళ్లు.

నిజానికి నారాయణపట్నా ప్రపంచానికి పరిచయం కావాల్సింది పోలీసు కాల్పుల వల్లనో, పోయిన రెండు ప్రాణాల వల్లనో కాదు. అక్కడ జరుగుతున్న ఒక బతుకుపోరు కారణంగా అది ప్రపంచానికి పరిచయం కావాల్సి ఉండె. కానీ పోరాటాలను పాలకవర్గాలు అణిచివేసినట్టుగానే, పాలకవర్గాలకు పాదసేవ చేసే ప్రసార మాధ్యమాలు పోరాట వార్తలను తొక్కిపడతాయి. లేకుంటే ఆ వార్తలు మరిన్ని పోరాటాలకు నాంది పలుకుతాయని భయం. అయితే అప్పుడప్పుడు అర్ధ సత్యాలతోనో, వక్రీకరణలతోనో అయినా కొన్ని వార్తలను వెలుగులోకి తీసకురాకతప్పని అనివార్యత వస్తుంది. అటువంటి పరిస్థితుల్లోనే నారాయణపట్నా వెలుగులోకి వచ్చింది.

నక్సల్బరీ ఒరవడిలో ఆంధ్రప్రదేశ్‌లో భూసమస్యను బలంగా ఎజెండా మీదికి తెచ్చినది శ్రీకాకుళ పోరాటం. శ్రీకాకుళ ఆదివాసీ రైతాంగ పోరాట వారసత్వాన్ని కొనసాగిస్తూ ఆ తరహాలోనే మరోసారి భూసమస్యను బలంగా ముందుకు తెచ్చింది ప్రస్తుత నారాయణపట్నా పోరాటం.

నారాయణపట్నా పోరాటానికి దారితీసిన పరిస్థితులు అర్థం కావాలంటే చరిత్రను కొంతైనా తడుముకోవాల్సి ఉంటుంది.

నారాయణపట్నా ఒడిషా రాష్ట్రం, కోరాపుట్ జిల్లాలోని ఒక బ్లాక్. భారత దేశం కంటే ఒడిషా రాష్ట్రం చాలా వెనకబడి ఉంది. ఒడిషా కంటే కోరాపుట్ మరింత వెనుక బడి ఉంది. ప్రభుత్వ లెక్కల ప్రకారమే భారత దేశంలో 26 శాతం పేదరికం ఉంటే, ఒడిషాలో 47 శాతం ఉంది. అవిభక్త కోరాపుట్ జిల్లాను – కోరాపుట్, రాయగఢ్, మల్కన్‌గిరి, నవరంగపూర్ – నాలుగు జిల్లాలుగా విభజించే నాటికి అక్కడ 84 శాతం పేదరికం ఉంది.

ఇంత వెనుకబడిన జిల్లాలో ఒక తహసీల్‌గా ఉండిన నారాయణపట్నా ప్రస్తుతం నారాయణపట్నా, బందుగాం బ్లాకులుగా విభజించబడి ఉంది. నారాయణపట్నా బ్లాక్‌లో తొమ్మిది పంచాయితీలున్నాయి. ఇక్కడ ప్రధానంగా కుయి తెగకు చెందిన ఆదివాసీ ప్రజలు నివసిస్తున్నారు. మొత్తం బ్లాక్‌లో 35 వేలకు పైగా జనాభా ఉంటే కుయి ప్రజలు 30 వేలకు పైగా ఉన్నారు.

ఇది ఎత్తైన కొండల ప్రాంతమే అయినప్పటికీ సాపేక్షికంగా అడవి తక్కువగానే ఉంది. కనుక అటవీ ఉత్పత్తుల నుండి వచ్చే ఆదాయమూ తక్కువే. ప్రధానంగా వ్యవసాయం మీదనే ఆధారపడవల్సిన పరిస్థితి. కాబట్టి ఇక్కడి ప్రజలు ఎంతో చెమటను ధారపోసి, కొండలను సైతం తవ్వి, వ్యవసాయ భూముల్ని తయారు చేసుకున్నారు. రాజుల కాలంలోనే వీటికి పట్టాలను కూడా పొందారు. అయితే ఆ భూములు క్రమంగా వాళ్ల చేజారినయి.

నాటి శ్రీకాకుళ పోరాటంలో భూస్వాములు, షావుకార్లూ జిల్లాను వదిలి పారిపోయిన చరిత్ర మనకు తెల్సు. అలా పారిపోయిన దోపిడీ వర్గాల్లో ఎక్కువ శాతం పక్కనే ఉన్న కోరాపుట్ జిల్లాలో స్థిరపడ్డారు. నారాయణపట్నా ప్రాంతంలోనూ స్థిరపడ్డారు. వీరిలో షావుకార్లు, సుండీలు, బ్రాహ్మణులు, దుంబాలు ఉన్నారు. క్రమంగా వీళ్లు రకరకాల పద్ధతుల్లో ఆదివాసీల సాగుభూములను కబ్జా చేయడం మొదలు పెట్టారు. ఇట్లా కబ్జా చేసుకున్న వారిలో షావుకార్లతో పాటు సుండీలు ముఖ్యులు. జనాభారీత్యా కూడా వీళ్లు ముఖ్యులు. దుంబాలను వీళ్లందరితో ఒకే గాటన కట్టలేం, స్వతహాగా వీళ్లు దోపిడీ వర్గం కాకపోయినా ఆదివాసీల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని వీళ్లూ పెత్తందారులుగా మారిపోయారు. అయితే ఈ నాలుగు కులాల వారిలోనూ పేదలు కూడా ఉన్నారు.

వీళ్లలో చాలా మంది సారా వ్యాపారులుగా అవతారమెత్తారు. ఈ ప్రాంతమంతా పెద్ద పెద్ద సారాబట్టీలను ఏర్పాటు చేసి విపరీతంగా సారా తయారుచేసి ఆదివాసీలను సారా వ్యసనపరులుగా మార్చారు. సారా తాగిన బాకీ కింద ఆదివాసీల భూములను గుంజుకుంటారు. ఒకటీ అరా ఎకరాల భూమిని కొని చుట్టుపక్కల భూములన్నింటిని దురాక్రమించుకుంటారు. కాలువల కింద ఉన్న ఆదివాసీల భూములకు నీళ్లు ఇవ్వకుండా అడ్డుకుని, అలా నీళ్లు అందకుండా రెండేళ్లు సాగు చేసుకోలేకపోతే ఇక ఆ సాకుతో ఆ భూములను గుంజుకుంటారు. ఇక్కడ ఈ దోపిడీ వర్గాలు దుకాణాలు పెట్టి వాటి ద్వారా కూడా ప్రజలను దోచుకుంటారు. దుకాణాల్లో సరుకులను బాకీ కింద ఇచ్చి దొంగ లెక్కలతో మోసంచేసి ఆ బాకీ కింద కూడా భూములను గుంజుకుంటారు. అంతేకాదు వీళ్లు ఇక్కడి సంస్కృతిని కూడా మార్చేశారు. పెళ్లిళ్లూ, పండుగలకు బాజా భజంత్రీలు, రికార్డ్ డ్యాన్సులు వంటివి అలవాటు చేసి ఖర్చులను పెంచారు. ఈ ఖర్చుల కింద భూములను కోల్పోయిన వాళ్లు ఎందరో. ఇలా రకరకాల సాకులతోనే కాదు ఏ సాకూ లేకుండానే దౌర్జన్యం చేసి తమకు నచ్చిన భూముల్ని గుంజుకోవడం కూడా సర్వసాధారణమే.

ఆదివాసీల భూములను చట్టబద్ధంగా అనుభవించడానికి, ఆదివాసీ ప్రాంతాలంతటా ఆదివాసేతర భూస్వాములు అనుసరిస్తున్న దొడ్డిదారి వంటి రాచమార్గం ఆదివాసీ మహిళలను ఉత్తుత్తి పెళ్లి చేసుకోవడం. మొరటుగా చెప్పాలంటే 'ఉంచుకోవడం'. ఆ మహిళల పేరుతో పట్టాలు చేయించుకోవడం. ఇలా నారాయణపట్నాలో ఉన్న కొందరు భూస్వాములకు నాలుగైదు మంది ఆదివాసీ 'భార్యలు' ఉన్నారంటే తమ ఆస్తులనూ, అధికారాలనూ కాపాడు కోవడానికి పితృస్వామ్యాన్ని ఎంతగా ఉపయోగించుకుంటున్నారో అర్థం చేసుకోవచ్చు. ఇలా ఒక్కొక్కరు వందల ఎకరాల భూములను తమ కబ్జాలోకి తెచ్చుకున్నారు. ఇక్కడ చాలా మందికి బినామీ పట్టాలు ఉన్నాయి. ఇంకా చాలా భూమిని ఎటువంటి పట్టాలు లేకుండానే ఈ ఆదివాసేతర భూస్వాములు అనుభవిస్తున్నారు.

ఇలా ఆదివాసీలు అన్ని రకాలుగానూ మోసానికీ, దౌర్జన్యానికి గురై తాము చెమటోడ్చి సాగు చేసుకున్న, తమ తల్లిదండ్రుల నుండి వారసత్వంగా వచ్చిన భూములను కోల్పోయి ఆ భూముల్లోనే కూలీలుగా మారారు.

ఆదివాసీల భూములను అమ్మడాన్నీ కొనడాన్నీ నిషేధించే 2/56 చట్టం సాక్షిగా భూములన్నీ ఆదివాసీల చేతుల్నుండి జారి భూస్వాముల కబ్జాలోకి వెళ్లిపోయాయి. (నిజానికి ఇక్కడ అమ్మిందీ కొన్నదీ తక్కువే. మోసమో, దౌర్జన్యమో చేసి గుంజుకున్నదే ఎక్కువ కాబట్టి చట్టం ఉల్లంఘించబడ లేదను కుందామా?)

ఇలా ఆదివాసీల భూములు గుంజుకొన్న ఈ ఆదివాసేతర దోపిడీదార్లు మరెన్నో రకాలుగా వీరిని పీడించుకు తింటున్నారు. ఆదివాసీలను వాళ్ల సొంత భూముల్లోనే కూలీలుగా మార్చిన వీరు కనీసం వారికి కూలీ కూడా ఇవ్వకుండా వెట్టి చాకిరీ చేయించుకొని వాళ్ల బతుకులను మరింత అధ్వాన్నం చేస్తున్నారు. తినడానికి ఒక గొడ్డును ఇచ్చి ఎకరాల కొద్ది భూముల్లో పంటకోయించడం, నూర్పించడం, ధాన్యాన్ని తమ గాదెలకు చేరవేయించడం అన్నీ చేయించుకుంటారు. అలాగే ఒక గొడ్డును ఇస్తే కిలోమీటర్ పరిధిలోని చింతచెట్లన్నీ దులిపి, గింజ తీసి ఇవ్వాలి. ఒక్క పొడపొద్ర గ్రామంలోనే దాదాపు వెయ్యి చింతచెట్లు ఉన్నాయంటే ఆదివాసీల శ్రమను భూస్వాములు ఎంత దోచుకుంటున్నారో అర్థం చేసుకోవచ్చు.

ఇక్కడితోనే ఈ దోపిడీ ఆగిపోలేదు. లేని పోని సాకులతో ఆదివాసీలపై విపరీతమైన దండుగలు వేస్తారు. రాలిన చింతపండును ఏరుకొని పోతే

కూడా దండుగలు వేస్తారు. చేతిలో పట్టుకొని పోతే 50 రూపాయలూ, గోచిలో వేసుకొని వెళ్తే 80 రూపాయలూ దండుగలు కట్టించుకుంటారు. ఈ దండుగల కింద కూడా భూములను గుంజుకుంటారు.

వడ్డీ వ్యాపారంతో కూడా వీళ్ల ప్రజలను దోచుకుంటారు. విపరీతమైన వడ్డీ రేటుతో, చక్రవడ్డీతో ప్రజలను కొల్లగొట్టడం, ఈ అప్పుల కిందికి కూడా భూములను గుంజుకుంటారు. భూములే కాదు ఆదివాసీల సంక్షేమం పేరుతో ప్రభుత్వం చేపట్టే అరాకొరా సంక్షేమ పథకాల నుండి వీళ్లే ప్రయోజనం పొందుతున్నారు. ఆదివాసీల పేరుతో ఉన్న హాస్టల్ తదితరాలు వీళ్ల పరమే అయ్యాయి. ఈ ఆదివాసేతరుల్లో చాలా మంది కాంట్రాక్టర్లుగా కూడా పనిచేస్తున్నారు. తాము చేయించే కాంట్రాక్టు పనులకు తక్కువ కూలీ ఇవ్వడం ద్వారా కూడా వీళ్లు ప్రజల్ని దోచుకుంటున్నారు. సంతల ద్వారా ఈ ప్రజలపై విపరీతమైన దోపిడీ కొనసాగుతోంది. అక్కడ వీళ్లకు అమ్మబోతే అడవి కొనబోతే కొరివి.

ఇలా దోచుకొని ఆదివాసీలను పీల్చి పిప్పిచేసి వీళ్లు కోట్లకు పడగలెత్తారు. ఇలా నారాయణపట్నాలో వెలిసిన మేడలు వీళ్ల దోపిడీకీ, ఆదివాసీల చితికిన బతుకులకూ నిలువుటద్దాలుగా నిలబడి ఉన్నాయి. విపరీతమైన సంపదలను పోగేసుకున్న వీళ్లు ఇక్కడి బూర్జువా రాజకీయ పార్టీలనూ శాసించే స్థాయికి ఎదిగారు. వీళ్లంతా బి.జె.పి., బి.జె.డి., కాంగ్రెస్‌లల్లో నాయకులుగా చెలామణీ అవుతూ, రాజకీయాధిపత్యంపై తమ పట్టును బిగించారు. అలా తమ దోపిడీకి అడ్డూ అదుపూ లేకుండా చేసుకుంటున్నారు. భూములు ఇవ్వనిరాకరించిన వాళ్లపై భౌతిక దాడులకూ, దౌర్జన్యాలకూ, హత్యలకూ పాల్పడుతున్నారు. వీళ్ల దాడులకు గురయి ఎంతో మంది శాశ్వతంగా అంగవైకల్యానికో, అనారోగ్యానికో గురయ్యారు. మహిళలపై చాలా ఘోరమైన అత్యాచారాలకు పాల్పడిన ఘటనలు ఎన్నెన్నో ఉన్నాయి. లైంగిక అత్యాచారాన్ని వీళ్లు తమ దోపిడీకి ఒక బలమైన ఆయుధంగానే ఉపయోగించుకుంటున్నారు. ఆదివాసీలను దొంగ కేసుల్లో ఇరికించి పోలీసుస్టేషన్లూ, కోర్టుల చుట్టూ తిప్పడం వంటి వేధింపు చర్యలకు పాల్పడుతుంటారు. ఊరి పందినీ, కోడినీ కోసుకున్నా అడవి జంతువులను వేటాడారని దొంగ కేసులు బనాయిస్తుంటారు.

ఈ ప్రాంత ఆదివాసీ ప్రజలెవ్వరిని కదిలించినా భూస్వాముల, పెత్తందారుల చేతిలో తాము పడిన తీరొక్క కష్టాలను కథలు కథలుగా చెప్తారు. ఈ బాధలను భరించలేకనూ, సర్వం కోల్పోయి అక్కడ బతుకుదెరువు జరగకనూ ఎంతో మంది తమిళనాడు, కేరళ, బెంగుళూరు, విశాఖపట్నం తదితర చోట్లకు వలసలు వెళ్లారు. ఉదాహరణకు పొడపొద్ర గ్రామంలో ఒకప్పుడు దాదాపు 300 కుయి కుటుంబాలు ఉంటే, ప్రస్తుతం 70 కుటుంబాలు మాత్రమే ఉన్నాయి. వీళ్లు కూడా తమ ఊళ్లో దౌర్జన్యాలను తట్టుకోలేక పాత గ్రామాన్ని వదిలి ఏటవతల కొత్తగా ఇండ్లు కట్టుకొని ఉంటున్నారు. ఈ విధంగా కుయి జనాభా తరిగిపోతూ ఉంది.

ఇలా ఈ ఆదివాసీలపై గత అరవైయేళ్లుగా ఈ దోపిడీ, అణచివేత, దౌర్జన్యాలు, అత్యాచారాలు కొనసాగుతున్నాయి. అయితే ఈ ప్రజలు ఎన్నాళ్లని ఇంకా కొనసాగనిస్తూనే ఉంటారు? పైగా దేశవ్యాప్తంగా ఆదివాసీలకు అణచివేతకు వ్యతిరేకంగా ఎన్నో తిరుగుబాట్లు చేసిన చరిత్ర ఉంది. అందులో భాగంగా ఒడిషాలోనూ కుయి తిరుగుబాట్లు జరిగాయి. కోరాపుట్‌లోనూ లక్ష్మణ్ నాయక్ నాయకత్వంలో జరిగిన బ్రిటిష్ వ్యతిరేక తిరుగుబాటు ప్రసిద్ధి పొందింది. అటువంటి వారసత్వం వాళ్లను ఎల్లకాలం తలవంచుకునే ఎలా ఉండనిస్తుంది?

అందుకే తమ భూములకు తాము పరాయివాళ్లుగా, తమ భూముల్లో తామే బానిసలుగా మారిన పరిస్థితి గురించి వాళ్లలో తీవ్రమైన ఆలోచనలు మొదలయ్యాయి. ఒక భూస్వామి దగ్గర జీతగాడుగా పని చేస్తుండిన నాచిక లింగలో కూడా అటువంటి ఆలోచనలు మొదలయ్యాయి. క్రమంగా ప్రజల్లో చైతన్యం రగుల్కొంది. తాము కోల్పోయిన భూములను తిరిగి పొందడం ద్వారానే తమ బానిస బతుకుల నుండి విముక్తి లభిస్తుందని భావించారు. నాచిక లింగ ఒక నాయకుడిగా ముందుకు వచ్చాడు. ఇదే సమయంలో – 2004లో – సి.పి.ఐ. (ఎం – ఎల్) కానూ సన్యాల్ గ్రూప్‌కు చెందిన ఛసి ములియా ఆదివాసి సంఘొ (రైతు కూలీ ఆదివాసీ సంఘం) ఈ ప్రాంతానికి విస్తరించింది. నాచిక లింగ తదితరులు ఆ సంఘంలో చేరి పోరాడడం ద్వారా కోల్పోయిన తమ భూములను తిరిగి స్వాధీనం చేసుకోగలమని భావించారు. సంఘంలో చేరి చురుకైన పాత్రను పోషించడం మొదలుపెట్టారు. ఈ క్రమంలోనే సింగన్న అనే మరో నాయకుడు మిలిటెంట్‌గా ముందుకు దూసుకువచ్చాడు. ఫలితంగా తక్కువ కాలంలోనే ఇక్కడ ఛసి ములియా ఆదివాసీ సంఘొ బలపడింది. సంఘ నాయకత్వంలో 2004 జూన్ – జూలైలో నారాయణపట్నా పంచాయితీలోని బసనాపుట్, డెక్కపార, పొడపొద్ర, బలియపుట్ గ్రామాలలో మొట్టమొదట భూపోరాటాలు ప్రారంభమయ్యాయి. ఈ పోరాట ఫలితంగా 118 ఎకరాల భూమి భూస్వాముల కబ్జా నుండి విముక్తి పొంది తిరిగి ఆదివాసీల సొంతమయింది. అప్పటి దాకా ఆదివాసులను కాల్చుకు తిన్న చిత్రబిడికె, మహంకాళి బిడికె, కొంటొ పొరిడి వంటి ఆదివాసేతర భూస్వాములను గ్రామాల నుండి తరిమేశారు. ఈ పోరాటం సహజంగానే ఇక్కడి పీడిత ప్రజల్లో సంతోషాన్నీ, ఉత్తేజాన్నీ కల్గిస్తే దోపిడీ పాలకవర్గాలకు భయాన్నీ, కలవరాన్నీ కల్గించింది.

నేడు దేశంలోని అన్ని ఆదివాసీ ప్రాంతాలపై బహుళజాతి కంపెనీల దేగకన్ను ఉన్నట్టుగానే ఎన్నో ప్రకృతి సంపదలు, ముఖ్యంగా నాణ్యమైన బాక్సైట్ నిలువలు ఉన్న ఈ ప్రాంతపైనా వాటి కన్ను ఉంది. ఇటువంటి ప్రాంతంలో ఏ పోరాటాన్నయినా, చైతన్యాన్నయినా పాలకవర్గాలు ఎలా సహించగలవు?

అందుకే ఆ చైతన్యాన్ని చిదివెయ్యడానికి ప్రయత్నాలు మొదలుపెట్టారు. 2004 ఫిబ్రవరిలో మావోయిస్టులు కోరాపుట్ ఆయుధాగారంపై దాడి చేశారు. ఈ దాడితో గానీ, మావోయిస్టులతో గానీ ఎటువంటి సంబంధం లేని నాచిక లింగపై ఈ కేసును మోపి 2005లో అరెస్టు చేసి జైల్లో పెట్టారు. నాయకుడిని జైల్లో పెట్టి పోరాటాన్ని ఆపాలనుకున్నారు. కానీ పోరాటం ఆగలేదు. జైల్లో నుండీ, జైలు నుండి విడుదలయ్యా నాచిక లింగ ప్రజలకు మార్గదర్శకత్వం వహిస్తూనే ఉన్నాడు. పూర్తిగా మిలిటెంట్ పోరాటాలే కాకుండా, న్యాయస్థానాల్లోనూ పోరాడాలనుకున్నారు. భూమిపై తమకున్న హక్కును ధృవీకరించుకోవడానికి కోర్టుల చుట్టూ తిరిగారు.

ఒక కేసులో 50 సెంట్ల భూమి కోసం కోర్టుకు పోయి గెలిచారు. అయితే ఈ గెలుపు కోసం వాళ్లు 50 వేల రూపాయలు ధారపోయవల్సి వచ్చింది. ఈ కేసులో స్థానిక జిల్లా కలెక్టర్ ఆదివాసీల పక్షం వహించాడు. అయినప్పటికీ వాళ్లకీ ఖర్చు తప్పలేదు. అయితే కోర్టు లోపలా, కాగితాల్లో ఈ భూమిని వాళ్లు గెలుచుకున్నప్పటికీ, కోర్టు బయటా, ఆచరణలో వాళ్లా భూమిని గెలుచుకోలేకపోయారు. ఈ భూమే కాదు ఇలా ఎన్నో భూముల్ని వాళ్లు కోర్టుల్లో గెలుచుకున్నారు. కానీ భూస్వాముల కబంధ హస్తాల నుండి ఆ భూముల్ని విడిపించి ఏ కోర్టులూ ఆదివాసీలకు స్వాధీనం చేయలేకపోయాయి. ఇలా అనుభవపూర్వకంగా ఈ ప్రజలు కోర్టుల బూటకత్వాన్నీ, నిష్క్రియాపరత్వాన్ని అర్థం చేసుకున్నారు. ఇక అనివార్యంగా మిలిటెంట్ పోరాటం ద్వారానే తమ భూమిని సాధించుకోవాలని నిర్ణయించుకున్నారు. ఇదే సమయంలో ఇదే బ్లాక్‌లోని బొరిగి, నాగులబెద్ద పంచాయితీలలో ఉద్యమ నాయకత్వంలో ప్రజలు పెద్ద ఎత్తున కదిలి సారా బట్టీలపై దాడులు చేసి, భూస్వాముల ఆక్రమణలోని 150 ఎకరాల భూమిని

ఆదివాసులు తిరిగి స్వాధీనం చేసుకున్నారు. ఈ పోరాటాలు ఛసి ములియా ఆదివాసీ సంఘాన్ని ఉత్తేజపరిచాయి.

ఈ ప్రేరణతో నారాయణపట్నా ఆదివాసీలు 2009 జనవరిలో సారా, బ్రాందీలకు వ్యతిరేకంగా మిలిటెంట్‌గా పోరాటం మొదలుపెట్టారు. సారా ద్వారా తమ భూములను భూస్వాములు ఎట్లా గుంజుకున్నారో వాళ్లకు అనుభవపూర్వకంగా తెల్సు కనుక సారా వ్యాపారం మీదకు, సారా తయారీదారుల మీదకు తమ పోరాటాన్ని ఎక్కుపెట్టారు. మొత్తం బ్లాక్ వ్యాప్తంగా ఉన్న ప్రభుత్వ, ప్రైవేట్ సారా, బ్రాందీ దుకాణాలపై వేలాది మంది ప్రజలు కదిలి దాడి చేశారు. సారా బట్టీలను ధ్వంసం చేశారు. రవాణా చేస్తున్న వాహనాలను ధ్వంసం చేశారు. ఫలితంగా నాటి నుండి నేటి వరకూ బ్లాక్‌లోని మెజారిటీ గ్రామాల్లో సారా నిషేధం అమలవుతోంది. నిజానికి సారా వ్యతిరేక పోరాటానికి సంబంధించి ఈ సంఘానికి సుదీర్ఘమైన చరిత్రే ఉంది. మిగతా జిల్లాల్లోనూ ఈ పోరాటాలు చేపట్టారు. ఈ సందర్భంగా ఎన్నోసార్లు సంఘ కార్యకర్తలు అరెస్టయి జైళ్లకు కూడా వెళ్లారు. అయితే పోరాటం మిలిటెంట్‌గా కాకుండా కేవలం ప్రదర్శనలు, ధర్నాలు, అర్జీలకే పరిమితమైంది కనుక ఎటువంటి ఫలితాలనూ ఇవ్వలేదు. మిలిటెంట్ రూపాన్ని చేపట్టడంతో మంచి ఫలితాలనిచ్చింది.

నాచిక లింగ తదితరులు చేస్తున్న విప్లవకర ఆలోచనలు ఆ పార్టీ రాష్ట్ర నాయకత్వానికి మింగుడుపడలేదు. ప్రస్తుత పరిస్థితుల్లో భూస్వాముల ఆక్రమణలో ఉన్న భూముల జోలికి వెళ్లకూడదనీ ఫారెస్టు భూముల స్వాధీనానికి మాత్రమే పరిమితం కావాలని ఒత్తిడి తెచ్చింది. కానీ నారాయణపట్నా బ్లాక్ సంఘం రాష్ట్ర నాయకత్వం చేస్తున్న వాదనలతో ఏకీభవించలేదు. 2009 ఏప్రిల్‌లో వచ్చిన ఎన్నికలను బహిష్కరించి ఆదివాసీ రైతాంగాన్ని భూముల స్వాధీనానికి కదిలించాలని నాచిక లింగ తదితరులు ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనలను అంగీకరించడానికి సిద్ధంగా లేని రాష్ట్ర పార్టీ నాచిక లింగ, గణనాథపాత్రో, తపన్ మిశ్రా వంటి నాయకులను బహిష్కరించారు.

పై చర్యతో ఒక రకంగా నారాయణపట్నా పోరాటానికి మితవాద పార్టీ కల్పిస్తున్న అడ్డంకులు తొలిగిపోయాయి. బహిష్కరించబడిన నాచిక లింగను నారాయణపట్నా సంఘమంతా అంటిపెట్టుకొని ఉంది. వాళ్లు విడి సంఘంగానే తమ పోరాటాన్ని కొనసాగించదలుచుకున్నారు.

అయితే పోరాటాన్ని ఎలాగైనా అణచాలని కంకణం కట్టుకున్న పాలకవర్గాలు ఈ పోరాటాలను అడ్డుకోవడానికి పూనుకున్నాయి. ఆదివాసేతర భూస్వాములు, వివిధ పార్టీల నాయకులు కల్సి పోలీసుల మద్దతుతో 2009, మే 5న 'శాంతిసేన' పేరుతో సల్వాజుడుం మూకను పోలిన అరాచకపు ప్రైవేట్ సేనను ఏర్పాటు చేశారు. ఏర్పడిన రోజునే ఈ సేన నాలుగువేల మందితో నారాయణపట్నాలో ప్రదర్శనను చేసింది. నాచిక లింగ నాయకత్వంలోని ఛసి ములియా ఆదివాసీ సంఘాన్ని నిషేధించాలనీ, సంఘ నాయకులను అరెస్ట్ చేయాలనీ, సంఘం ఆధ్వర్యంలో స్వాధీనం చేసుకున్న భూములను తిరిగి భూస్వాములకు అప్పజెప్పాలని డిమాండ్ చేసింది. ఆ తర్వాత రోజు నుండి ఈ శాంతిసేన గూండాలు గ్రామాలపై దాడులు చేసి బీభత్సాన్ని సృష్టించడం మొదలుపెట్టారు. సంఘ నాయకుల ఇళ్లను ధ్వంసం చేయడం, కనబడిన ప్రతి ఒక్కరినీ కొట్టడం, హింసించడం, పట్టుకెళ్లిపోవడం, గాల్లోకి కాల్పులు జరపడం, వాళ్లు దాచుకున్న ధాన్యాన్నీ, డబ్బులనూ, కోళ్లనూ, మేకలను ఎత్తుకెళ్లిపోవడం వీళ్ల దినచర్యగా మారిపోయింది. తిండి గింజల్లో ఎండ్రిన్, కిర్సనాయిల్ కలుపడం, అన్నం కుండల్లో పొగాకు నమిలి ఉమ్మడం వంటి ఎన్నో హేయమైన చర్యలకూ ఈ గూండాలు పాల్పడ్డారు. ఈ దాడులన్నింటిలోనూ శాంతిసేనతో పాటు పోలీసులు పాల్గొంటున్నారు.

భూమి పైన తమ హక్కును కాపాడుకోవాలన్నా, తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలన్నా ఈ నిర్బంధాన్ని ప్రతిఘటించడం తప్ప ఈ ప్రజలకు మరో మార్గం లేకుండా పోయింది. సాయుధ దాడులను నిరాయుధంగా, శాంతియుతంగా ప్రతిఘటించడం కూడా సాధ్యం కాదని అనుభవపూర్వకంగా తెల్సుకున్నాక ఈ సంఘం ఘెనువా వాహిని అనే మిలీషియా నిర్మాణాన్ని ఏర్పాటు చేసుకుని ఉన్నది.(ఘెనువా – ఆదివాసీ వీరుడు, మంచి గురికాడు. ఆయన స్ఫూర్తితో ఈ పేరును పెట్టుకున్నారు.) సాంప్రదాయక ఆయుధాలతో ఘెనువా వాహిని సాయుధమైంది. దాదాపు 250 గ్రామాల నుండి వేల సంఖ్యలో వాహినిలో చేరారు. ఘెనువా వాహిని 'శాంతిసేన'తో వీరోచితంగా తలపడి ఎక్కడికక్కడ దాని దాడులను విఫలం చేసి దానిని తరిమి తరిమి కొట్టింది. ప్రధానంగా ఈ ప్రతిఘటనకు సింగన్న నాయకత్వం అందించాడు.

శాంతిసేనను తరిమి కొట్టిన ఉత్తేజంతో సంఘం జూన్ 12ను భూ ఆక్రమణ దినంగా ప్రకటించింది. ఈ ప్రకారం జూన్ 12న బ్లాక్‌లోని ఏడు పంచాయతీలనుండి దాదాపు 250 గ్రామాలు కదిలి భూస్వాముల కబ్జాలో ఉన్న 2,500 ఎకరాల భూములను స్వాధీనం చేసుకుని, ఎర్రజెండాలు పాతి నాగళ్లతో దున్నారు. ఇందులో నారాయణపట్నాను ఆనుకుని ఉన్న కోసరాజు, కుంజపాడి వంటి బడా భూస్వాములకు చెందిన 700 ఎకరాల భూమి కూడా ఉంది. ఆ తర్వాత 159 గ్రామాలకు ఈ భూమిని పంచారు. స్వాధీనం చేసుకున్న దాంట్లో అధిక భూమిని వ్యక్తిగతంగా కాకుండా గ్రామాల వారీగా సమిష్టిగా పంచుకున్నారు.

ఈ భూపోరాటం కేవలం భూపోరాటంగానే ఉండిపోలేదు. ప్రస్తుతం ఆదివాసీల అస్తిత్వానికి పెను ప్రమాదంగా ఉన్న మైనింగ్‌కు వ్యతిరేకంగానూ విస్తరించింది. ఇదే జిల్లాలోని పొట్టంగి బ్లాక్‌లోని కొటియా, తురియా, కంటి పంచాయితీలలో వ్యాపించి ఉన్న పర్వత శ్రేణులను దేవమాలి పర్వత శ్రేణులంటారు. ఇవి సముద్ర మట్టానికి 4,385 అడుగుల ఎత్తున, 17 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో ఉన్నాయి. ఈ కొండల్లో 3,700 లక్షల టన్నుల బాక్సైట్ నిల్వలున్నట్టు శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. ఇప్పటికే ఈ పర్వత శ్రేణులకు సమీపంగా ఉన్న సిమిలిగూడ బ్లాక్‌లోని పంచమహల్ పర్వత శ్రేణుల్లో నాల్కో ఫ్యాక్టరీ గత 30 సంవత్సరాలుగా బాక్సైట్‌ను తవ్వుతూ దామన్‌జోడికి తరలిస్తున్నది. ఇప్పుడు దేవమాలి పర్వతాలను కూడా నాల్కో లీజుకు తీసుకుంది. బాక్సైట్ వెలికి తీయడానికి అవసరమైన రోడ్లు తదితర ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌నంతా అది తయారు చేసుకుంది. ఇక ఏ రోజైనా తవ్వకాలు మొదలు పెట్టవచ్చు. గ్రామాలను ఖాళీ చేయాల్సిందిగా నోటీసులు జారీ చేశారు. ఇలా జీవన్మరణ సమస్యతో కొట్టుమిట్టాడుతున్న ప్రజలూ, కొన్ని సంఘాలు కల్సి 'దేవ్‌మాలి సురక్షా సమితి'ని ఏర్పాటు చేసుకొని పోరాడుతున్నారు. ఈ పోరాటానికి ఛసి ములియా ఆదివాసీ సంఘం అండగా నిలబడింది. ఈ సంఘం మద్దతుతో 'దేవ్‌మాలి సురక్షా సమితి' 2009 ఏప్రిల్‌లో అన్ని సెక్షన్ల పీడిత ప్రజలను కలుపుకొని 12 వేల మంది ప్రజలతో బహిరంగ సభ జరిపి పోరాటానికి పిలుపునిచ్చింది. ఇలా భూస్వాములకు వ్యతిరేకంగా మొదలైన ఛసి ములియా ఆదివాసీ సంఘ పోరాటం దళారీ నిరంకుశ బూర్జువాలకూ, సామ్రాజ్యవాదులకూ వ్యతిరేకంగా కూడా మారిపోయింది. ఇలా ఈ సంఘం సమస్యలపై ప్రజలను కదిలిస్తూ, సంఘటితం చేస్తూ ఆరు బ్లాకులకు విస్తరించింది.

ప్రభుత్వ వ్యవస్థ పట్ల ఎన్నడో విశ్వాసాన్ని కోల్పోయిన ఇక్కడి ప్రజలు సంఘాన్ని ఒక ప్రత్యామ్నాయ పాలనా వ్యవస్థగా భావిస్తున్నారు. వాళ్ల ప్రతి సమస్య పరిష్కారానికి సంఘం వైపే చూస్తున్నారు.

అందుకే దోపిడీ శక్తులకు కంటగింపుగా మారింది. ముఖ్యంగా ఈ ప్రాంతపు భూస్వాములూ, లిక్కర్ మాఫియా, మైనింగ్ మాఫియా, రాజ్యం

కలిసి ఈ సంఘంపై అది నడుపుతున్న పోరాటాలపై కక్ష కట్టాయి. వాటిని అణచడానికి మరిన్ని పథకాలను పన్నాయి. అందులో భాగంగా నాచిక లింగ, సింగన్న, రాంపాడి (ఇతను కూడా ఒక నాయకుడు)లను అరాచకులుగా పేర్కొంటూ పోస్టర్లు వేశారు. ఎ.పి.లో అడుగుపెడితే పట్టుకుంటామనీ, కాల్చి చంపుతామనీ బెదిరింపు ప్రకటనలు చేశారు. తమ ప్రియతమ నాయకులను అరాచకులుగా చిత్రీకరించడంతో ప్రజలంతా భగ్గున మండారు. అక్టోబర్ నెలలో దాదాపు రెండు వేల మంది నారాయణపట్నా పోలీసు స్టేషన్‌ను చుట్టుముట్టి పోలీసులతో క్షమాపణలు చెప్పించారు.

ఇలా సంఘటిత చైతన్యంతో ముందుకు సాగుతున్న ప్రజలు తాము పోరాడి సాధించుకున్న భూముల్లో వేసిన పంటను కోసుకోవడానికి సిద్ధమయ్యారు. పోరాటాన్ని దెబ్బతీయడం కోసం శతవిధాల ప్రయత్నం చేస్తున్న పోలీసులు నవంబర్ 19న పథకం ప్రకారం డుంబగూడ గ్రామానికి వెళ్లి మావోయిస్టులకు సహకరిస్తున్నారంటూ ప్రజలను బెదిరించారు. మహిళలతో అసభ్యంగా మాట్లాడారు. సంఘాన్ని దుర్భాషలాడారు. (నల్గురి మహిళలను అత్యాచారం కూడా చేశారు. అయితే ఈ విషయం ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది.) దీన్ని వ్యతిరేకిస్తూ, పోలీసులను నిలదీయాలని నిర్ణయించుకొని నవంబర్ 20న ప్రజలు కదిలి నారాయణపట్నా పోలీసు స్టేషన్‌కు వెళ్లారు. మొదట దాదాపు 200 మంది చేరుకున్నారు. ఇంకా బారులు బారులుగా ప్రజలు తరలి వస్తూనే ఉండినారు. మొదట చేరుకున్న ప్రజలు 'డుంబగూడకు ఎందుకు వచ్చారని ప్రజలతో ఎందుకు దౌర్జన్యంగా ప్రవర్తించారనీ' పోలీసులను ప్రశ్నించడం మొదలు పెట్టారు. కానీ పోలీసులు ఏమీ సమాధానం చెప్పకుండా, అహంకారపూరితంగా స్టేషనుకు తాళం వేసి లోపలికి వెళ్లిపోయారు. దీన్ని సహించలేని సింగన్న, మరికొందరు ఘెనువా వాహిని కార్యకర్తలు గేట్ దూకి లోపలికి వెళ్లారు. స్టేషన్ ఆఫీసర్ వద్దకు వెళ్లి నిలదీశారు. ఇరుపక్షాల మధ్య వాగ్వివాదం జరుగుతుండగానే పై అంతస్తులోనూ, కిందా ఉన్నా పోలీసులు ఎటువంటి హెచ్చరికలు చేయకుండా విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో తలకు తూటా తగిలి ఆంద్రు అనే కార్యకర్త అక్కడికక్కడే కన్నుమూశాడు. సింగన్న కూడా గాయపడి పడిపోయాడు. ఆ తర్వాత అతన్ని పోలీసులు గొడ్డలితో పాశవికంగా నరికి చంపారు. ఈ ఘటనలో 20 మందికి పైగా గాయపడి చెల్లాచెదురయ్యారు.

ఈ దారుణ సంఘటనను రాష్ట్రంలోని, దేశంలోని ఎందరో ప్రజస్వామిక వాదులు ముక్తకంఠంతో ఖండించారు. అయితే ప్రజాస్వామ్యం అనే మాటను వల్లెవేయడం తప్ప, దాని అర్థాన్ని ఎన్నడూ వంటపట్టించుకోని ప్రభుత్వం ఏ ప్రజాస్వామిక గొంతుకనూ సహించలేకపోయింది. నిజనిర్ధారణ కోసం వెళ్లిన ప్రజాస్వామిక వాదులను, మహిళా బృందాలను శాంతి సేన అడ్డుకొని దౌర్జన్యాలకు పాల్పడింది. నారాయణపట్నా పట్టణం ఒక నిర్బంధ శిబిరంగా మారిపోయిన వైనాన్ని అక్కడికి వెళ్లిన ప్రజాస్వామికవాదులంతా వెల్లడించారు. ఒక్క నారాయణపట్నా పట్టణంలోనే కాకుండా బందుగాం, లకింపూర్, దామన్‌జోడి వంటి పట్టణాలలో మొత్తం 8 శిబిరాలు ఉన్నాయి. ఇవన్నీ శాంతిసేనతో నిండి ఉన్నాయి. అంటే ఊపిరి పీల్చుకోవడానికి కూడా స్వేచ్ఛ లేకుండా ఈ పట్టణాల్లోని సాధారణ జన జీవనం ఎంతగా ప్రభావితం అవుతున్నదో అర్థం చేసుకోవచ్చు.

ఇక ఇప్పటికీ ఈ శాంతిసేన, వాటికి తోడూ నీడా అయిన అర్ధసైనిక బలగాలు కూంబింగ్‌లు, దాడులు చేస్తూ ఈ ప్రాంతమంతటా భీతావహ వాతావరణాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. కుయి ప్రజల అస్తిత్వ పోరాటానికి నాయకత్వం వహిస్తూ, ప్రజల ప్రేమాభిమానాలను విశేషంగా చూరగొన్న నాచిక లింగను హత్యచేసే లక్ష్యంతో 'ఆపరేషన్ లింగా' పేరుతో ఈ బీభత్సకాండను కొనసాగిస్తున్నారు. ఇలా దాడులు చేస్తూ ప్రజల్ని అరెస్టులు చేస్తున్నారు, చిత్రహింసలకు గురిచేస్తున్నారు, లొంగిపోవాలని ఒత్తిడి తెస్తున్నారు. సంఘంలో చురుగ్గా పనిచేస్తున్న సంఘనాయకుల ఇళ్లను ధ్వంసం చేస్తున్నారు. ఈ విధంగా కొన్ని గ్రామాలు 15 – 20 సార్లు దాడులకు గురయ్యాయంటే పరిస్థితి ఎంత భీతావహంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. నవంబర్ 20 తర్వాత జరిగిన దాడుల్లో ఇప్పటికి 135 మంది అరెస్టయ్యారు. ఇందులో 20 – 30 శాతం మంది మహిళలున్నారు. పసిపిల్లల తల్లులు కూడా ఉన్నారు. కుముదిని, గోపాల్ సిరికా వంటి నాయకులు కూడా అరెస్టయిన వారిలో ఉన్నారు. తొమ్మిది మంది చిన్నపిల్లలు కూడా ఉన్నారు. ఫిబ్రవరి 14న బలియాపుట్ గ్రామంపై దాడి చేసిన సందర్భంగా పోలీసులు ఒక యువతిపై అత్యాచారానికి కూడా పాల్పడ్డారు. డుంబగూడ గ్రామానికి చెందిన నారీ కూతురు చుట్టపు చూపుగా బలియపుట్‌కు వెళ్లగా అక్కడ ఆమెను నలుగురు పోలీసులు పాశవికంగా అత్యాచారం చేశారు.

ఇలా అరెస్టయి జైళ్లలో ఉన్న వారి పరిస్థితి కూడా ఘోరంగా ఉంది. ఉంటుంది కూడా – జైళ్లు సంస్కరణాలయాలు అని రాజ్యం వల్లెవేస్తుంది కానీ వాస్తవానికి అదలా ఎప్పుడూ భావించదుగా. ఫలితంగా 2010 ఏప్రిల్ నెలలో పగ్గం గ్రామానికి చెందిన కొండగొర్రె గంగులు మరణించాడు. ఇతని శవాన్ని ఇంటికి చేర్చడంలో జైలు అధికారులు నిర్లక్ష్యాన్ని ప్రదర్శించారు. అలాగే 2010 జూన్ నెలలో మరొకరు మరణించారు.

ఇలా సాధారణ ప్రజలపై, లేదా ఒక చట్టబద్ధమైన ఛసి ములియా ఆదివాసీ సంఘంపై చేస్తున్న ఈ ఫాసిస్ట్ దాడులను మావోయిస్టులపై చేస్తున్న దాడులుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమర్థించుకుంటున్నాయి. ఇలా సమర్థించుకోవడం కోసమే దీన్ని మావోయిస్టుల పోరాటంగా చిత్రీకరిస్తున్నాయి.

నిజానికి ఈ ప్రజలు ఏం కోరుకున్నారు? అన్యాయంగా తమ నుండి గుంజుకున్న తమ భూములు తమకు తిరిగి ఇవ్వాలని కోరుకున్నారు. ఇది న్యాయమైన కోరికే కాదు చట్టబద్ధమైనది కూడా. 2/56 ప్రకారం ఆదివాసీల భూములు అమ్మడం, కొనడం, అన్యాక్రాంతం కావడం చెల్లదు కదా. 'మా భూములు మాకు కావాలి' అని ఈ ప్రజలు అడిగారంటే సారాంశంలో పై చట్టాన్ని అమలుచేయమనే.

రాజ్యం తాను తయారు చేసిన చట్టాన్ని తానే అమలు చేయడానికి ఎందుకు నిరాకరిస్తున్నది? చట్టాన్ని వుల్లంఘించిన వాళ్ల పక్షాన నిలబడి, అమలు చేయమని అడిగిన వారిపై ఎందుకు నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నది?

దీనికి సమాధానం స్పష్టమే! రాజ్యం దోపిడీ వర్గ ప్రయోజనాలకు కట్టుబడి ఉంది. అది చట్టాల్ని తయారు చేయడమైనా, అమలు చేయడమైనా, ఆఖరికి ధిక్కరించడమైనా దోపిడీ వర్గ ప్రయోజనాల కోసమే చేస్తుంది. ఒక్కోసారి ప్రజాస్వామ్య శక్తుల ఒత్తిడికి లోబడినట్టు నటించి ప్రజా ప్రయోజనాలకు అనుకూలంగా కొన్ని చట్టాలను అనివార్యంగా చేసినా వాటిని అదెన్నడూ అమలుచేయదు. అమలు చేయమని అడిగినా సహించదు.

ప్రస్తుతం ఈ ప్రజలు తమ భూమి తమకు చెందాలని అడుగుతున్నారు? ఇది సహజమైన కోరిక. కానీ ఈ కోరిక పాలకవర్గాలకు మింగుడుపడడం కష్టం. ఎందుకంటే దోపిడీ వర్గ పునాదులను కదిలించే శక్తి ఉన్న కోరిక ఇది. ఈ కోరిక అక్కడ వేళ్లూనుకుపోయిన భూస్వాములకు మింగుడు పడదు. తిష్టవేసుకున్న, తిష్టవేసుకోవాలని ప్రయత్నిస్తున్న బహుళజాతి కంపెనీలకూ మింగుడు పడదు.

కాబట్టి ఈ పోరాటాన్ని అణచివేయడానికే అది ప్రయత్నిస్తుంది. అణచివేతకు సాధికారత కోసం మావోయిస్టు ముద్ర ఒకటి వాళ్ల చేతిలో ఆయుధంగా ఉంది, ఎవరి నుదిటిపైనైనా వేయడానికి.

ఒక న్యాయమైన చట్టబద్ధమైన కోరికను తీర్చుకోవడానికి చట్టబద్ధ మార్గాలన్నీ మూసుకుపోయినప్పుడు ప్రజల ముందు ఇంకే పోరాట మార్గముంది?

*(రచయిత ఆదివాసి ఉద్యమ కార్యకర్త)* వీ

***భద్రతా దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని రద్దు చేయాలని కోరుతూ మణిపూర్‌లో గత పదేళ్లుగా నిరాహార దీక్ష చేస్తున్న ఐరోమ్ షర్మిల నిబద్ధత పోరాడే వారికి స్ఫూర్తినిస్తుందని అంటున్నారు* సి. రాజశేఖర్**

# నిరాహార దీక్షకు పదేళ్లు!

ఐరోమ్ షర్మిలా చాను, ఇప్పుడు మణిపూర్‌లో ఈ పేరు తెలియని వారుండరు. సైన్యానికి ప్రత్యేక అధికారాలు కల్పిస్తూ భారత ప్రభుత్వం రూపొందించిన భద్రతా దళాల ప్రత్యేక చట్టం (ఎ.ఎఫ్.ఎస్.పి.ఎ.) 1958 ని రద్దు చేయాలనే ఏకైక లక్ష్యంతో 2 నవంబర్ 2000న మొదలైన ఆమరణ నిరాహార దీక్షకు ఈ సంవత్సరంతో పదేళ్లు నిండాయి. చట్టం రద్దు అయ్యే వరకు, ప్రాణం ఉన్నంత వరకు దీక్ష కొనసాగిస్తానని షర్మిల ప్రకటించింది.

సరిగ్గా పదేళ్ల క్రితం అంటే, 1 నవంబర్ 2000న మణిపూర్ మలోమ్‌లో తన ఇంటి ముందు బస్సు కోసం వేచి చూస్తున్న పది మంది సామాన్య పౌరులను అస్సోం రైఫిల్స్‌కు చెందిన పారా మిలిటరీ దళాలు కాల్చి చంపడం ప్రత్యక్షంగా చూసింది. మరణించిన వారిలో 62 ఏళ్ల ముసలామె, జాతీయ శౌర్య అవార్డ్ గ్రహీత పద్దెనిమిదేళ్ల సినం చంద్రమణి ఉన్నారు. ఈ సంఘటనకు వ్యతిరేకంగా తీవ్ర ఆందోళనలు చెలరేగాయి. ప్రజాసంఘాలు, మానవ హక్కుల సంఘాలు ఈ సంఘటనపై న్యాయ విచారణ జరిపాలనీ, భద్రతా బలగాల ప్రత్యేక చట్టం (ఎ.ఎఫ్.ఎస్.పి.ఎ.) 1958ను వెంటనే రద్దు చేయాలని డిమాండ్ చేశాయి. కాని, ప్రభుత్వం ఎలాంటి విచారణకు ఆదేశం ఇవ్వలేదు.

ఈ సంఘటనతో ఐరోమ్ షర్మిల చలించి రాజ్యానికి వ్యతిరేకంగా నిరసన తెలపాలని నిశ్చయించుకుంది. తల్లి ఆశీర్వాదం తీసుకొని 2 నవంబర్ 2000న ఎ.ఎఫ్.ఎస్.పి.ఎ. 1958 చట్టం రద్దు ఏకైక లక్ష్యంతో ఆమరణ నిరాహార దీక్ష చేపట్టింది. కాలక్రమంలో మణిపూర్ ప్రజలపై భద్రతా బలగాల దారుణ మారణకాండకు నిరసనగా, అమలవుతున్న దమనకాండను వెంటనే ఆపాలని ఆమె డిమాండ్ చేసింది.

దీక్ష చేపట్టిన మూడవ రోజు 6 నవంబర్ 2000న పోలీసులు ఆమెను 'ఆత్మహత్యా యత్నం' కేసు పెట్టి అరెస్టు చేశారు. ఆమెతో బలవంతంగా ఆహారం తినిపించాలని చూసిన పోలీసులకు ఆమెనుంచి తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. దీంతో వాళ్లు ఆమెకు సెలైన్ ఎక్కించారు. అప్పటిలో ఆమె అరెస్టు కావడం, విడుదల కావడం తిరిగి అరెస్టు కావడం జరుగుతూనే ఉంది. ఆమెను 2 అక్టోబర్ 2006లో విడుదల చేశారు. ఆమె ఢిల్లీ చేరుకొని మహాత్మా గాంధీ సమాధి రాజ్‌ఘాట్ వద్ద తిరిగి ఆమరణ నిరాహార దీక్ష చేపట్టింది. అక్కడి నుంచి ఆమె రాష్ట్రపతికీ, ప్రధానమంత్రికీ, హోంమంత్రికీ ఎ.ఎఫ్.ఎస్.పి.ఎ. 1958 చట్టం రద్దు కోరుతూ లేఖలు రాశారు. వారి నుంచి జవాబు రాలేదు. పోలీసులు ఆమెను అక్టోబర్ 6న మళ్లీ అరెస్టు చేసి. ఢిల్లీ ఎయిమ్స్‌లో చేర్పించారు. ఇక్కడే ఆమెను నోబెల్ గ్రహీత షిరీన్ ఎబదీ కలిశారు. ఆమె షర్మిల ఆమరణ దీక్షకు తన మద్దతు తెలుపుతూ అంతర్జాతీయంగా దీనికి ప్రచారం చేశారు. ఈ విషయాన్ని ఐక్యరాజ్య మానవ హక్కుల సంఘం మందుకు తీసుకువెళ్తానని కూడా చెప్పారు. ఆమె ఆరోగ్య పరిస్థితి క్షీణించడంతో తిరిగి ఆమెని మణిపూర్ పోలీసులకు అప్పగించారు. ఈ పదేళ్ల కాలంలో ఆమె ఆరోగ్యం తీవ్రంగా క్షీణించింది. ఆమెకు అవయవాలపై పట్టు లేకుండా పోయింది. ఆమె అవయవాలు ఏవీ సరిగా పనిచేయడం లేదు. ఆమె పదేళ్ల నుంచి ఏ ద్రవ పదార్థం తీసుకోకపోవడంతో అనేక అనారోగ్యాల బారిన పడింది. ఆమెను పరీక్షిస్తున్న డాక్టర్లు ఏక్షణానైనా ఆమెకు ఏమైనా జరగవచ్చు అని ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

2005లో నోబెల్ శాంతి బహుమతి కోసం ఆమె పేరును గౌహతీలోని నార్త్ ఈస్ట్ నెట్‌వర్క్ సంస్థ ప్రతిపాదించింది. 18 మే 2007న ఆమెకు గ్వాంగ్జు ప్రైజ్ ఫర్ హ్యూమన్ రైట్స్ అవార్డ్ వచ్చింది. ఈ అవార్డ్‌ను దక్షిణ కొరియా ప్రదానం చేసింది. షర్మిల సోదరుడు ఐరోమ్ షాంగ్జీ సియోల్ వెళ్లి ఆమె తరఫున అవార్డ్ అందుకున్నాడు. 11 సెప్టెంబర్ 2010న రవీంద్రనాథ్ ఠాగూర్ శాంతి బహుమతిని అందజేశారు. నిరాహార దీక్ష చేపట్టి పదేళ్లు అయిన సందర్భంగా ఆమెను నోబెల్ బహుమతికి తిరిగి నామినేట్ చేయాలని సైన్స్ అండ్ రేషనలిస్ట్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా, హ్యూమన్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా, పలు ప్రజా సంఘాలు విజ్ఞప్తి చేశాయి.

ఇక ఎన్నో వివాదాలను ఎదుర్కొంటోన్న ఎ.ఎఫ్.ఎస్.పి.ఎ. 1958 చట్టం విషయానికి వస్తే, ఈ చట్టం వల్ల భద్రతా దళాలకు ఒక వ్యక్తిపై అనుమానం వస్తే అతనిని ఎలాంటి ఆధారాలు లేకుండా విచారణ కానీ, లేదా అవసరమైతే కాల్చి చంపే అధికారం ఉంటుంది. భద్రతా దళాలకు ఎలాంటి అనుమతి లేకున్నా ఎవరినైనా తనిఖీ చేసే అధికారం, ఎవరినైనా నిర్బంధించే అధికారం, ఎలాంటి హెచ్చరిక లేకుండా కాల్పులు చేసే అధికారం కల్పిస్తుంది. దీంతో భద్రతా బలగాల విచక్షణారహిత చర్యల వల్ల మణిపూర్ సామాన్య పౌరులు తీవ్ర పరిణామాలు ఎదుర్కొంటున్నారు. చట్టం అమలలోకి వచ్చిన తరువాత భద్రతా దళాలు ఎంతో మందిని విచారణ పేరుతో ఎత్తుకెళ్లారో లెక్కే లేదు. అందులో చాలామంది జాడ ఇప్పటికీ తెలియదు. వారు బతికున్నారో, మరణించారో కూడా వారి కుటుంబ సభ్యులకు తెలియదు. ప్రజా సమూహంలో నుంచి ఎవరిపైనా అనుమానం వస్తే వారిని ఎత్తుకెళ్లడం, విచారణ పేరుతో జైళ్లలో నిర్బంధించడం, తీవ్ర చిత్రహింసలకు గురిచేయడం, వారి ఆచూకీ లేకుండా ఇవి మణిపూర్, ఈశాన్య భారతంలో నిత్య కృత్యంగా భద్రతా బలగాలు చేస్తున్నన దురాగతాలు.

పదేళ్లుగా భద్రతా దళాల ప్రత్యేక చట్టం రద్దుకు నిరాహార దీక్ష చేస్తున్న ఐరోమ్ షర్మిలా చాను సంకల్పం నెరవేరాలనీ, భారత ఈశాన్య రాష్ట్ర ప్రజలు, దేశంలోని అన్ని రాష్ట్రాల పీడిత వర్గాల ప్రజలు నిత్యం అనుభవిస్తున్న రాజ్య అణచివేత నుంచి బయట పడాలనే ఆకాంక్ష నెరవేరాలని ఆకాంక్షిస్తూ...

*(రచయిత వీక్షణం సబ్ ఎడిటర్, కరస్పాండెంట్)* వీ

తెలుగు సాహిత్యంలోనూ, ప్రపంచ సాహిత్యంలోనూ ప్రఖ్యాతి గాంచిన, తప్పనిసరిగా చదవవలసిన, దృష్టినిచ్చే పుస్తకాల గురించి చెపుతున్నారు **ముక్తవరం పార్థసారథి**

# దోసిట్లో పుస్తకాలు ఇన్నేనా?

వ్యక్తి చైతన్యానికి సంస్కృతి, చరిత్రల అవగాహన తప్పనిసరి అంటాడు గోర్కీ. అంటే, వేదవాఙ్మయంతో ప్రారంభించి, రామాయణ భారతాలతో సహా, ప్రాచీన కావ్యాలూ కూడా ఎంతో కొంత తెలిసుండాలి. అయితే, మనం చెప్పుకుంటున్నది ఆధునిక సాహిత్యం గురించి.

మార్క్స్ జీవిత చరిత్ర రాసిన ఫ్రాన్సిస్ వీన్ 'పెట్టుబడి'ని ఒక గోథిక్ (అంటే హారర్, మిస్టరీ, సస్పెన్స్) నవలగా అభివర్ణిస్తాడు. ఇది కొరుకుడు పడని పొలిటికల్ ఎకానమీ అని దూరం పెట్టడం కన్న కథగా చదివినా మంచిదే. నిజానికి, చాలామంది సాహితీవేత్తలకన్న ఎక్కువ సాహిత్యాధ్యయనం చేశాడు మార్క్స్. ఒక నాటకం కూడా రాశాడు. 'పెట్టుబడి'లో కొన్ని వందల సాహిత్య గ్రంథాల ప్రస్తావన ఉందంటారు పరిశోధకులు. ఇవి గానీ, మార్క్స్ ఎంగెల్స్ ఇతర రచనలు గానీ, ముఖ్యంగా రెండు చిన్న పుస్తకాలు, పారిస్ మాన్యుస్క్రిప్ట్స్, ఫ్యూర్‌బా – చదివితే మత్తు వదులుతుంది. కళ్లు తెరుచుకుంటాయి.

ఇక తెలుగు పుస్తకాల గురించి – గురజాడ 'కన్యాశుల్కం' చదవకపోతే తెలుగు సాహిత్యం గురించి ఏమీ తెలియనట్టే. వందేళ్లు గడిచినా నిత్య నూతనమైన నాటకమది. మనలోని ఒక పార్శ్వమే గిరీశం గదా అని తెలుసుకుని సిగ్గుపడతాం. (ఇది కూడా గిరీశం లక్షణమే.) 'ముత్యాల సరాలు', 'దిద్దుబాటు', 'మెటిల్డా', 'మీ పేరేమిటి?', 'పెద్ద మసీదు' లాంటి కథలు అందరూ చదవక తప్పని గొప్ప రచనలు.

మా తరం వాళ్లకు కొత్తగా ఆలోచించడం నేర్పింది చలంగారు. ఆయన పుస్తకాలేవీ చదవకముందే 'యోగ్యతా పత్రం' కంఠస్థం చేసిన వాళ్లు నాకు తెలుసు. స్వేచ్ఛాప్రియత్వం, అధికార ధిక్కరణ ఆయన రచనల్లోని ప్రధాన లక్షణాలు. (పవర్ ఆఫ్ ది వర్డ్ ఏమిటో తెలుసుకోవాలంటే చలాన్ని చదవక తప్పదు.) మన ఫెమినిస్ట్ రచయితల కంటే చాలా ముందే ఫెమినిస్ట్ రచనలు చేశారాయన. ఈ ధోరణిని ఆవిష్కరించింది ఆయన మొదటి నవల 'శశిరేఖ'. అయినా అందరికీ తెలిసింది 'మైదానం'. ఆ తర్వాత 'అరుణ', 'అమీనా'లలో ఆయన శైలీ వైభవం చదివి తెలుసుకోవాల్సిందే. అయితే చలం కథలు మాత్రం వాటికవే సాటి. ఏ ఒక్కదాన్నీ ప్రత్యేకంగా ప్రస్తావించనవసరం లేదు. చదవడం ప్రారంభిస్తే వదిలిపెట్టలేరు. ఆధ్యాత్మికంలో కూరుకుపోయిన దశలో కూడా శిష్యోపశిష్యుల్ని తయారు చేసుకోక పోవడం ఆయన నిజాయితీకి నిదర్శనం.

'మాలపల్లి' చదివారా? గాంధేయవాదమైతే కావచ్చు గానీ, అంత సమగ్రంగా సమాజ చిత్రణ చేసిన నవల మరొకటి లేదు. పెద్ద నవల. అయితేనేం ఎక్కడా పట్టు సడలదు. ముగించాక గ్రేట్ అంటారు మీరు. ఉన్నవగారి కీర్తి పతాక 'మాలపల్లి'.

కథలు చదివే వారెవరికీ కొడవటిగంటి కుటుంబరావు గార్ని పరిచయం చెయ్యవలసిన అవసరం లేదు. అన్ని వందల రచనలు చేసిన రచయిత తెలుగులో మరొకరు లేరు. మార్క్సిజం వెలుగులో తెలుగు మధ్యతరగతి కుటుంబ జీవితాన్ని విశ్లేషించిన కొ.కు. కథలు/నవలలు 'ఎవరైనా రాయొచ్చిలా' అనుకునేంత సులభంగా, సరళంగా ఉంటాయి. అలాగని వాటిని అనుసరించే ప్రయత్నం మాత్రం చెయ్యకూడదు. ఆ ఆలోచనల వెనక, వాక్య నిర్మాణం వెనక గొప్ప సాధన ఉంది. 'బకాసుర', 'చదువు', 'తిమింగలం వేట' అంటూ కొన్నింటిని ప్రత్యేకించనవసరం లేదు. అన్నీ అరుణకాంతిలో విరిసిన పుష్పాలే.

తెలుగులో రాజకీయ రచనలు చాలా తక్కువ. వుప్పల లక్ష్మణరావు గారి 'అతడు – ఆమె' అలాంటి అరుదైన నవల. ఇరవయ్యవ శతాబ్ది ప్రథమార్థంలోని సంక్షుభిత రాజకీయ, సామాజిక జీవితాన్ని చిత్రించిన నవల. ఆయన ఆత్మకథ 'బతుకు పుస్తకం' కూడా చదవండి. విలక్షణ రచయిత లక్ష్మణరావు గార్ని మిస్ కావద్దు.

రష్యన్ రచయిత చెహోవ్ కథలు చదివారా? చదవకపోతే, రావి శాస్త్రిగారి తొలి కథలు తప్పక చదవండి. చెహోవ్ తెలుగులో రాశాడా అన్నట్టుంటాయవి. అయితే, రావిశాస్త్రిగార్ని పేదల రచయితగా నిలబెట్టింది 'ఆరు సారా కథలు', 'రుక్కులు', 'రాజు–మహిషి', 'రత్తాలు– రాంబాబు' వగైరా. శాస్త్రిగారి కథల్లో తెలుగు కథ శిఖరారోహణ చేసింది.

శాస్త్రి గారి మిత్రులు, మరో గొప్ప రచయిత కాళీపట్నం రామారావు గారి కథలు కూడా తప్పక చదవాలి. ముఖ్యంగా 'యజ్ఞం', 'కుట్ర', 'వీరుడు – మహావీరుడు' లాంటివి.

ప్రతి కథా ఓ మాస్టర్ పీస్ అన్నట్టుగా రాసిన కథకుడు చాగంటి సోమయాజులు. కథా రచనకు ఆయన పెట్టుకున్న ప్రమాణాలు చాలా కఠినమైనవి. ఉన్నతమైనవి. రాశి కాదు, వాసి ముఖ్యం అనుకున్నాడు. చిత్రిక పట్టినట్టు కనిపించని సహజ కళాకృతులు ఈ కథలు. 'ఎంపు', 'కుంకుడాకు', 'ఏలూరెళ్లాలి', 'వాయులీనం', ' పోనీను' ఒకటేమిటి, ప్రతి కథా – దేనికదే సానపట్టిన వజ్రం.

ఇక, కె.ఎన్.వై. పతంజలిని చదవకపోతే మన పఠనా కార్యక్రమం అసమగ్రంగా ముగిసినట్టే. అద్భుతమైన వ్యంగ్య రచయిత పతంజలి. ఈయన నవలికల్లో నాకు బాగా నచ్చినవి 'గోపాత్రుడు', 'పిలక తిరుగుడు పువ్వు'. ముఖ్యంగా 'ఓ దెయ్యం ఆత్మ కథ'. పతంజలి ఊహాశక్తికి ఆకాశమే హద్దు అని నిరూపిస్తాయవి. నా మట్టుకు నాకు పతంజలి ఆంధ్రా (జొనాథన్) స్విఫ్ట్.

చివరగా, నేటి రచయిత నామిని అంటే నాకు మహా ఇష్టం. రెండు మూడు వాక్యాల్లో మన కళ్లు చెమర్చేలా చేయగల కథా మాంత్రికుడు ఈ సుబ్రహ్మణ్యం నాయుడు. 'పచ్చనాకు సాక్షిగా' తో సహా, మరికొన్ని రచనలు

కలిపి 'మిట్టూరోడి పుస్తకం'గా వచ్చింది. వెంటనే చదవండి.

వీళ్లేనా మనం చదవాల్సిన రచయితలు? ఇంకెవరూ లేరా?

పానుగంటివారి 'సాక్షి' వ్యాసాలు, హేతువాది, రాయిస్టు, అరవిందిస్టు గోపీచంద్ రచనలు, కరుణకుమార కథలు, బుచ్చిబాబు, ప్రజాకవి కాళోజీ 'నా గొడవ', వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి', 'గంగు' ప్రస్తావించలేదేం? మరో వంద, రెండు వందల పుస్తకాలతో జాబితా తయారు చెయ్యొచ్చు. చురుకైన పాఠకులు తెలుగు సాహిత్యాన్నంతా ఆర్నెల్లలో, మహా అయితే ఏడాదిలో ఆపోసన పట్టగలరని తెలుసు. ఆ తర్వాత, వార పత్రికల్లో వస్తున్న సీరియల్స్ చదివి మీ సాహిత్యాభిలాషను తృప్తి పరుచుకోవచ్చు. కాని, ఇంగ్లిష్ చదవగలిగితే, అది మరోలోకం. ప్రపంచ సాహిత్యానికి ముఖద్వారం ఇంగ్లిష్. అన్ని విదేశీ భాషల పుస్తకాలూ ఇంగ్లిష్‌లోకి అనువాదమవుతాయి. అంటే మీరు పెరటి బావి నుండి సముద్రం దాకా వచ్చారన్నమాట.

మీ వీలును బట్టి, దొరికినప్పుడు చదవటానికి నాకు నచ్చిన కొన్ని పుస్తకాల గురించి:

అప్పటికి మన దగ్గర ప్రబంధ యుగమో, అంతకుముందో తెలియదు గానీ, 1505లో అచ్చయింది తొలి ఆధునిక నవల 'డాన్ కిహోటి'. రచయిత మిగ్వెల్ సెర్వాంటెస్. సిడ్నీ షెల్డన్ లాంటి వాళ్ల బెస్ట్ సెల్లర్స్ నేనూ అప్పుడప్పుడు చదువుతూనే ఉంటాను. ఏ పేజ్-టర్నర్ తీసిపోనంత ఉత్కంఠతతో నన్ను చదివించిన నవల డాన్ కిహోటి. భ్రమ-వాస్తవానికి గీత చెరిగినప్పుడు వ్యక్తులు చేసే పనులు ఎంత వింతగా ఉంటాయో చెప్పడమే ఇందులో కథా వస్తువు. అవును మన హీరో రాక్షసులని భ్రమపడి గాలిమరలతో యుద్ధం చేస్తాడు. ఇది హాస్యప్రధానమైన నవలే అయినప్పటికీ, వ్యక్తి అస్తిత్వ మూలాలను ప్రశ్నించింది. పెద్ద నవల. ఇప్పటికి కొన్ని డజన్ల అనువాదాలు వచ్చాయి. ఇటీవలే సరికొత్తగా, సరళమైన ఇంగ్లిష్‌లో ఎడిత్ గ్రాస్‌మాన్ కొత్త అనువాదం వచ్చింది. దీన్ని బైబిల్ ఆఫ్ హ్యూమానిటీ అన్నారు. ఆ పొగడ్తలన్నీ అనవసరం. మీరు ప్రారంభిస్తే వదిలిపెట్టలేని పుస్తకం డాన్ కిహోటి.

'మృతజీవులు' గురించి మీకు తెలుసా? చాలాకాలం క్రితం విశాలాంధ్ర వాళ్లు కొ.కు. అనువాదం ప్రచురించారు. ఇటీవలే పీకాక్ క్లాసిక్స్ వాళ్ల సంక్షిప్తానువాదం కూడా వచ్చింది. మూలరచన పేరు 'డెడ్ సోల్స్'. రచయిత గొగోల్ (హోహోల్). రష్యన్ నవల. చిచికోవ్ అనబడే లోభి దేశమంతా తిరిగి మరణించిన అర్ధ బానిసల (సెర్ఫ్)ను సేకరిస్తాడు. దానికొక కారణముంది. ఆ రోజుల్లో భూస్వాముల హోదా నిర్ణయించేది వాళ్ల దగ్గరున్న అర్ధ బానిసల సంఖ్యే. దాని ఆధారంగానే బ్యాంకులు అప్పులు కూడా ఇస్తాయి. సమాజ వ్యవస్థ వికృత రూపాన్ని ఇంత ప్రతిభావంతంగా చిత్రించిన నవల నాకు తెలిసి మరొకటి లేదు.

మరో ముగ్గురు రష్యన్ల గురించి కూడా ఇక్కడే మాట్లాడుకొందాం. తొల్‌స్తోయ్ పేరు మీకు తెలుసు. ఈ ఏడాది ఆయన శతవర్ధంతి. ఆయన రాసిన 'మనిషికెంత నేల కావాలి?' కథ ఒకప్పుడు స్కూల్లో పాఠ్యాంశంగా కూడా ఉండేది. 1805లో రష్యా మీద నెపోలియన్ చేసిన యుద్ధం గురించిన నవల 'యుద్ధం – శాంతి' (బెల్లంకొండ రామదాసు అనువాదం), 'అన్నా కరెనీనా' (తాపీ ధర్మారావు అనువాదం) మార్కెట్లో ఉండొచ్చు. నాకైతే 'యుద్ధం – శాంతి' కన్నా 'అన్నా కరెనీనా' ఇష్టం. సాహిత్యంలో వివాహేతర సంబంధాలను చిత్రించిన కథలకు కొదవలేదు. ఈ నవల కన్నా కొన్ని సంవత్సరాల ముందే మరో గొప్ప నవల ఫ్రెంచ్ రచయిత గుస్తావ్ ఫ్లొబేర్ రాసిన 'మదాం బావరి' సంచలనం సృష్టించింది. (అందులో కూడా కథా వస్తువు వివాహేతర సంబంధమే.) కాని గొప్ప నవలలకు కథా వస్తువు ఒక ఆలంబన మాత్రమే. ఈ మహావృక్షాలు ఎందరు తరువాతి తరాల రచయితలకు నీడనిచ్చాయో! ఏడు వారాల నవలలూ, వంద పేజీల నవలలూ చదవడం అలవాటైన మనకు, నిజమైన నవలాస్వరూపమేమిటో తెలుసుకోవాలంటే, పై రెంటిలో ఒకటైనా చదవక తప్పదు.

దొస్తొయేవ్‌స్కీని పశ్చిమ దేశాల వాళ్లు, తొల్‌స్తోయ్ అంత ప్రతిభావంతుడనీ, మరికొందరు అంతకన్నా గొప్పవాడనీ అంటారు. వ్యక్తి అంతర్లోక సంఘర్షణ, నిష్కృతి ఆయన కథా వస్తువులు. 'క్రైం అండ్ పనిష్‌మెంట్' నిజంగా క్రైం నవలే. ఒకరకంగా దొస్తొయేవ్‌స్కీ నవలలన్నీ క్రైం నవలలే. ఈయన మాస్టర్‌పీస్ 'బ్రదర్స్ కరమజోవ్'. గ్రేటెస్ట్ నావెల్ ఇన్ ది వరల్డ్ ఏది అని పోటీ పెడితే, 'యుద్ధం – శాంతి'కీ, 'బ్రదర్స్ కరమజోవ్'కీ ఓట్లు సమానంగా వస్తాయంటారు. 'నా సాపేక్ష సిద్ధాంతం కన్నా జటిలమైనది బ్రదర్స్ కరమజోవ్‌లోని పాత్రల మనస్తత్వం' అంటూ దొస్తొయేవ్‌స్కీకి జోహారులర్పించారు ఐన్‌స్టీన్.

చిన్న కథకు ప్రపంచ సాహిత్యంలో అగ్రస్థానం కల్పించింది చెహోవ్, ఫ్రెంచ్ రచయిత మపాసా. చెహోవ్ ఏడెనిమిది వందల కథలూ, మపాసా నాలుగైదు వందల కథలూ రాశారు. ఏవి దొరికితే అవి చదవండి. ఇంతవరకూ, వాళ్ల కథల్లో ఏ ఒక్కటీ బాగులేదన్న పాఠకుడు పుట్టలేదు.

ఇక గోర్కీ 'అమ్మ' గురించి కొత్తగా చెప్పటానికేముంది? అది అందరికీ అవశ్య పఠనీయ గ్రంథం. ఒక నిషేధిత విప్లవపార్టీ ప్రచారం కోసం ఒక నిరుపేద స్త్రీ చేసిన ప్రయత్నమే కథా వస్తువు అయినప్పటికీ, అందులోని ప్రతి పాత్రా మనల్ని నిత్యం పలకరిస్తూనే ఉంటుంది. గోర్కీ కథలు, నాటకం 'లోయర్ డెప్త్స్' కూడా తప్పక చదవాల్సినవే.

ఇరవయ్యవ శతాబ్ది తొలి దశకంలో మరో గొప్ప నవల అమెరికన్ రచయిత జాక్ లండన్ 'ఐరన్ హీల్'. ఇప్పటికి దీనికి చాలా అనువాదాలు వచ్చాయి. 'ఉక్కుపాదం' పేరుతో తెలుగులో లభ్యం. (ఉడతాభక్తిగా నేను కూడా దీన్ని అనువాదం చేశాను.) పెట్టుబడిదారీ వ్యవస్థ ఎందుకు పతనం కాకతప్పదో, కార్మికవర్గ విప్లవ యుద్ధం ఎలా అనివార్యమో హేతుబద్ధంగా, గణాంకాలతో, వాదోపవాదాలతో నిరూపిస్తాడు రచయిత.

అనతోల్ ఫ్రాంస్ రాసిన 'పెంగ్విన్ ఐలండ్' మరో గొప్ప నవల. ప్రైవేట్ ఆస్తి ఆవిర్భావంతోనే సామాజిక వ్యవస్థ కుళ్లిపోయిందంటాడు పెంగ్విన్ పక్షులను పాత్రలుగా చేసి రాసిన ఈ సోషియో ఫాంటసీలో రచయిత.

ఇగ్నేషియోసైలోన్ ఇటాలియన్ రచయిత. ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నాడు. ముస్సోలినీ నాటి దమనకాండ నరమేధాన్ని చిత్రించిన నవల 'ఫాంటమారా'. ప్రతిఘటనను చిత్రించింది 'బ్రెడ్ అండ్ వైన్'. నిరక్షరాస్యులైన రైతులను హీరోలుగా చేసి రాసిన చిన్న నవల 'ఫాంటమారా' అయినా తప్పక చదవాలి.

ఇక, ఆధునిక లాటిన్ అమెరికన్ రచయిత ఎడువార్డో గెలీయనో అంటే నాకిష్టం. అక్కడి పోరాటాలలో ప్రత్యక్షంగా పాల్గొని, స్వానుభవాలే డాక్యుఫిక్షన్‌గా రాసిన 'డేస్ అండ్ నైట్స్ ఆఫ్ లవ్ అండ్ వార్' గొప్ప రచన. 'బుక్ ఆఫ్ ఇమేజస్', 'వాకింగ్ వర్డ్స్', అప్‌సైడ్ డౌన్' ముఖ్యంగా 'ఓపెన్ వెయిన్స్ ఆఫ్ లాటిన్ అమెరికా' చదివితే పెట్టుబడిదారీ వ్యవస్థ అమానుషత్వమూ, ప్రజాపోరాటాల అనివార్యతా తెలుస్తాయి.

కాని, ఇలా ఎన్ని చెప్పుకుంటాం? దోసిట్లో నీళ్లు పట్టుకుని ఇంతేనా అన్నట్టుగా ఉంటుంది. ఇంగ్లిష్‌లో 'లైఫ్‌టైమ్ రీడింగ్ ప్లాన్' లాంటి పుస్తకాల జాబితాలున్నాయి. తెలుగులో కూడా, అలాంటి ప్రయత్నమేదో చేస్తే తప్ప, ఏం చదవాలి? అన్న ప్రశ్నకు పరిష్కారం దొరకదు.

*(రచయిత కథకుడు, నవలాకారుడు, అనువాదకుడు)* వీ

*ఒక మంచి పుస్తకం చదవకముందు మనమేమిటి, చదివాక మనమేమిటి అనే తాత్విక ప్రశ్న వేస్తూ తనకు నచ్చిన, ప్రేరణ ఇచ్చిన పుస్తకాన్ని తప్పక చదవమంటున్నారు* **పలమనేరు బాలాజీ**

# మార్పుకు ప్రేరణ ఇచ్చే పుస్తకాలు

మనిషితో గంట మాట్లాడ్డం కన్నా రోజులో ఓ గంటయినా పుస్తకాలతో గడిపితే ఎంత బావుంటుంది అన్నాడొక మిత్రుడు. పుస్తకాలు చదివి చదివి మాత్రం మనిషి మారకపోతే లాభమేమిటి అన్నాడు మరొక మిత్రుడు.

నిజమే, పుస్తకాలు చదవడం ఎంత ముఖ్యమో, మనుషులతో కలవడం, కలిసి ఉండడం, చర్చించడం కూడా అంతే ముఖ్యం. పుస్తకాలు చదువుతున్నప్పుడు మనమేమిటి? చదవక ముందు, తర్వాత మన మేమిటి? అనేవి చాలా ముఖ్యమైన విషయాలుగా నేను భావిస్తున్నాను.

కొత్త ఆలోచనల్ని, సంస్కారాన్ని పెంపొందించని పుస్తకాలు ఎన్ని చదివినా వృథాయే. మనలో స్పందన కలిగించేవే మంచి పుస్తకాలు అనుకుంటే మో, స్మైల్ సంపాదకత్వంలో యగళ్ల రామకృష్ణ జీవన వజ్రోత్సవ అభినందన సంచికగా తెలుగు సారస్వత మూర్తుల స్వీయ, జీవిత చరిత్రలోంచి కొన్ని మహోజ్వల సాహిత్య జీవన సత్యశోధనాంశాల పేరిట వెలువడిన 'కొమ్మలు రెమ్మలు' ఒక అరుదైన పుస్తకం. మిత్రుడి షష్టిపూర్తి సంవత్సరం సందర్భంగా 27 డిసెంబర్ 2005న వెలువరించిన ఈ పుస్తకలో నూట తొంభై నాలుగు మంది మహానుభావుల గురించి మూడొందల నలభై ఆరు పేజీలలో ఉంది.

వెన్నెలకంటి సుబ్బారావు (1784-1839) ఆంగ్లంలో స్వీయ చరిత్ర రాసుకున్న ఆంధ్రులలో ప్రథముడే కాదు, ఇంగ్లీష్‌లో ఉన్న శాస్త్ర విజ్ఞానం దేశీయులకు అవసరమని రాజారామమోహనరాయ్ కంటే ముందే తెలిపిన గొప్ప వ్యక్తి. ఆయన ఆత్మకథలోని 'కాశీయాత్ర'తో మొదలై రజనీకాంతరావుకు సంబంధించిన ప్రస్తావనతో ఈ పుస్తకం ముగుస్తుంది.

ఎన్నెన్నో విలువైన అలనాటి పుస్తకాల్లోంచి ఏరికూర్చిన ప్రతి పేజీ పాఠకులకు జీవితం పట్ల కొత్త దృష్టిని కలిగిస్తుంది.

తెలుగు సాహిత్యకారుల గురించి కానీ, గొప్ప తెలుగు పుస్తకాల గురించి కానీ పరిజ్ఞానం లేని వాళ్లెవరైనా ఈ ఒక్క పుస్తకాన్ని చదవడం ద్వారా ఎన్నో వందల పుస్తకాల్లోని ప్రధానమైన విషయాలను, మూలాలను తెలుసుకున్న వారవుతారు.

ఈ పుస్తకం రూపకల్పనలో స్మైల్, మో గార్లు తీసుకున్న శ్రద్ధ, ఓర్పు, నేర్పు ప్రతి పేజీలో కనిపిస్తాయి. 111 మంది జీవిత చరిత్రల్లోని ఆత్మకథల్లోని స్వకీయాలు వారి అంతరాత్మల్ని, వ్యక్తిత్వాన్ని తెలియజేస్తాయి. 82 మంది మహానుభావుల గురించి రాసిన పేజీలన్నీ సూక్ష్మంగా ఆయా వ్యక్తులు కలిగించిన ప్రభావం గురించి, వారి కృషి గురించి తెలియచేస్తాయి.

జీవితం పట్ల ఎవరి దృక్పథం ఏమిటి? సామాజిక సంఘర్షణ పట్ల వారి స్పందనలేమిటి అన్న విషయాలు తెలిసిన తరువాత జీవితంలోని అల్పత్వం, కోల్పోయిన జీవితం, పొందాల్సిన అనిశ్చితులు, అర్థం చేసుకోవలసిన సామాజిక జీవితం నన్ను కలవరపరిచి ఆలోచింప చేశాయి. మానవ సంబంధాల క్షీణత, అభివృద్ధి పేరుతో అగ్రరాజ్యాలు సాగిస్తున్న వలసరాజ్యాల స్థాపన ఆందోళన కలిగించాయి. జీవితాన్ని చూసే దృష్టి సవ్యంగా ఉండాలి. పరిస్థితుల్ని అర్థం చేసుకునే శక్తి మెరుగుపడాలి.

గొప్ప గొప్ప వాళ్లందరూ జీవితంలో చవిచూసిన ఆనంద విషాదాలు, కాలం వారిలో కలిగించిన మార్పు, జీవితాన్ని ఒక్కొక్కరు వివిధ సందర్భాల్లో విభిన్నంగా దర్శించి విశ్లేషించిన తీరు విస్మయం కలిగించాయి.

జీవితం లోతు, విస్తృతి, సామాజిక సంబంధాలు, మానవ సంబంధాల నిర్వహణ, మనిషిని మంచివైపో, చెడువైపో ప్రేరేపించే సామాజిక, ఆర్థిక రాజకీయ భౌతిక, భౌగోళిక పరిస్థితులు, మనిషి మానవీయతను కాపాడుకోవాల్సిన చారిత్రక సందర్భం, అవసరాల గురించి ఈ పుస్తకం చాలానే చెప్పింది.

ఎవరో సన్నిహితుడు భుజం చుట్టూ చేయి వేసి మనతోబాటే నడుస్తున్నట్లుంది ఈ పుస్తక పఠనం. స్వాతంత్ర్యానికి పూర్వపు పరిస్థితులు చరిత్ర పుస్తకాలుగా నమోదు అయితే అయి ఉండవచ్చు. కానీ మానవీయ దృష్టికోణంలోంచి చరిత్రను చూసిన మానవుల చరిత్ర ఈ పుస్తకం.

మనం ఎక్కడి నుండి బయలుదేరామో, ప్రస్తుత స్థితికి ముందు సమాజం ఎలాంటి అనుభవాల్ని పొందిందో ఈ పుస్తకం చెపుతుంది.

మరోసారి మెల్లగా ఈ స్పందన రాస్తూ పుస్తకం పేజీల్ని తిప్పుతుంటే, రాయడం ఆగిపోతూ, పుస్తక పఠనంలో మునిగిపోతూ... తేరుకుని మళ్లీ స్పందనను కొనసాగిస్తున్నా.

బాల్యం, యవ్వనం అద్భుతంగా ఉన్నట్లు అనిపిస్తాయి. యవ్వన ఉద్రేకాలు ప్రలోభపెడుతాయి. వృద్ధాప్యం మనిషిని భయపెడుతుంది.

వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవడమే, నిలుపుకోవడమే జీవితం. వ్యక్తిత్వం అంటే ఏమిటో, దాన్నెట్లా నిర్మించుకోవాలో చాలా మంది ఈ పుస్తకంలో చెప్పకనే చెప్పారు.

బహుశా ఈ పుస్తకాన్ని నేను చదవకుండా ఉంటే ఎన్నో కొన్ని ప్రలోభాలకూ, బలహీనతలకూ లోబడి ఉండే వాడ్నేమో. ఈ పుస్తకం చదివిన పాఠకులందరూ ప్రేమనీ, ఆప్యాయతనూ, అనురాగాన్నీ, సహానుభూతినీ పెంపొందించుకోవాలనే 'మో' కోర్కెను తప్పకుండా నెరవేర్చిన పుస్తకం 'కొమ్మలు - రెమ్మలు'.

నన్ను మార్చిన ఈ పుస్తకాన్ని నాకు బహుకరించిన వల్లంపాటి వెంకటసుబ్బయ్య గారిని గుర్తు చేసుకుంటూ...

*(రచయిత కవి, కథా రచయిత)*

# తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాలు

**1.** కమ్యూనిస్టు పార్టీ మానిఫెస్టో – మార్క్స్-ఎంగెల్స్. 2. ఎనిహిలేషన్ ఆఫ్ కాస్ట్ – అంబేద్కర్. 3. మదర్ – మాక్సిం గోర్కీ. 4. స్పార్టకస్ – హోవార్డ్ ఫాస్ట్. 5. ది రెచెడ్ ఆఫ్ ది ఎర్త్ – ఫ్రాంజ్ ఫానన్. 6. పెడగాగీ ఆఫ్ ది అప్రెస్డ్ – ఫాలో ఫ్రయరీ. 7. జూలియస్ సీజర్ – విలియం షేక్స్పియర్. 8. పిగ్మాలియన్ – జార్జ్ బెర్నార్డ్ షా. 9. ఓల్డ్ మాన్ అండ్ ది సీ – ఎర్నెస్ట్ హెమింగ్వే. 10. హంచ్‌బాక్ ఆఫ్ నాటర్‌డామ్ – విక్టర్ హ్యూగో. 11. ది ఇంటర్‌ప్రెటేషన్ ఆఫ్ డ్రీమ్స్ – సిగ్మండ్ ఫ్రాయిడ్. 12. గబ్బిలం – జాషువా. 13. పాలేరు – బోయి భీమన్న.

**– బొజ్జాతారకం**

*సీనియర్ న్యాయవాది, దళిత ఉద్యమ నాయకులు*

**1.** కన్యాశుల్కం – గురజాడ అప్పారావు. 2. స్త్రీ, మ్యూజింగ్స్– చలం. 3. కృష్ణపక్షం – దేవులపల్లి కృష్ణశాస్త్రి. 4. అనుభవాలూ జ్ఞాపకాలూ – శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. 5. ఏకవీర – విశ్వనాథ సత్యనారాయణ. 6. మాలపల్లి – ఉన్నవ లక్ష్మీనారాయణ. 7. చివరకు మిగిలేది – బుచ్చిబాబు. 8. గోపీచంద్ కథలు. 9. మహాప్రస్థానం – శ్రీశ్రీ. 10. అమృతం కురిసిన రాత్రి – తిలక్. 11. అతడు – ఆమె – ఉప్పల లక్ష్మణరావు. 12. కీలుబొమ్మలు – జి.వి. కృష్ణారావు. 13. రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలు. 14. తన మార్గం – అబ్బూరి ఛాయాదేవి కథలు. 15. వాకాటి పాండురంగారావు కథలు. 16. మోదుగుపూలు – దాశరథి రంగాచార్య. 17. మట్టి మనిషి – వాసిరెడ్డి సీతాదేవి. 18. హిమజ్వాల – వడ్డెర చండీదాస్. 19. భాగవత కథలు – ముళ్లపూడి వెంకటరమణ. 20. రాజకీయ కథలు – ఓల్గా. 21. దర్గామిట్ట కథలు – ఖదీర్ బాబు. 22. ఇల్లలకగానే – పి. సత్యవతి. 23. నీలి మేఘాలు (కవితా సంకలనం). 24. సలీం కథలు. 25. అమ్మ (కవితా సంకలనం) రంజని ప్రచురణ. 26. హంపీ నుంచి హరప్పా దాకా – తిరుమల రామచంద్ర. 27. స్వీయ చరిత్రము – దువ్వూరి వెంకటరమణ శాస్త్రి.

సాహిత్య విమర్శ గ్రంథాలు : 1. ఆధునిక ఆంధ్ర కవిత్వం – సంప్రదాయాలు – ప్రయోగాలు – డా. సి. నారాయణరెడ్డి. 2. సారస్వత లోకం – రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ. 3. మన హాస్యం – ముని మాణిక్యం నర్సింహారావు. 4. సాహిత్య నేపథ్యం – ఆర్. ఎస్. సుదర్శనం.

**– సి. మృణాళిని**

*రచయిత, తెలుగు అధ్యాపకులు*

**1.** కుల నిర్మూలన – అంబేద్కర్: ఈ పుస్తకం భారతదేశంలోని ప్రధాన వైరుధ్యాన్ని బయటకు తెచ్చింది. దాని పరిష్కారాన్ని కూడా చెప్పింది. కమ్యూనిస్టులు ఈ పుస్తకం చదవడం వల్ల తమ మార్గంలో స్పష్టతను పొందుతారు.

2. మార్క్స్ – ఎంగెల్స్ స్మృతులు : ఈ పుస్తకం మేధావుల ఆలోచనా క్రమంలో తాత్విక అన్వేషణను తెలియజేస్తుంది. తత్వశాస్త్ర పునాదిలేని మనిషి ఆవేశంలో కొట్టుకుపోయే ప్రమాదాన్ని సూచిస్తుంది. జీవిత గమ్యాన్ని నిర్దేశిస్తుంది.

3. గులాంగిరి – మహాత్మా జ్యోతీ బా పూలె: ఈ పుస్తకం బ్రాహ్మణవాద ఆధిపత్యాన్ని తెలియజేస్తుంది. భారతదేశంలో ప్రధాన ఆధిపత్యం బ్రాహ్మణవాదానిదే అని నిరూపిస్తుంది.

4. రిడిల్స్ ఇన్ హిందూయిజం (హిందూ వాదంలో చిక్కుముడులు) – అంబేద్కర్: హిందూ జీవన విధానంలో మతాధిపత్యం, మూఢనమ్మకాలు, విజ్ఞాన శూన్యత ఉన్నాయి. హిందూ జీవన విధానాన్ని నిరాకరించకుండా ఎవరూ తత్వవేత్త కాలేరు. ఈ పుస్తకం అందరూ చదవాల్సినది.

5. హిందూ ఇంపీరియలిజం – స్వామీ ధర్మతీర్థ: హిందూ మతమే ఒక సామ్రాజ్యవాదం. ప్రపంచ సామ్రాజ్యవాదం అర్థం కావాలంటే, హిందూ సామ్రాజ్యవాదం అర్థం కావాలి. భారతదేశంలో అత్యధిక కాపీలు అమ్ముడుపోయిన పుస్తకం ఇది.

6. ది ఎసెన్స్ ఆఫ్ బుద్ధిజం – ప్రొ. లక్ష్మీనర్సు: కరుణ, ప్రజ్ఞ, జ్ఞానం మానవుని విజయానికి ఆయుధాలు. భౌతిక ఆయుధం ధరించేవాడు పిరికివాడు. తనను తాను జయించాలంటే, తాత్విక విప్లవ బాటలో నడవాలి. అప్పుడే సమాజానికి బోధ చేయగలుగుతారు. బోధ హింసాత్మకమైతే, అది ఎక్కువ దూరం ప్రయాణించదని ఈ గ్రంథం తెలియచెపుతుంది. యూరపియన్ దేశాలలో ఈ పుస్తకాన్ని ఎక్కువగా చదివారు. దీన్ని ఒక తెలుగువాడు రాయడం మనకు గర్వకారణం.

7. బుద్ధుడు – అతని ధర్మం – బి.ఆర్. అంబేద్కర్: లక్ష పేజీల సారం ఐదు వందల పేజీలలో అంబేద్కర్ రచించాడు. బౌద్ధంలో ఉన్న హిందూయిజాన్ని నిరాకరించి, సాంస్కృతిక, తాత్విక బౌద్ధాన్ని నిర్దేశించాడు. ఈ పుస్తకం అందరూ చదవదగినది.

**– కత్తి పద్మారావు**

*కవి, అధ్యాపకులు, దళిత ఉద్యమ నాయకులు*

**1.** మహాప్రస్థానం, మరోప్రస్థానం – శ్రీశ్రీ. 2. భవిష్యత్ చిత్రపటం – వరవరరావు. 3. యజ్ఞం – కాళీపట్నం రామారావు.

*పుస్తకంబులు గలిగిన పూరిగుడిసె*
*యందు నిరుపేత కాపునై యుండుగాని*
*పుస్తకంబులు లేనట్టి భూరిసౌధ*
*మందు చక్రవర్తిగ నుండ నభిలషింప*

*గ్రంథ నిలయంబు గల నరకంబునందు*
*నైన నివశింపc గాంక్షింతుc గాని నేను*
*గ్రంథ నిలయంబు లేని స్వర్గంబు నందు*
*నిముసమైనను నివసింప నిచ్చగింప*

**– సురవరం ప్రతాపరెడ్డి**

4. గోవులొస్తున్నాయి జాగ్రత్త – రావిశాస్త్రి. 5. గో పాత్రుడు – పతంజలి. 6. అంతరాని వసంతం – జి. కళ్యాణరావు. 7. అతడు – అల్లం రాజయ్య. 8. పనిపిల్ల – తుమ్మేటి రఘోత్తమ రెడ్డి. 9. నిప్పులవాగు – పాణి. 10. అప్‌సైడ్ డౌన్ – ఎడువార్డో గెలియనో. 11. షాక్ థెరపీ – నౌమీ క్లీన్. చైనీస్ నవలలు – 13. ఎర్రమందారాలు. 14. విముక్తి. 15. ప్రపంచాన్ని కుదిపేసిన పది రోజులు – జాన్ రీడ్.

**– అరుణ్**

*రిటైర్డ్ ఇంగ్లిష్ లెక్చరర్*

నాకు ఆయా కాలాలలో నచ్చిన, చదవవలసినవని అనిపించిన పుస్తకాలు:

1964–70: 1. అక్షరాల గవాక్షాలు – సి. నారాయణరెడ్డి. 2. తిమిరంతో సమరం, గాలిబ్ గీతాలు, కవిత్వం – దాశరథి. 3. నవోదయం – అందె వెంకటరాజం. 4. బాలమిత్ర. 5. చందమామ. 6. కొవ్వలి. 7. కొమ్మూరి సాంబశివరావు. 8. టెంపో రావు. 9. దుత్తా బాపినీడు. 10. రవీంద్రనాథ్ టాగూర్. 11. శరత్‌బాబు రచనలు. 12. చెలియలి కట్ట, బద్దన్న సేనాని – విశ్వనాథ నవలలు; 13. దైవమిచ్చిన భార్య – చలం. 14. గోపీచంద్ కథలు. 15. ప్రేమ్‌చంద్ కథలు. 16. కోడూరి కౌసల్యాదేవి.

1970 – 80: 1. బంచ్ ఆఫ్ థాట్స్ – గోల్వాల్కర్. 2. కుల నిర్మూలన – అంబేద్కర్. 3. అంబేద్కర్ జీవిత చరిత్ర – ఎండ్లూరి చిన్నయ్య. 4. అమ్మ – మాక్సిం గోర్కీ. 5. రష్యన్ సాహిత్యం. 6. కొడవటిగంటి కుటుంబరావు కథలు, నవలలు. 7. రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలు. 8. జ్యోతి, జయశ్రీ, యువ, తరుణ మాసపత్రికలు. 9. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ వార పత్రికలు. 10. కాళీపట్నం రామారావు కథలు. 11. అల్లం రాజయ్య కథలు. 12. సృజన, అరుణతార మాసపత్రికలు. 13. జననాట్య మండలి పాటలు.

1980–90: 1. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల సైద్ధాంతిక గ్రంథాలు, రష్యన్ పబ్లికేషన్స్, స్త్రీ వాద రచనలు. 2) విప్లవ సిద్ధాంత సాహిత్యం.

1990–95: 1. మహాత్మా జ్యోతీ బా పూలె రచనలు. 2. రామ్ మనోహర్ లోహియా రచనలు. 3. కాన్షీరామ్ రచనలు. 4. తెలంగాణ సాహిత్యం. 5. బి.సి., ఎస్.సి., ఎస్.టి.ల సిద్ధాంత సాహిత్యం, పాటలు.

1995–2010: తెలుగులో వచ్చిన కథలు, నవలలు, సిద్ధాంత వ్యాసాలు, దొరికిన పుస్తకాలన్నీ.

తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకాలు : 1. కుల నిర్మూలన. 2. కమ్యూనిస్టు మానిఫెస్టో. 3. కార్యకర్త – దత్తోపంత్ ఠేంగ్డే. 4. ది సెకండ్ సెక్స్ – సైమన్ డిబవర్. 5. ఈస్తటిక్స్ – వి. బోరెవ్. 6. కావ్యాలంకార సంగ్రహం – సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి. 7. మాలపల్లి – ఉన్నవ లక్ష్మీనారాయణ. 8. అన్నా కెరేనీనా – టాల్‌స్టాయ్. 8. భారతదేశంలో కులాల సమస్య – రామ్ మనోహర్ లోహియా. 10. గులాంగిరి – జ్యోతీ బా పూలే. 11. డయలెక్టిక్స్ ఆఫ్ నేచర్ – ఎంగెల్స్. 12. భూమి – ఎమిలీ జోలా. 13. రంగభూమి – ప్రేమ్‌చంద్.

*వాయువెట్టులు స్వేచ్ఛమై ప్రజలకు దొరుకునట్లె*
*జ్ఞానముంగూడను నబ్బవలయు*
*ఉదకమెల్లరకేరీతి నొదవునట్లె*
*జ్ఞానముంగూడ సేవ్యంబు గాగవలయు*
*సూర్యచంద్రుల తేజంబు చూరలాడ*
*నెల్లవారికి లభ్యమై యెసగునట్లె*
*జ్ఞానముం గూడ సులభంబు గాగవలయు*

**– సురవరం ప్రతాపరెడ్డి**

తప్పకుండా చదవాల్సిన నా రచనలు: 1. నేను ఎవరు – గతితర్క తత్వ దర్శన భూమిక. 2. జీవితం అంటే ఏమిటి? 3. ప్రేమంటే ఏమిటి? 4. బహుజన తత్వం. 5. సామాజిక న్యాయం అంటే ఏమిటి?

నేను మార్క్స్ కన్నా ఎంగెల్స్‌ను ఎక్కువ అభిమానిస్తాను.

**– బి.ఎస్. రాములు**

*రచయిత*

**పు**స్తకాలు, పుస్తకాలు, పుస్తకాలు! పుస్తకాల కన్న ఎక్కువ సంతోషాన్నిచ్చే మరొక వస్తువేదీ లేదు. రాజకీయంగా విభజింపబడి ఉన్న మన ప్రపంచంలో కొన్ని పుస్తకాలు చదవడం రాజకీయంగా సరైంది కాదనిపిస్తుంది. నేను మార్క్సిస్ట్ – లెనినిస్ట్ బృందంలో పనిచేస్తున్న రోజులలో సహచరుల అసమ్మతికి భయపడి మార్క్స్, ఎంగెల్స్‌ల పేర్లు ఉన్న అట్ట వేసుకుని 'బూర్జువా' సాహిత్యం చదివేదాన్ని. ఇప్పుడు కాస్త వయస్సు వచ్చి, నాకిష్టమైన పుస్తకాలేవో నేను స్వేచ్ఛగా చర్చించగలను. గొప్ప సాహిత్యమంటే, గొప్ప చూపునూ, ఆలోచనా శక్తినీ ఇచ్చేదే. లేదా, గొప్ప ఆనందాన్ని ఇచ్చేదే. లేదా, నిత్య జీవితాచరణలో ఎక్కువగా ఉపయోగపడేదే. ఈ మూడు ప్రయోజనాలలో ఒకదానితో మరొకదానికి పోటీ ఉండవలసిన అవసరం లేదు. మంచి పుస్తకాలు ఏమిటో తేల్చి చెప్పడానికి సులభమైన మార్గం ఏమంటే వాటిని మనం మళ్లీ మళ్లీ చదవగలుగుతామా లేదా అనేదే. అయితే ఇవాళ్టి పరిస్థితులలో వ్యాపార ప్రకటనల ఆకర్షణీయత పుస్తక పఠనాన్ని సంక్లిష్టం చేస్తుంది. కొన్ని పుస్తకాలకు ఎంత మితిమీరిన ప్రచారం దొరుకుతుందంటే, ఆ ప్రచారం వల్లనే అవి చదవకూడదని అనిపిస్తుంది. అట్లా ప్రచారం పొందిన పుస్తకాలలో ఒకటి అరుంధతీ రాయ్ రాసిన 'గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్'. ఆ పుస్తకం చదవాలనే కోరికను నేను చాలా రోజులు అణచుకున్నాను. చదవడానికి మరేమీ లేక చిట్టచివరికి ఆ పుస్తకం తెరిచినప్పుడు ఇంతకాలమూ ఇది ఎందుకు చదవలేకపోయానా అని, ప్రచార ఆకర్షణను అడ్డుకున్నందుకు నొచ్చుకున్నాను.

నా పుస్తకాల జాబితా ఎక్కువగా ఇంగ్లిష్‌లోనే ఉంటుంది. నాకు ఎక్కువ పరిచయం ఉన్న భాష అదే. నా కాల్పనిక రచనల జాబితా: 1. 'టు కిల్ ఏ మాకింగ్ బర్డ్' (హార్పర్ లీ). 2. 'గాన్ విత్ ది విండ్' (మార్గరెట్ మిచెల్). 3. 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్' (జేన్ ఆస్టిన్). 4. 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' (సోమర్‌సెట్ మామ్). 5. 'అరణ్యక్ – వనవాసి' (బిభూతి భూషణ్ భట్టాచార్య). 6. 'ది స్పై హూ కేమ్ ఫ్రమ్ ది కోల్డ్' (జాన్ లె కార్). 7. 'బిలవెడ్' (టోనీ మారిసన్). 8. 'వాటర్‌షిప్ డౌన్'

(రిచర్డ్ ఆడమ్స్) (దీన్ని చాలా తరచుగా పిల్లల సాహిత్యంలో చేరుస్తారు!). 9. 'ది పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే' (ఆస్కార్ వైల్డ్). 10. 'రామాయణ' (రాజగోపాలాచారి). 11. 'గ్రేప్స్ ఆఫ్ రాత్' (జాన్ స్టీన్‌బెక్). 12. 'ది కన్ఫెషన్స్ ఆఫ్ నాట్ టర్నర్' (విలియం స్టైరన్). 13. 'హకల్ బెరీ ఫిన్' (మార్క్‌ట్వెయిన్). 14. 'ది కైరో ట్రయాలజీ' (మహఫూజ్).

ఇక కాల్పనికేతర రచనల జాబితా: 1. 'వేర్ దేర్ ఈజ్ నో డాక్టర్' (డేవిడ్ వర్నర్). 2. 'సెకండ్ సెక్స్' (సైమన్ డి బవర్). 3. 'అవర్ బాడీస్ అవర్‌సెల్వ్స్' (బోస్టన్ ఉమెన్స్ హెల్త్ బుక్ కలెక్టివ్). 4. 'డార్క్‌నెస్ విజిబుల్' (విలియం స్టైరన్). 5. 'జెమిసన్' (జేమ్స్ బాల్డ్‌విన్). 6. 'ది ఆటోబయగ్రఫీ ఆఫ్ మాల్కం ఎక్స్' (అలెక్స్ హేలీ). 7. 'డిబ్స్' (వర్జీనియా ఆక్స్‌లైన్). 8. 'ది కమ్యూనిస్టు మానిఫెస్టో' (మార్క్స్ - ఎంగెల్స్). 9. 'ఆన్ ప్రాక్టీస్ ఆండ్ ఆన్ కాంట్రడిక్షన్' (మావో సె టుంగ్). 10. 'వాట్ ఈజ్ హిస్టరీ' (ఇ. ఎచ్. కార్). 11. 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' (జవహర్‌లాల్ నెహ్రూ). 12. 'హింద్ స్వరాజ్' (ఎం.కె. గాంధీ). 13. 'ది ఆరిజిన్ ఆఫ్ కాస్ట్' (బి.ఆర్. అంబేద్కర్). 14. 'ది బ్లూ నైల్' (అలాన్ మూర్ వైట్‌హెడ్). 15. 'ఐ ఫూలన్ దేవి' (ఫూలన్ దేవి తదితరులు). 16. 'రెచెడ్ ఆఫ్ ది ఎర్త్' (ఫ్రాంజ్ ఫానన్). 17. 'ఆన్ అన్‌క్వైట్ మైండ్' (కె. జెమిసన్). 18. 'నో నేమ్ ఇన్ ది స్ట్రీట్' (జేమ్స్ బాల్డ్‌విన్). 19. 'ది ప్రాఫెట్' (ఖలీల్ జిబ్రాన్).

తక్కువ సమయంలో రాశాను గనుక తప్పనిసరిగా చాలా పేర్లు మరిచిపోయి ఉంటాను.

**– గీతారామస్వామి**

*హైదరాబాద్ బుక్ ట్రస్ట్ నిర్వాహకులు*

**1.** రెండు మహానగరాలు - చార్లెస్ డికెన్స్ (తెన్నేటి సూరి అనువాదం). 2. యమకూపం - కుప్రిన్. 3.1) రైజ్ అండ్ ఫాల్ ఆఫ్ థర్డ్ రీష్ - విలియమ్ షైరర్. 4. శాకుంతలం- రొమిల్లా థాపర్. 5. కన్యాశుల్కం- గురజాడ అప్పారావు. 6. అప్‌సైడ్ డౌన్ - ఎడువార్డో గలియనో. 7. నిజాం - బ్రిటిష్ సంబంధాలు - సరోజినీ రేగాని. 8. కాశ్మీర రాజతరంగిణి కథలు. 9. తూర్పు యూరపు పరిణామాలు. 10. చిలకమర్తి స్వీయచరిత్ర. 11. వీరేశలింగం స్వీయచరిత్ర. 12. మాలపల్లి - ఉన్నవ లక్ష్మీనారాయణ. 13. విజార్డ్ ఆఫ్ ది క్రో - గూగీ వా థియాంగో. 14. కొడవటిగంటి కథలు. 15. లివింగ్ టు టెల్ ఎ టేల్ - మార్క్వెజ్. 16. అనుభవాలూ జ్ఞాపకాలూ - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. 17. కుటుంబం-స్వంత ఆస్తి - రాజ్యాంగాల పుట్టుక -ఎంగెల్స్. 18. మిత్రలాభం - మిత్రభేదం - చిన్నయసూరి. 19. అన్నా కరేనినా - తోల్‌స్తోయ్. 20. ఆన్ ఎడ్యుకేషన్ - బెర్ట్రాండ్ రస్సెల్. 21. కాళీపట్నం రామారావు కథలు.

వీటిలో 5,7,10,11,12,14,16,18,21 పుస్తకాలు తెలుగు సమాజ పరిణామాన్ని చెబుతాయని నా అభిప్రాయం. మిగతావి భూస్వామ్యం పెట్టుబడిదారీ సమాజానికి ఎట్లా మారిందీ, సామ్రాజ్యవాదంగా ఎలా మారిందీ, అది ఎన్ని దుర్మార్గాలు చేసిందీ చెబుతాయి.

**– ప్రశాంత్**

*పాత్రికేయులు*

**1.** 'కండిషన్ ఆఫ్ వర్కింగ్ క్లాస్ ఇన్ ఇంగ్లాండ్'. 2. 'కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక' - ఫ్రెడరిక్ ఎంగెల్స్. 3. 'అమ్మ' - మాక్సిం గోర్కీ. ఈ మూడు పుస్తకాలు నన్ను కమ్యూనిస్టు రాజకీయాల వైపుకి తీసుకువచ్చాయి. గోర్కీ - 'అమ్మ' వ్యవస్థకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసి, మార్చాలనుకొనే ప్రతి ఒక్కరూ చదవాల్సిన నవల. హృదయాలను కుదిపేసే నవల. భారతదేశంలోని పౌరహక్కుల ఉద్యమాన్ని అర్థం చేసుకోవడానికి తోడ్పడే అమూల్యమైన అనుభవాల సారంగా చెప్పుకోవాలంటే అరుంధతీ రాయ్ 'ది ఇన్‌ఫినిట్ జస్టిస్', బీభత్స కాలంలో దేశభక్తిని పురికొల్పే 'ఫ్రేమింగ్ జిలానీ', కన్నబిరాన్ ఆత్మకథాత్మక సామాజిక చిత్రం '24 గంటలు' ఉపయోగపడతాయి. ఇవి హక్కుల ఉద్యమాలలో పనిచేస్తున్న ప్రతి ఒక్కరూ చదవాల్సిన పుస్తకాలు.

**– ఎస్. శేషయ్య**

*న్యాయ శాస్త్ర అధ్యాపకులు, పౌర ఉద్యమ నాయకులు*

**నే**ను మార్పును గురించి చెప్పే కథలను చదువుతుంటాను. నాకిష్టమైన వాటిలో కొన్ని...

1. రాగో (నవల) : ఆదివాసి సమాజం, అక్కడి సమస్యలు, మార్పు అవసరం గురించి చెబుతుంది. ముఖ్యంగా స్త్రీల గురించి చెబుతుంది. ఆదివాసీ సమాజంలో స్త్రీలకు, స్త్రీల పనికి ప్రాముఖ్యత ఉంటుంది. ఆ నీతి నియమాల నుంచి బయటికి రావడానికి, మార్చడానికి చేసిన ప్రయత్నం ఆ పాత్ర ద్వారా మనకు తెలుస్తుంది.

2. యజ్ఞం ఇతర కథలు : భూమి కేంద్రంగా ఉండే కథలు. ఆర్తి కథలో స్త్రీల సమస్య గురించి ఎక్కువగా ఉంది.

3. జానకి విముక్తి : ఉద్యమం గురించి చెప్పే నవల. స్త్రీల విముక్తి గురించి చెబుతారు. నేర్చుకోదగ్గది చాలా ఉంటుంది.

4. స్వేచ్ఛ : ఓల్గా రాసిన ఈ నవల స్త్రీల సమస్యలకు సంబంధించి చెబుతుంది.

ఏ సాహిత్యమయినా మిగులు మనుషుల గురించి, స్త్రీల గురించి చెప్పకపోతే జీవితం అసంపూర్తిగా ఉండిపోతుంది.

**– ముదునూరి భారతి**

*రచయిత*

1. కమ్యూనిస్ట్ మానిఫెస్టో తప్పనిసరిగా చదవాలి. 2. ఆంటీ డూరింగ్ - ఎంగెల్స్: మార్క్సిజం దేని కోసమో చెబుతూ ఆర్థిక, రాజకీయ శాస్త్రాలపై అవగాహన పెంచుతుంది. 3. రాజ్యం - విప్లవం - లెనిన్: రాజ్య స్వభావం గురించి చెబుతుంది. కమ్యూనిస్టులు రాజ్యాన్ని ఎందుకు మార్చాలో చెబుతుంది. రాజ్యం ఒక వర్గ అధికారాన్ని, ఆ వర్గ ప్రయోజనాలను ఎలా రక్షిస్తుందో చెబుతుంది. కార్మికుల చేతిలో ఈ పుస్తకం ఒక ఆయుధం. 4. వైరుధ్యాలు - మావో సె టుంగ్: సమాజంలోని వైరుధ్యాలు ఎలా అర్థం చేసుకోవాలో, వాటిని ఎలా పరిష్కరించాలో చెబుతుంది. 5. నావెల్ అండ్ పీపుల్ - రాల్ఫ్ ఫాక్స్: నవలలు ఎలా ఉండాలో, అందులోని పాత్రలు ఎలా ఉండాలో చెబుతుంది. పురాణాల నుంచి ఆధునిక నవల దాకా పరిణామాన్ని

చెబుతుంది. రచయిత స్పానిష్ సివిల్ వార్‌లో చనిపోయారు. 6. ఇల్యూజన్ అండ్ రియాలిటీ – క్రిస్టఫర్ కాడ్వెల్. 7. అమ్మ – మాక్సిం గోర్కీ; 8. ఉక్కుపాదం – జాక్ లండన్; 9. జెర్మినల్ – ఎమిలీజోలా: బొగ్గు గని కార్మికుల జీవితాల గురించి అద్భుతంగా చెబుతుంది ఈ పుస్తకం. 10. ఓల్గా నుంచి గంగ – రాహుల్ సాంకృత్యాయన్: వివిధ తరాలలో జరిగిన సామాజిక మార్పుల గురించి కథలు కథలుగా సాంకృత్యాయన్ చెబుతారు. 11. దావానలం, ఓనమాలు – మహీధర రామ్మోహనరావు: తెలంగాణ సాయుధ పోరాటం గురించి రచయిత ఈ పుస్తకంలో చెబుతారు. 12. రథచక్రాలు – మహీధర రామ్మోహనరావు: స్వాతంత్ర్య సంగ్రామం గురించి చెబుతుంది. 13. నేనూ నా దేశం – దర్శి చెంచయ్య: ఆయన గదర్ పార్టీలో పని చేశారు. తర్వాత కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఆయన అనుభవాలు తప్పక చదవాలి. 14. భగత్‌సింగ్ రాజకీయ రచనలు తప్పక చదవాలి.

**– పి. నాగభూషణం**

రచయిత

సలాం హైదరాబాద్ : ఈ పుస్తకం వచ్చి నాలుగేళ్లు అవుతోంది. ఈ పుస్తకం బలం హైదరాబాద్ చరిత్రను ప్రతిబింబించడమే. సాంఘిక జీవితాన్ని, ప్రాచీన చరిత్ర నుండి వర్తమానం వరకు హైదరాబాద్ చరిత్రను మన కళ్లముందు ఉంచుతుంది. మొదటి తెలంగాణ ఉద్యమం (1969)కు నేపథ్యం ఇందులో ఉంది. మనుషుల జీవితం సంస్కృతి ఇందులో ఉన్నాయి. ప్రతి ఒక్కరూ చదవాల్సిన పుస్తకం. హైదరాబాద్ 'అభివృద్ధి'లో ఈ సంస్కృతిపైనే దాడి జరిగింది. యూరప్‌లో ప్రతినగరానికి ఒక చరిత్ర ఉంది. కానీ, మనకు చారిత్రక ప్రత్యేకతలను తుడిచిపెట్టేశారు. ఆధునికత పేరిట ధనార్జన, డబ్బు కేంద్రం అయిపోయింది. సంస్కృతి లేకుండా అయిపోయింది. చరిత్ర పట్ల మనకు ఉండే అజ్ఞానం దీనికి కారణం. పాతది కూలగొట్టడం, కొత్త భవంతులు, పెద్ద రోడ్లు, కార్లు ఈ అభివృద్ధి నమూనాలో ఉన్నాయి. ఇప్పుడు గతించిన సంస్కృతి మనిషి జ్ఞాపకాల్లో ఉంది. ఆ సంస్కృతిని భౌతికంగా లేకుండా చేసినా జ్ఞాపకాలలో పదిలంగానే ఉంది. ఇప్పుడు ఉద్యమాలలో అదే వ్యక్తం అవుతోంది. ప్రాంతం ఏదయినా కావచ్చు సంస్కృతిని తుడిచిపెట్టేదిగా జరిగే అభివృద్ధి భావపరమైన వెలితిని తీసుకువస్తుంది. మనిషి భావాలకు తావులేని అభివృద్ధి నిర్జీవమైనది. ఈ విషయాల్నీ ఈ పుస్తకంలో బాగా చెప్పారు.

రీథింకింగ్ కాపిటలిస్ట్ డెవలప్‌మెంట్ – ప్రిమిటివ్ ఎక్యుములేషన్, గవర్నమెంటాలిటీ అండ్ పోస్ట్ కలోనియల్ కాపిటలిజం – కల్యాణ్ సన్యాల్ : భారతదేశం లాంటి పేద దేశాల్లో యూరపియన్ దేశాల్లోలాగా పెట్టుబడిదారీ విధానం వచ్చే ఆస్కారం లేదని చాలామంది మార్క్సిస్టులు అనుకున్నారు. కానీ, సరళీకరణ తరువాత వచ్చిన పెను మార్పులలో జరిగిన పెట్టుబడిదారీ అభివృద్ధి పెట్టుబడిదారీ విధానం కాదనే వాళ్లు బహుశా ఇక లేరేమో. కానీ, ఈ పెట్టుబడిదారీ విధానం యూరప్‌లోలాగా సమాజంలో భూస్వామ్య పద్ధతుల్ని గానీ, గిరిజన పద్ధతుల్ని గానీ లేదా ఇతర పద్ధతుల్ని గానీ పూర్తిగా మార్చేసే విధానంగా మాత్రం లేదని అర్థమవుతుంది. ఇక్కడ రాజ్యం పెద్ద ఎత్తున పెట్టుబడిదారీ

*మది కుదరజేసి చల్లనిమాట జెప్పి*
*కలక నెడలించి ధైర్యంబు గలుగజేసి*
*తల్లిదండ్రుల బోలి పెద్దలనుబోలి*
*సదుపదేశంబుజేయు బుస్తకమె నీకు*

*మించు విజ్ఞాన జలధిదేలించునావ*
*మంచి చెడ్డల గతులేర్పరించుత్రోవ*
*మానసిక రోగములనెల్ల మాన్పుమందు*
*పొగడదగువిందు నీ కెందు బుస్తకంబె*

**– సురవరం ప్రతాపరెడ్డి**

విధానానికి ఇతర వర్గాల ఉత్పత్తి జీవితానికి ఒక రాజకీయ సమతుల్యత ఉండేలా చూస్తూ, విచ్ఛిన్నం కాకుండా కాపాడుతుంది. ఇది పెట్టుబడిదారీ విధానాన్ని ప్రోత్సహిస్తూ, దాని విధ్వంసం ద్వారా వచ్చే పరిణామాన్ని సర్దుబాటు చేస్తూ నడుపుతుంది. అంటే, ఇంకా రాజ్యం అభివృద్ధిని ముందుకు తీసుకువెళ్తూ, కాపిటలిస్ట్ అభివృద్ధిని ప్రోత్సహిస్తూ, వాటి మధ్య ఉన్న వైరుధ్యాన్ని మేనేజ్ చేస్తూ ఉన్న విషయాన్ని ఈ పుస్తకం చెబుతుంది. ఈ పుస్తకం మనకున్న మూస అభిప్రాయాలను బద్దలుకొడుతుంది. ఈ పుస్తకం చదివి తెలుగునాట ఒక చర్చ ప్రారంభిస్తే అది ఉద్యమకారులకు, విద్యావేత్తలకు అందరికీ చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

**– ఆర్.వి. రమణమూర్తి**

అర్థశాస్త్ర అధ్యాపకులు

1. తాపీ ధర్మారావు – మొదట గ్రాంథిక వాది. గిడుగు రామ్మూర్తి ప్రభావంతో వాడుక భాషను మధించారు. భాషా వికాసానికి ఉపయోగపడే 'కొత్తపాళీ' రాశారు. అది తప్పక చదవాలి. 2. మాక్సిం గోర్కి – అమ్మ : విప్లవోద్యమానికి ఒక సామాన్య స్త్రీ (అమ్మ) ఏ విధంగా తోడ్పడిందో చెప్పిన రష్యన్ నవల. 3. రెండు మహానగరాలు : ఫ్రెంచ్ విప్లవం నాటి పరిస్థితుల్ని చక్కగా చిత్రించిన నవల. 4. టాల్‌స్టాయ్ నవలలు : అన్నా కెరెనీనా, యుద్ధం–శాంతి. 5. ప్రేమ్‌చంద్ కథలు: గ్రామీణ జీవితంలో కష్టజీవుల మానసిక ప్రతిఫలనాలు. 6. మాలపల్లి – ఉన్నవ లక్ష్మీనారాయణ : పల్లెటూరికి, మాలపల్లికి ఉన్న సంబంధ బాంధవ్యాలు, అహింసావాదానికి, హింసా వాదానికి, తీవ్రవాదానికి మధ్య ఘర్షణ ఎంతో ప్రజాస్వామికంగా చిత్రించారు. 7. చెహోవ్ కథలు : జీవిత చిత్రణ, సామాజిక పరిస్థితులకు అద్దం పట్టిన కథలు. 8. చింతా దీక్షితులు: దాసరి పాటలాంటి జానపద కథలు.

కారా మాటల్లో 'జీవితాన్ని ఎరుక కలిగించే సాహిత్యం చదవడం ముఖ్యం.'

**– కృష్ణాబాయి, చలసాని ప్రసాద్**

రచయితలు

**నా** పుస్తక పఠనం బడిలో చదువుకునే రోజులలో ఆనాటి నవలలతో మొదలయ్యింది. కోడూరి, యద్దనపూడి నుంచి చలం వరకు చదివిన రోజులవి. అప్పుడు చదివిన పుస్తకాలలో మాదిరెడ్డి సులోచన

రాసిన 'మనిషి – మతం' , 'సంసార నౌక' బాగా గుర్తుండిపోయాయి. కొమ్మూరి వేణుగోపాలరావు రాసిన నవలలు మూడు – 'ఈ దేశంలో భాగమిది', 'ఒకే రక్తం ఒకే మనుషులు', 'సూర్యుడు దిగిపోయాడు'లను ఒకరకంగా ట్రయాలజిగా పేర్కొనవచ్చు. ఉమ్మడి కుటుంబాలు అనివార్యంగా ఎందుకు విచ్ఛిన్నం అవుతాయో, ఎందుకు కావాలో మొదటిది వివరిస్తుంది. మేనరికాలు ఎందుకు కూడదో రెండవ పుస్తకం తెలియజేస్తుంది. రెండు పాత్రలను తీసుకుని వాళ్లు తమ జీవితాలని మలుచుకున్న నేపథ్యంలో పిల్లల పెంపకం గురించి మూడవ పుస్తకం చెబుతుంది. ఇటువంటి పుస్తకాలన్ని ఆనాటి మధ్యతరగతి జీవితాలను, వాటిల్లో వస్తున్న మార్పులను బాగా చిత్రీకరించాయి. రంగనాయకమ్మ 'రామాయణ విషవృక్షం' మా అమ్మమ్మతోపాటు చదువుతూ పొట్టచెక్కలయ్యేలా నవ్వింది ఎలా మరిచిపోతానూ? ఇవన్నీ ఏదో ఒకరకంగా నా జీవిత దృక్పథాన్నీ, గమనాన్నీ ప్రభావితం చేశాయి.

నేను ఇంటర్మీడియెట్ చదివే రోజులలో లియో హ్యూబర్‌మాన్ రాసిన 'మాన్స్ వరల్డ్‌లీ గూడ్స్' పుస్తకం చదివాను. పెట్టుబడిదారీ వ్యవస్థ పనిచేసే విధానాన్ని, సామ్యవాద సిద్ధాంతాన్ని ఎంతో బాగా, చాలా తేలికగా వివరించే పుస్తకం అది. అయితే, నా అధ్యయనం అంతకంటే లోతులకి వెళ్లలేదు. నమ్మకమూ అంతకంటే దగ్గరకి వెళ్లలేదు, దూరమూ కాబోదు.

వ్యవసాయంలో పి.జి. పట్టా పొందినా కూడా తెలియని విషయాలు సూసన్ జార్జి రాసిన 'హౌ ది అదర్ హాఫ్ డైస్' ఫ్రాన్సిస్ మూర్‌లాప్స్, జోసెఫ్ కాలిన్స్‌లు రాసిన 'ఫుడ్ ఫస్ట్' పుస్తకాలు చదివితే తెలిశాయి. వరిలో తెగులు వల్ల బెంగాల్ కరువు, బంగాళాదుంపలో తెగులు వల్ల ఐరిష్ కరువు వచ్చాయని మాకు విశ్వవిద్యాలయంలో చెప్పారు. పై పుస్తకాలు చదివిన తరువాత వ్యవసాయమూ, ఆకలీ వెనక రాజకీయాలు, పెట్టుబడిదారీ వ్యవస్థ పని చేసే విధానాలు అర్థం అయ్యాయి. ఆకలి నిర్మూలనకు ఉత్పత్తి పెంచడం కాదని, సామాజిక సమానత, రాజకీయ నిబద్ధత అవసరమని తెలిసింది. ఆ తరువాత ఎంతో కాలానికి చదివిన భబాని భట్టాచార్య నవల 'సోమెనీ హంగర్స్' బెంగాల్ కరువుకి సంబంధించిన సామాజిక కోణాన్ని తేటతెల్లం చేసింది. వరిలో తెగులు వల్ల దిగుబడులు తగ్గి బెంగాల్ కరువు రాలేదని, రెండవ ప్రపంచ యుద్ధ నేపథ్యంలో నల్లబజారు, ఇతర సామాజిక కారణాల వల్ల ఆకలి చావులు సంభవించాయని అర్థం అయ్యింది.

బోరిస్ వాస్సిలెవ్ రాసిన 'డోంట్ షూట్ ది వైట్ స్వాన్' అన్న నవల పర్యావరణవాదులు, మానవతావాదులు తప్పనిసరిగా చదవ వలసిన నవల. దీంట్లో కథానాయకుడు యెగార్ చాలా సాదా, సీదా మనిషి. ఒకరకంగా చెప్పాలంటే లౌకికం తెలియని మనిషి. ఏ పని చేసినా ఎంతో ప్రేమతో చేస్తాడు. ఎంతో నిబద్ధతతో చేస్తాడు. కానీ, ఎక్కడా కుదురుగా నిలబడలేకపోతాడు. కుటుంబ పోషణకు సరిపడా సంపాదించలేకపోతాడు. భార్యతో సహా అందరితో అవమానింప బడతాడు. కొడుకుకి మాత్రం అతడు హీరో. కచ్చితంగా వ్యవహరించే అటవీ అధికారి రావడంతో అవినీతి పరుడైన బావ ఆట కట్టడి అయ్యి అతడు అడవికి సంరక్షకుడౌతాడు. ఆ పనిని అతడు ఎంతో ప్రేమతో, ఆనందంతో చేపడతాడు. అతనిలోని సృజనాత్మకతకు దారి దొరుకుతుంది. ఉద్యోగం పోయిందని బావ దొంగదెబ్బ తీస్తే, తెలిసి కూడా దాడి చేసింది ఎవరో చెప్పకుండా చనిపోతాడు. అతడి కలలు తిరిగి పుంజుకుంటున్న అడవిలో వాస్తవరూపం దాలుస్తాయి.

**– కె. సురేష్**

*అనువాదకులు, 'మంచి పుస్తకం' ప్రచురణ సంస్థ నిర్వాహకులు*

నిజం చెప్పాలంటే నేను పుస్తకాలు చదివి ప్రభావితమై ఉద్యమ బాటలోకి రాలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. (1967-69) చదువుతున్న రోజులలో ఐ.వి. సాంబశివరావు పరిచయం నన్ను ప్రభావితం చేసింది. వెనక్కి తిరిగి తలచుకుంటే ఆయన పరిచయమే లేకపోతే నేను జీవితంలో ఎలా ఉండేవాడినో అనిపిస్తుంది. ఆయన సాహచర్యంతో ప్రారంభమైన రాజకీయ ఆలోచనలు ఖమ్మం సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లో 1970లో జరిగిన విరసం ప్రారంభ మహాసభలో పాల్గొనడం ద్వారా ఆలోచనలు పూర్తిగా విప్లవ రాజకీయాల వైపు ప్రయాణించాయి. రాజకీయాలతో నైనా సాహిత్యంతోనైనా నా పరిచయం అప్పుడే ప్రారంభమైంది. ప్రభావితం చేసిన రచనలంటే చెప్పలేను గానీ, నన్ను బాగా ఆలోచింప చేసిన, పదే పదే చదవాలనిపించే, తలపుకొచ్చే రచనలు చెప్పగలను.

అవి, 1. కాళీపట్నం రామారావు – యజ్ఞం. 2. కె.వి.ఆర్. – మహోదయం. 3. కుప్రిన్ – యమకూపం. 4. వాసిరెడ్డి సీతాదేవి – మట్టి మనిషి. 5. మేరీ టేలర్ – భారతదేశంలో నా జైలు జీవితం. 6. అల్లం రాజయ్య – అగ్నికణం. 7. రఘోత్తమరెడ్డి – పనిపిల్ల. 8. కళ్యాణరావు – అంటరాని వసంతం. 9. పాణి – నిప్పుల వాగు... ఇవన్నీ సృజనాత్మక సాహిత్యం అయితే ఎప్పటికప్పుడు నా భావజాలాన్ని సజీవంగా ఉంచుకోవడానికి, సరైన భావాలను రూపొందించుకోవడానికి తోడ్పడుతున్న పుస్తకాలు, 1. కమ్యూనిస్టు మానిఫెస్టో. 2. వ్యవసాయ విప్లవం.

**– సి.ఎస్.ఆర్. ప్రసాద్**

*రిటైర్డ్ రాజనీతి శాస్త్ర అధ్యాపకులు*

1. పరాధీన భారతం; పరాధీన భారతంలో దారితప్పిన రూపాయి – ఎ.బి.కె. ప్రసాద్ : ప్రపంచ రాజకీయాలను శాసిస్తున్న సామ్రాజ్యవాద రాజకీయాలు, మల్టీనేషనల్ కంపెనీల భాగోతాలు, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణలతో పాటు ఫైనాన్స్ పెట్టుబడి విశ్వరూపం లాంటి ముఖ్యమైన విషయాలపై మన అవగాహనను పెంచే అత్యంత విలువైన సమాచారం, విశ్లేషణలతో నిండి ఉన్న ఈ రెండు పుస్తకాలు సామాజిక రంగంలో పనిచేసే కార్యకర్తలకు గైడ్‌లు, రిఫరెన్సు గ్రంథాలుగా ఉపయోగపడతాయి. తప్పక చదవండి.

2. ఉత్తరాంధ్ర సమస్యలు – పోరాటాలు – ఎం. శ్రీనివాసరావు, ఎ. అన్నపూర్ణ: పాలకుల నిర్లక్ష్యం వలన ఉత్తరాంధ్ర ప్రజలు తీవ్రమైన సమస్యల్ని ఎదుర్కొంటూ వాటి పరిష్కారంకై పోరాటాలు చేస్తున్నారు. ప్రభుత్వ సహకారంతో ప్రైవేట్ కంపెనీలు ఆ ప్రాంత సహజ వనరుల్ని, అటవీ సంపదను కొల్లగొట్టడమే కాకుండా, ప్రాజెక్టుల పేరుతో వారి జీవించే హక్కుపై దాడులు చేస్తున్నారు. ఆ ప్రాంతంలో జరుగుతున్న

విధ్వంసంపై ఇంతవరకు సరైన, సమగ్రమైన సమాచారం అందుబాటులో లేదు. ఆ లోటును భర్తీ చేసిన ఈ పుస్తకంలో ఉన్న వ్యాసాలు, కష్టాల కొలిమిలో కళింగసీమ – ఉత్తరాంధ్రపై విద్యుత్ ప్రాజెక్టుల దాడి, మనం ఆదివాసులకు శాపంగా మారుతున్న బాక్సైట్ తవ్వకాలు, జీడిపిక్కల్లా మాడుతున్న బతుకులు – గంగవరం నేర్పుతున్న పాఠాలు, కళింగసీమలో నిర్వాసితులు – అందరూ తప్పక చదవదగ్గది.

3. ఉక్కుపాదం – జాక్ లండన్: దాదాపు వంద సంవత్సరాల క్రితం అమెరికన్ పెట్టుబడిదారీ సమాజపు దుర్మార్గ వ్యవస్థను కళ్లకు కట్టినట్టు వివరించడమే కాకుండా వాటిపై ఆనాటి కార్మికవర్గం చేసిన అత్యంత సమరశీల పోరాటాల్ని అద్భుతంగా వివరించిన నవల ఇది. ఫాసిజం భయంకర స్వరూపాన్ని ముందుగానే ఊహించి ప్రపంచానికి దాని ప్రమాదం గురించి హెచ్చరించిన గొప్ప నవలను తప్పక చదవాలి.

4. పతంజలి భాష్యం – కె.ఎన్.వై. పతంజలి (బాధ్యతారహిత మానవ సమాజం మీద అక్షర శరసంధానం): ఎన్నికలైపోయిన తర్వాత దేశం ఎలా ఉంటుంది? దగా పడిన ఆడకూతురి లాగా ఉంటుంది. దొంగనవ్వుల బ్రోకర్ని నమ్మేసి అమాయకంగా రైలెక్కిపోయిన పల్లెటూరి పిచ్చిపిల్లలాగా ఉంటుంది దేశం.

మనం ఇంటి పుట్టిన దోమ అయినా, పరాయింటి పుట్టిన జలగ అయినా మన రక్తం పీల్చే బతుకుతాయని స్పష్టపడుతుంది.

*ఇక్కడ దీపాలు వెలిగించకూడదు*
*ప్రశ్నలు వినిపించకూడదిక్కడ*
*ఇక్కడ చూపుడు వేలు కనిపించకూడదు*
*ఈ కత్తుల తోటలో ఏం జరిగిందని ఎవరూ తొంగి చూడకూడదు*
*ఈ నెత్తుటి నదులు ఎక్కడివో ఆరాతీయకూడదు*
*మనందరం మనుషులం అని ఎవరూ ఇక్కడ గుర్తు చేయకూడదు*
*ఇలా అని ఏలిన వారు దండోరా వేయించరు*
*రాజపత్రం రాయించరు*
*కానీ...*

అది బాల్యం గురించి కావచ్చు, పెద్దల గురించి కావచ్చు, పార్టీల రాజకీయ రొచ్చు గురించి కావచ్చు, దేశద్రోహం గురించి కావచ్చు, ఆర్య గౌరవం గురించి కావచ్చు. పలు సామాజిక సమస్యలపై పతంజలి సంధించిన ఈ శక్తిమంతమైన, అద్భుతమైన వ్యాసాలను చదవకపోతే మనం చాలా నష్టపోయిన వాళ్లమవుతాం.

**– పి.వి. రమణ**
*ట్రేడ్ యూనియన్ నాయకులు*

**వ**లసవాద వ్యతిరేక ఉద్యమానికి సంబంధించి రెండు పుస్తకాలు.

1. ది రెచెడ్ ఆఫ్ ది ఎర్త్ – ఫ్రాంజ్ ఫానన్ పాత క్లాసిక్. సాహిత్య విద్యార్థులకు, చరిత్ర విద్యార్థులకు చాలా అవసరమైన పుస్తకం. అల్జీరియన్ స్వాతంత్ర్యోద్యమ కాలంలో రాసిన పుస్తకం ఇది. ప్రధానంగా వలసవాదానికీ, అమానుష అణచివేతకూ, హింసకూ గురైన ప్రజల సామాజిక, ఆర్థిక, మానసిక సంక్షోభాన్ని కళ్లకు కడుతుంది. అల్జీరియాలోని నల్లజాతికి చెందిన ప్రజలకు సంబంధించింది కావడంతో ఆ తిరుగుబాటు గురించీ ఉంటుంది.

2. డీకాలనైజింగ్ ది మైండ్ – ది పొలిటిక్స్ ఆఫ్ లాంగ్వేజ్ ఇన్ ఆఫ్రికన్ లిటరేచర్ – గూగీ వా థియాంగో. సాహితీ విద్యార్థులకు చాలా ముఖ్యమైన పుస్తకం. ఇంగ్లిష్ సాహిత్యం చదివే వాళ్లు మేథోవలస స్వభావాన్ని వదిలి పెట్టాలనే సందేశం ఈ పుస్తకంలో ఉంది. వలసవాదం పరిపాలనా రూపంలో, సామాజిక, రాజకీయార్థిక రూపాలలో ఇదివరకు ప్రత్యక్షంగా కనిపించేది. కంటికి కనబడకుండా మన మెదళ్లపై పనిచేసే వలస స్వభావం గురించి గూగీ రాశారు. ఆంగ్ల భాషకు బానిసలై పోవడం మూలాన సంస్కృతీ పరంగా మనం పరాయీకరణ చెందడమే కాకుండా, మనకున్న ప్రజలకు ఉపయోగపడే రాడికల్ ఆలోచనలు కూడా ప్రజలకు అందించలేం. దానికి ఇంగ్లిష్ అడ్డుగోడగా ఉంటుంది. ఎవరికి అయితే మన ఉద్దేశాలు చేరాలో ఇంగ్లిష్‌లో రాయడం వల్ల వారికి అందదనేది గూగీ వాదన. వలసవాదానికి గురయి స్వాతంత్ర్యం పొందిన దేశాలలో ఆ దేశ సాహిత్యం చదవడం కంటే కూడా ఇంగ్లిష్ చదవడానికి ప్రాధాన్యత ఎక్కువ ఉంటుంది. కచ్చితంగా విద్యాలయాలలో ఇంగ్లిష్ డిపార్ట్‌మెంట్ ఉంటుంది. గూగీ 'ఎబాలిష్ ఇంగ్లిష్ డిపార్ట్‌మెంట్' అనే నినాదం కూడా ఇచ్చాడు. స్థానిక భాషల్ని, సంస్కృతుల్ని గుర్తించి, గౌరవించి, అభివృద్ధి చేయాల్సిన అవసరాన్ని గూగీ నొక్కి చెపుతాడు.

3. కుల నిర్మూలన – అంబేద్కర్: ఇది చాలా ముఖ్యమైన గ్రంథం. భారతదేశంలో కులమనే సామాజిక వాస్తవం ఉందని, దానిని నిర్మూలించవలసిన బాధ్యత సామాజిక ఉద్యమాల మీద ఉందని నొక్కి చెప్పే పుస్తకం. భారతదేశంలో మొట్టమొదటిసారి కుల నిర్మూలన అనే నినాదం అంబేద్కర్ ఈ పుస్తకం ద్వారా ఇచ్చారు. అంతేకాకుండా, భారతదేశంలో కుల నిర్మూలనకు సంబంధించి గాంధీ దృక్పథానికి, అంబేద్కర్ దృక్పథానికి ఉన్న తేడా ఈ పుస్తకం మీద గాంధీ–అంబేద్కర్‌ల మధ్య జరిగిన చర్చ సందర్భంగా రికార్డ్ అయింది. ఈ పుస్తకం మీద జరిగిన చర్చ నేటికీ మనకు అవసరమే.

4. గులాంగిరి – జ్యోతిబా పూలే: భారతదేశంలో బ్రాహ్మణ ఆధిపత్యాన్ని విమర్శించి, ఎత్తిచూపిన మొట్టమొదటి పుస్తకం. భారతదేశ సాంస్కృతిక, సామాజిక పునరుజ్జీవానికి ఆద్యుడైన జ్యోతిబా పూలే రాసిన ఈ పుస్తకం వెలుగులో భారతదేశ చరిత్రను తిరిగి రాయవలసిన అవసరం ఉంది. భారతదేశ చరిత్రకారులు ఇలాంటి పుస్తకాల్ని, అంబేద్కర్ పూలే ఆలోచనా విధానాల్ని వెలుగులోకి రాకుండా చేశారు. అందువల్ల మనందరం తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం.

5. ది ఆటోబయోగ్రఫీ ఆఫ్ మాల్కం ఎక్స్ – మాల్కం ఎక్స్: నల్లజాతి ప్రజలకు సంబంధించి వారి హక్కుల ఉద్యమ నాయకుడైన మాల్కం ఎక్స్ రాసిన ఈ పుస్తకం అమెరికాలోని నల్లజాతి ప్రజలు జాత్యాహం కారానికి వ్యతిరేకంగా, పౌరహక్కుల కోసం, స్వాతంత్ర్యం కోసం పోరాడిన నేపథ్యాన్ని, ఆ నేపథ్యంలో మాల్కం ఎక్స్ లాంటి నాయకుడు పుట్టి, పెరిగి, యోధుడిగా పరిణామం చెందిన తీరును మనకు చిత్రీకరిస్తుంది.

**– కె. సత్యనారాయణ**
ఇంగ్లిష్ అధ్యాపకులు

*తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాల జాబితాలో భాగంగా, ఒక ప్రత్యామ్నాయ ఉద్యమ క్రమంలో వచ్చిన సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్రను పరిచయం చేస్తున్నారు* **వరవరరావు**

# దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర

కొన్ని రోజుల క్రితం ఒక ప్రముఖ దినపత్రికలో దండకారణ్య నుంచి ఇరవై నాలుగు పత్రికలు వెలువడుతున్నాయి అని చదివినప్పుడు ఒకే సమయంలో ఆశ్చర్యమూ, సిగ్గూ కలిగాయి. తన ప్రజల మీద తాను యుద్ధం చేస్తున్న భారత ప్రభుత్వ దాడులను రోజూ ప్రతిఘటిస్తూ, ప్రతిక్షణం ఒక ఎన్‌కౌంటర్, ఒక అత్యాచారం, ఒక గృహదహనం, ఒక గాలింపు, ఒక వేట, ఒక మందుపాతర, విధ్వంసం, నెత్తుటి మడుగుగా బయటి ప్రపంచం ఊహించుకుంటున్న ఒక అరణ్యం ఇంత పత్రహరితంగా, ఇంత సృజనాత్మకంగా ఉన్నారా అని ఆశ్చర్యపోయాను. తమ దృష్టితో మీడియా చిత్రించే కథనాలు చదువుతూ కడుపులో చల్ల కదలకుండా జీవిస్తున్న మా బోటి అన్ని వనర్లున్న నగర జీవులం ఏ ఒక్క సృజనాత్మక కార్యక్రమమూ ఇంత సమకాలీనమైంది చేపట్టలేక పోతున్నాం గదా అని సిగ్గుపడ్డాను. 'ఏం ఉత్పాతం వచ్చింది' అని ఏదయినా ఉపద్రవం, ప్రమాదం ఊహించినపుడు భయాందోళనలతో మా అమ్మ అంటుండేది.

ఒకవైపు ఆదివాసులందరినీ వాళ్ల వాళ్ల ఆవాసాల నుంచి విస్థాపితం చేస్తూ, బేస్ క్యాంపులలో పెట్టి, వలసపోయేలా చేసి గూడాలకు గూడాలను తగులబెట్టి, మహిళలపై సామూహిక అత్యాచారాలు చేస్తూ, అదృశ్యం చేస్తూ, ఆశ్రయమిస్తున్నారనే పేరుతో ఎన్‌కౌంటర్ చేస్తూ రాజ్యం అనూహ్యామైన విధ్వంసం, హింస చేస్తున్న కాలంలో దంతెవాడలో, బస్తర్‌లో ఉత్పత్తిలో పాల్గొంటున్న ఆదివాసులు సృష్టిస్తున్న కళలు, సంస్కృతి, సాహిత్యం ఎంత అపూర్వంగా ఉన్నాయో అడవిని అద్దంలో చూపే పుస్తకం ఒకటి చేతికి వచ్చింది. ఈ అడవి నిశ్చలమైంది కాదు. ఇది కొందరు వెక్కిరించే ఊరుకాని అడవి కాదు. నిజంగా జనారణ్యం. అయితే నిరంతర సంచలనంలో ఉన్నా, సంఘర్షణలో ఉన్నా చలనశీలమైన, పోరాటశీలమైన అడవి. మ్యాక్‌బెత్ నాటకంలో వలె నగరాల మీదికి దండెత్తి వస్తున్న అడవి.

ఈ అడవి నిర్దిష్టంగా దండకారణ్యం. ఒకప్పుడు ఆదిలాబాద్, భద్రాచలం అడవులు కూడా ఇందులో భాగమే కానీ ఇప్పుడు మాత్రం పోరాట రాజకీయ నిర్మాణంగా ఇది ఛత్తీస్‌ఘఢ్, గడ్చిరోలీలకు విస్తరించిన భూభాగం. ఇక్కడ గత ముప్పై సంవత్సరాలుగా 2004 దాకా సిపిఐ (ఎం.ఎల్.) పీపుల్స్ వార్, ఆ తర్వాత మావోయిస్టు పార్టీ నాయకత్వంలో విప్లవోద్యమం పురోగమిస్తున్నది. గెరిల్లా పోరాటంగా ప్రారంభమై ఇది ఇవ్వాళ చలన యుద్ధ స్థాయికి చేరుకొని భూంకాల్ సేనను నిర్మించుకొని భారత విప్లవానికే విముక్తి ప్రాంతంగా రూపుదిద్దుకునే దశలో ఒక అంతర్యుద్ధంలోకి శత్రువు చేత నెట్టబడింది – ముఖ్యంగా 2009 నవంబర్ నుంచి గ్రీన్‌హంట్ ఆపరేషన్ ప్రారంభమైనప్పటి నుంచి.

ఇంత యుద్ధంలోను ఇక్కడ జనతన సర్కార్ పేరుతో విప్లవపార్టీ నాయకత్వంలో ఆదివాసులు స్వయం పాలనలో స్వావలంబన అభివృద్ధిని అమలు చేస్తున్నారు.

ఆ ప్రజారాజ్య స్వభావ స్వరూపాలను, రూపసారాలను వ్యక్తం చేసే భాష, సాహిత్యం, సంస్కృతులను, కళలను కూడా గత ముప్పై సంవత్సరాలుగా రూపొందించుకొని అభివృద్ధి చేస్తున్నారు.

ఇక్కడ ఆదివాసుల ప్రధానమైన భాషలు కోయ, గోండీ, మాడియా భాషలు. ఇంకా చాల ఆదివాసీ మాండలిక రూపాలు. వీటిపై ఇరుగు పొరుగు భాషలైన తెలుగు, మరాఠీ, స్థానిక హిందీ మాండలికాల ప్రభావం ఉంటుంది. తెలుగు, మరాఠీ, హిందీలు కూడ ఎక్కువమందికి అర్థమవుతాయి. అవి కూడ అడవంచున ఊళ్ల ప్రజలు మాట్లాడే భాషలుగా. ఈ అన్ని భాషల్లో వాళ్లు సాహిత్య, కళారూపాలను సృష్టించుకుంటున్నారు. బహుశా ప్రపంచంలోనే ఇంత విస్తారమైన భూభాగంలో, ఇంత సుదీర్ఘమైన కాలం ఒక లక్షమంది పాల్గొంటున్న ఒక సాంస్కృతిక ప్రయోగం, అది కూడా శాంతి కాలంలో, శాంతి స్థలంలో కాదు, యుద్ధ కాలంలో, యుద్ధ రంగంలో జరగడం అపూర్వమనుకుంటాను.

ఆ ముప్పై ఏళ్ల ప్రయోగం గురించి చెప్పేదే 'ముప్పై ఏళ్ల దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర' (1980–2010) విరసం ప్రచురణగా వెలువడింది. 2010లో మహాన్ భూంకాల్ శతాబ్ది ఉత్సవాలు జరుపుకుంటున్న సందర్భంలో ఫిబ్రవరి 10న దీనిని వెలువరించారు.

మహాన్ భూంకాల్ అంటే సరిగ్గా వంద సంవత్సరాల క్రితం 1910లో బ్రిటిష్ వలసపాలనకు, కంపెనీ దోపిడీకి వ్యతిరేకంగా ఇదే బస్తర్ ప్రాంతంలో గుండాదర్ అనే అదివాసీ వీరుని నాయకత్వంలో జరిగిన తిరుగుబాటు. సాయుధ తిరుగుబాటు. భూంకాల్ అంటే సైన్యాన్ని రూపొందించుకొని చేసిన సాయుధ తిరుగుబాటు.

పోరాట వారసత్వంలోని, సంప్రదాయాన్ని ఇవ్వాళ మావోయిస్టు పార్టీ స్వీకరించి, తాను నిర్మించిన ప్రజావిముక్తి సైన్యంలో ఛత్తీస్‌ఘఢ్‌లో విభాగానికి భూంకాల్ మిలీషియా అని పేరు పెట్టి ఒక విముక్తి యుద్ధాన్ని చేస్తున్నది.

విప్లవసారం జాతీయ రూపంలో ఉండాలంటాడు స్టాలిన్. ఇది భూమి సేనకే కాదు, సాంస్కృతిక సేనకు కూడా వర్తించే సూత్రం. ఈ శాస్త్రీయ నిర్వచనానికి అనుగుణంగా దండకారణ్యంలో సాహిత్య, సాంస్కృతికోద్యమం గత ముప్పై ఏళ్లుగా ఎట్లా నిర్మాణమయి వికసిస్తున్నదో ఎంతో విశ్లేషణాత్మకంగా, వివరణాత్మకంగా, సోదాహరణగా చెప్పే చరిత్రయే ఈ రెండు వందల పేజీల పుస్తకం.

ఆదివాసుల జీవితాల్లోకి ఎవరు తొంగి చూసారు. మన తెలుగు

నేలకే పరిమితమై చూసినపుడు మొదట పర్లాకిమిడిలో గిడుగు రామమూర్తి పంతులు ఆ పని చేశాడు. ఇటు తెలుగు వాడుక భాషకు వాగను శాసనుడు కావడం మాత్రమే కాకుండా సవరలను చేరదీసి, వాళ్ల మధ్య జీవితం గడిపి, సవర భాష నేర్చుకొని, సవర భాష కోసం లిపిని, వ్యాకరణాన్ని రూపొందించిన వాడాయన.

ఆ పని విప్లవాచరణలో భాగంగా, భాషా సంస్కృతులను విముక్తి సాధనాలుగా వినియోగించుకోవాలని పూనుకున్నాడు శ్రీకాకుళ ఉద్యమ నిర్మాత వెంపటాపు సత్యనారాయణ. ఈ కృషి ఆయా కాలాలకు, స్థలాలకు తాత్కాలికంగా పరిమితమైపోయింది.

ఈ కృషిని గుణాత్మకంగా అమలు చేసింది నిన్నటి పీపుల్స్‌వార్. ఇవ్వాల్టి మావోయిస్టు పార్టీ.

1980లో పీపుల్స్‌వార్ ఏర్పడి దండకారణ్య పర్‌స్పెక్టివ్ రచించుకొని, దండకారణ్యంలో ప్రవేశించింది. మొట్టమొదట 1979లో పెద్ది శంకర్ నాయకత్వంలో ప్రాణహిత దాటి సిరోంచ అడవుల్లో (అప్పటికి గడ్చిరోలీ జిల్లా ఏర్పడలేదు) మెయిన్‌బిన్ పేట అడవుల్లో 2 నవంబర్ 1979న ఆయన మహారాష్ట్రలోనే మొట్టమొదటి ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడు. అట్లా ప్రారంభమైంది దండకారణ్యంలో విప్లవోద్యమం. ఆ పెద్దిశంకర్ అమరత్వంపై పాటలలోనే ముప్పై ఏళ్ల క్రితం అక్కడ విప్లవ సాహిత్య, సాంస్కృతికోద్యమాలు కూడ ప్రారంభమయ్యాయి.

అయితే ఈ పుస్తకంలో చెప్పినట్లు దీనికి తొలి దశ తెలుగు విప్లవ సాహిత్యంలోని పాటలను, ప్రజా కళా రూపాలను తెలుగులో, ఆదివాసీ భాషల్లోనూ అక్కడి పోరాట ప్రజల్లోకి తీసుకుపోవడం. అందుకు సహజంగానే తొలి ప్రేరణలు సృజన, విరసం, జననాట్యమండలి. పాణిగ్రాహి, చెరబండరాజులు, దండకారణ్య సాహిత్యం సాంస్కృతి కోద్యమాలకు తొలి వేగుచుక్కలు సుబ్బారావు పాణిగ్రాహి, పెద్ది శంకర్, చెరబండరాజు.

పెద్ది శంకర్‌తోపాటు, ఆయన అమరత్వం తర్వాత ప్రవేశించిన దళాలు ఎక్కువగా తెలంగాణ నుంచి వెళ్లినవే. క్రమంగా ఇతర ప్రాంతాల నుంచి వచ్చారు. వీళ్లంతా మొదట చేసిన కృషి అక్కడి ఆదివాసీ భాషలు నేర్చుకొన్నారు. సులభమయిందీ, ప్రవేశానికి దోహదం చేసిందీ తయారుగా ఉన్న తెలుగులోని సాహితీ, కళా, సాంస్కృతిక రూపాలను ఆదివాసీ భాషల్లోకి మార్చడం. ముఖ్యంగా జననాట్యమండలి పాటలు – 'ఊరు మనది, వాడమనది', 'నడవరా, కూలన్న నడవరా, బిరబిర నడవరా కూలన్న నడవరా' వంటి పాటలను ఆదివాసీ భాషల్లోకి అనుసృజన చేయడం. మరాఠీలోనూ, హిందీలోనూ విలాస్ ఘగ్రే వంటి వాళ్లు రాసిన 'ఆవాన్ నాట్యమంచ్' పాటలను యథాతథంగా (ఆ రెండు భాషలూ సులభంగా అర్థమవుతాయి గనుక) ప్రచారం చేయడం.

అంటే తెలుగు గ్రంథస్త సాహిత్యం వలెనే దండకారణ్య

పుస్తకాలు చదవడం గురించి మాగ్జిం గోర్కీ 'ఆన్ బుక్స్' అని ఒక నాలుగు పేజీల వ్యాసం రాసాడు. యంత్రం నుంచి అక్షరాలు కాగితం మీదికి వచ్చిన దగ్గర్నించి అవి పుస్తకరూపంలో చదివే దాకా ట్రెడిల్ యంత్రాన్ని తిప్పే కార్మికుడు సృష్టించే ఒక అద్భుతమైన ప్రపంచం మనకెందరు స్నేహితుల్ని సమకూర్చి పెడుతుందో ఒక మమేకమయిన స్వానుభవంతో చెప్తుంటే పుస్తకాలు చదవకపోవడం వల్ల ఎంత ప్రపంచాన్ని కోల్పోతామో అర్థమవుతుంది. భూగోళం మీద మనుషులున్నారు. ఇది ఒక భౌతిక వాస్తవం. వాళ్లు మన కొరకు మన చేతుల్లోని పుస్తకంలోకొస్తారు. ఇది మహదావకాశాన్ని కలిగించే సృజనాత్మక వాస్తవం. కనుక గోర్కీ నుంచి ప్రారంభిస్తాం. గోర్కీ 'అమ్మ' శ్రీశ్రీ 'మహాప్రస్థానం' చదివి తెలుగు నేలమీద ఎన్నివేల మంది కమ్యూనిస్టులయ్యారో ఎన్నిసార్లు ఎంతమంది తమ అనుభవాలు చెప్పినా మనుషులు తమ కొరకు ఈ ప్రపంచాన్ని మరింత వాసయోగ్యమైన ప్రపంచంగా మార్చుకోవడానికి, తలకిందులైన ప్రపంచాన్ని సరిచేయడానికి నిజంగానే కమ్యూనిస్టులు కావాలి గనుక మొదట (నువ్వు ఆర్టిస్టువి కావాలన్నా, సైంటిట్టువు కావాలన్నా మొదట కమ్యూనిస్టు కావాలి) 'కమ్యూనిస్టు ప్రణాళిక' చదవాలి. ప్రపంచంలో చాలామంది కవిత్వం నుంచి, సాహిత్యం నుంచి కమ్యూనిజంలోకి వచ్చారు. మయకోవ్‌స్కీ, శ్రీశ్రీ వలె. అంటే, భావావేశం లేకుండా ఒక మంచి మార్పు కోసం ప్రయత్నం చేయలేం గనుక యవ్వనంలో స్వప్నాలు, ఆదర్శాలు ఒక చోట నిలువవు గనుక కళ్లముందరి ఆకలి, రోగం, అన్యాయం, పీడనలను తొలగించడానికేం చేయాలో పుస్తకాలు చెప్తాయి. ఎందుకంటే పుస్తకాలు మనకన్నా ముందువారి, మనతో ఉన్నవారి ఆచరణలే.

ఒకసరియైన, ప్రజాస్వామికమైన సాహిత్య, సామాజిక దృక్పథాన్ని ఇచ్చే పుస్తకం, ఒకే ఒక్క పుస్తకం పేరు చెప్పమంటే నేను గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' నాటకం చదవమని చెప్తాను. మన బుద్ధికి పదనుపెట్టడానికి, మన ఆలోచనలను వికసింపచేయడానికి, అమ్మడం, కొనడంగా మారిన మానవ సంబంధాలను అర్థం చేసుకోవడానికి గురజాడ రచనలు చదవాలి.

మనుషులు ఒక సామాజిక ఆచరణలో పాల్గొనే క్రమంలో మారుతున్నట్లుగానే ఆ సామాజిక ఆచరణను ప్రతిఫలించే పుస్తకాలను చదవడం వల్ల కూడ మారుతారు.

మనది గ్రామీణ వ్యవసాయ సమాజం. ఇది విధ్వంసం అయిపో గూడదని ఆశించే వాళ్లు తప్పకుండా ప్రేంచంద్ సాహిత్యాన్ని చదవాలి. అందుకోసమే కాదు మనుషుల్లోని ప్రేమలు, కాపీనాలు, లోభం, స్వార్థం, స్నేహం అర్థం చేసుకుని, మనుషుల్ని మనుషులుగా ప్రేమించడానికి కూడ ప్రేంచంద్ జీవితాన్ని, సాహిత్యాన్ని చదవాలి.

పెట్టుబడి, సరుకు, మార్కెట్, మార్కెట్ విస్తరణకాంక్ష మనిషిలోని సారాన్ని ఎట్లా పీల్చిపిప్పి చేస్తాయో, ఎట్లా పరాయీకరణకు గురిచేస్తాయో మార్క్స్ మొదలు ఇవ్వాటి వరకు ఎందరో రాసారు, రాస్తున్నారు – సాహిత్యం ద్వారా అవి మన భావోద్వేగాల్లో భాగం కావడం సులభమవుతుంది. ఫ్రెంచ్ సమాజ చరిత్రను ఎన్నో చరిత్ర పుస్తకాల్లో కన్నా నేను బాల్జాక్ రచనల నుంచి తెలుసుకున్నానంటాడు మార్క్స్.

యవ్వనావేశంలో చలం, శ్రీశ్రీల ప్రభావంతో ప్రేమ, స్త్రీ–పురుష సమానత్వభావం, పరస్పరం సంఘర్షించిన శక్తులలో జనించిన చరిత్ర పట్ల అభినివేశం కలగడం ఒక ఎత్తు అయితే పరిణత వయస్సులో కూడ నాకు గూగీ రచనలు, లాటిన్ అమెరికన్ రచనలు, ముఖ్యంగా ఎడువార్డో గెలియానో, మార్క్వెజ్ రచనలు సామ్రాజ్యవాదమంటే సంస్కృతిని విధ్వంసం చేసే మహమ్మారి అని మనసుకు హత్తుకోవడానికి దోహదం చేసినవి.

పుస్తకాలు ఎందుకు చదవాలి, మనం మరింత ఉన్నతీకరింప బడడానికి. మనచుట్టూ ఉన్న పరిసరాలను పరిశుభ్రం చేయడానికి. మనకు మనం కొన్ని విలువలతో బతకడానికి విస్తృత అధ్యయనం పనికిరావచ్చుగానీ, విలువలుగల సమాజాన్ని రూపొందించాలంటే మాత్రం మనం రాజకీయ కార్యాచరణకు పూనుకోవాల్సి ఉంటుంది. అటువంటి ప్రజాకీయ కార్యాచరణకు ప్రేరణనిచ్చిన పుస్తకాల్లో విలియమ్ హింటన్ 'ఫ్యాన్‌షెన్' (తెలుగులో సంక్షిప్తంగా 'విముక్తి')ను తప్పక చదవాలి.

ఉద్యమంలో తొలిదశ అనుసృజన దశ. ప్రారంభ అనువాద సమస్యలు, తొలినాళ్ల అనుభవాలు అనే రెండు అధ్యాయాల్లో ఇవి ఎంతో వాస్తవికంగా వివరించి విశ్లేషించారు.

నలభై ఏళ్ల క్రితం సరిగ్గా విప్లవ రచయితల సంఘం ఏర్పడిన 4 జూలై 1970న వెలువడిన 'విప్లవ కవులు' 'మార్చ్' కవితా సంకలనానికి పతాక శీర్షిక, 'ప్రజను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి'.

ఈ ముప్పై ఏళ్ల (1980–2010) దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్రకు పతాక శీర్షిక 'పాటకు పల్లవి ప్రజాయుద్ధం'.

కనుక విషయ సూచికయే చూడండి, ఎంత విషయ సుభోదకంగా ఉంటుందో. ఇది పునాది – ఉపరితలం చర్చిస్తుంది. పునాదియైన రాజకీయార్థిక పోరాటానికి (దున్నేవారికి భూమి పోరాటానికి) ఉపరితలమైన రాజకీయ, సామాజిక, సాంస్కృతిక అంశాలు చర్చిస్తుంది. అధ్యాయాలే ఎంత అద్భుతంగా విషయ పరిచయం చేస్తాయో చూడండి.

పాటకు ప్రజలే ప్రాణం – ప్రజలకు ప్రాణం పాట. 1) విప్లవాన్ని స్వాగతించిన జనం ఆట – పాట. 2) పాట ప్రజను సంఘటితం కావాలంది. 3) ప్రజాపోరు ఆలంబనగా పాట. 4) ఆటపాటల్లో ప్రతిధ్వనించిన నినాదం దున్నేవారిదే భూమి. 5) కొత్త రాజకీయాలకు నూతన వెలుగులు నింపిన విప్లవ పాటలు. 6) మేం ఎవరి కోసం విస్థాపితులం కావాలని జనం ప్రశ్న. 7) నిర్బంధం కొలిమిలో మండే జనం గుండె చప్పుళ్ల ప్రతిరూపం పాట – ఫాసిస్టు సల్వాజుడుంను పాతర పెడుదాం. 8) పాటకు పల్లవి ప్రజాయుద్ధం. 9) మహిళా విముక్తి బాటలో సాగుతూంది పాట. 10) త్యాగాల స్మృతిలో అమరగీతాలు.

ఈ పుస్తకానికి ఎంతో విలువైన ముందుమాట రాసిన లక్ష్మి మాటల్లో–

'ఇక్కడి సాహితీ సాంస్కృతికోద్యమం ప్రధానంగా ఆదివాసీ ఉద్యమమే అయినప్పటికీ అది కేవలం ఆదివాసీ ఉద్యమం అనుకోలేం. ఆంతరంగికంగా తెలుగు, ఛత్తీస్‌ఘఢ్, హిందీ, మరాఠీ భాషా సంస్కృతులతో బాగా ప్రభావితం అవుతూ వస్తున్నది. దండకారణ్య సామాజిక ఆర్థిక పరిస్థితులు చాల వెనుకబడి ఉన్నప్పటికీ, ఈ సమాజం ఆదివాసీ సమాజం కావడం వల్ల ఇక్కడి ప్రజానీకమంతా గొప్ప సాంస్కృతిక (ఆట, పాట, నృత్యం, పేటో, హాస్యం, సామూహికత) ప్రియులు. వివిధ రూపాల్లో చిత్రలేఖనం, శిల్పం జీవితంలో విడదీయలేని భాగంగా ఉన్నాయి. పాట, నృత్యం, వేట, హాస్యంతో వీరికి ఎంత ప్రగాఢమైన సంబంధమంటే, వీరి దైనందిన జీవితంలో ఇవి అంతర్భాగం. మావోయిస్టులు ప్రజల సాంస్కృతిక జీవితంలో పెనవేసుకపోతూ మార్క్సిజం–లెనినిజం–మావోయిజాన్ని ఆదివాసీ సంస్కృతికి సృజనాత్మకంగా అన్వయించడంవల్ల వారి భావజాల రంగం విప్లవీకరించ బడుతూ, వారిని ప్రజాయుద్ధంలో క్రియాశీలంగా సమీకరించడానికీ, నూతన ప్రజా రాజకీయాధికారం నెలకొల్పడానికీ, ఇక్కడ సామాజిక జీవితాన్ని ప్రజాస్వామికీకరించానికీ, వారిలో సోషలిస్టు భావజాలాన్ని వ్యాపింప జేయడానికీ ఎంతగానో తోడ్పడుతున్నది. ఈ ప్రజాస్వామికీకరణ, నూతన ప్రజాసంస్కృతి నూతన ఆర్థికం పెంపొందడానికి బీజాలు నాటుతున్నది. ఇందులో నూతన సంస్కృతి ఒక ఉద్యమంగానే పెంపొందుతున్నది. ఇది నూతన ప్రజారాజ్యాధికార విస్తృతికీ, అది ఉన్నత స్థాయికి ఎదగడానికీ బలంగా తోడ్పడుతున్నది.'

ఉద్యమం రెండవ దశకు వెళ్లేవరకు ఎట్లాగైతే కార్యక్షేత్రంలో స్థానిక ఆదివాసీ నాయకత్వం వచ్చిందో అట్లాగే స్వతంత్ర ఆదివాసీ పాటలు, ప్రదర్శన రూపాలు వచ్చాయి. నిజానికి పాట, పేటో, నృత్యం ఆదివాసీ సామూహిక ప్రదర్శన కళారూపాలే. ఇవి ఎంతగా విస్తరించి, అభివృద్ధి చెందుతుంటే ప్రజాసైన్యం ఏర్పడే క్రమంలో ప్రజా సాంస్కృతిక సైన్యంగా చేతనా నాట్యమంచ్ ఏర్పడింది. ఇప్పుడిది వేలాది మంది సభ్యులతో దండకారణ్యమంతా విస్తరించింది. మైదాన ప్రాంతంలో జననాట్యమండలి నిర్మాణంలో తలపండిన నాయకత్వం దండకారణ్య విప్లవోద్యమంలో సాయుధ జననాట్య మండలి అనుభవాలు కూడ తోడయి దండకారణ్య సాంస్కృతికోద్యమ నిర్మాణానికి బలం చేకూరింది. అరుంధతీరాయ్ 'వాకింగ్ విత్ ది కామ్రేడ్స్' వ్యాసంలో దండకారణ్యంలో లెంగ్ వంటి సాంస్కృతిక ఉద్యమ నాయకుల కృషి గురించి ప్రస్తావించే ఉన్నది.

స్వయంగా దండకారణ్య విప్లవ సాంస్కృతికోద్యమం గడ్చిరోలీ, బస్తర్‌లలో ఉద్యమ నిర్మాతలుగా అమరులు పశుల రాంరెడ్డి, విజయ భాస్కర్‌లకు జోహార్లు అర్పించింది. పాటల రచయితగా, సాంస్కృతిక ప్రదర్శన కళాకారుడుగా నర్కటోర్ (సుఖదేవ్)ను సాంస్కృతికోద్యమ నిర్మాతగా వడ్కాపూర్ చంద్రమౌళిని కూడ చాల స్మరించుకున్నది. చక్కని నటనాకౌశలంతో ప్రేక్షకుల జ్ఞాపకాల్లో చిరకాల ముద్రవేసిన సంతోష్ కథలు, కవితలు, పాటలు రాసి బస్తర్ విప్లవోద్యమాన్ని దక్షిణం నుంచి ఉత్తరానికి విస్తరింపజేసిన వారధిగా వ్యవహరించి, తోటి రచయితలను మంచి రచనలు చేయడానికి సహకరించిన నల్లావసంత్‌ను స్మరించుకున్నది.

విప్లవోద్యమ నిర్మాణంలో వలెనే, విప్లవ సాంస్కృతికోద్యమ నిర్మాణంలో కూడా ఎందరో ప్రాణాలర్పించారు. వారందరినీ ఈ చరిత్ర పేరు పేరునా స్మరించుకున్నది.

ఈ క్రమంలో ఇటు విప్లవ రచయితల సంఘం నిర్మాణంలో, కష్టకాలంలో నిలబెట్టడంలో కీలకపాత్ర వహించిన ఐ.వి. సాంబశివరావు దండకారణ్య సాహిత్య, సాంస్కృతికోద్యమానికి చేసిన సేవలను, పటేల్ సుధాకరరెడ్డి చేసిన సేవలను కూడా గుర్తు చేసుకున్నారు. పటేల్ సుధాకరరెడ్డి ఎనిమిదో దశాబ్దం ఉత్తరార్ధంలో ఈ సాంస్కృతికోద్యమాన్ని ప్రారంభించిన వాడయితే ఐ.వి. తొంభైల ఆరంభంలో 'రాగో' రచనను ప్రత్యేకించి ప్రోత్సహించిన వాడు.

ఆదివాసుల జీవితంలో కష్టంలో, సుఖంలో, ఏకాంతంలో, సమూహంలో, కన్నీళ్లలో, కలల్లో భాగమైన పాట విప్లవోద్యమంలో ఎటువంటి రసాయనిక మార్పునకు గురియై, మళ్లీ విప్లవోద్యమంపై ఎటువంటి ప్రభావం చూపిందో ఈ పుస్తకమే ఇట్లా ముక్తాయింపు చేసింది.

'తొలుత విప్లవ పాట తనతో తాను దండకారణ్య ఆదివాసీ ప్రజలకు పరిచయం చేసుకుంది. తర్వాత ఆ పాట ఆ ప్రజలను పోరుకు సిద్ధం కమ్మంది. పోరాటాలకు పూనుకున్న ప్రజలను పాట సంఘటితం కావాలని కోరింది. సంఘటిత ప్రజలే విప్లవోద్యమ విజయానికి గ్యారంటీ అని స్పష్టం చేసింది పాట. ఆ పాట పల్లెల్లో అధికారం ఎవరి చేతిలో ఉందని ప్రజలను ప్రశ్నించింది. విప్లవం అంటే రాజ్యాధికార సమస్యే అని వివరించిన పాట ప్రజల అధికారానికి ప్రజల్ని సిద్ధం చేసింది. ఆ అధికారం ప్రజాయుద్ధంతోనే సాధ్యం అంది. ఆ యుద్ధం ప్రజాసైన్యం చేస్తుందనీ, ప్రజలంతా ఆ యుద్ధంలో సమరశీల పాత్ర పోషించాలనీ పాట ప్రజలకు విజ్ఞప్తి చేసింది. ప్రజా సైన్యం లేకుండా ప్రజలకు ఏముంది? అని చాటి చెప్పిన పాట ప్రజలను ప్రజాయుద్ధంతో జోడించింది. ఆ ప్రజా యుద్ధానికి పాట అంకితమైంది. దండకారణ్యం లోకి ప్రవేశించిన పాట అడవులనూ, కొండలనూ అవాహం చేసుకొని పల్లె – పల్లెను తన డోళ్లు, డప్పులతో, కాలగజ్జెలతో కదిలించి, ప్రజలతో పయనించి వారి పోరులో హోరై వాళ్ల యుద్ధంలో తూడా అయి త్యాగంలో

జెండా అయి నిలిచింది. విప్లవ త్యాగాలను గానం చేసింది పాట. పాట ప్రజా యుద్ధానికి పల్లవి అయింది.'

దండకారణ్య కళారూపాల్లో తరతరాలుగా కొనసాగుతూ వస్తున్న వాటిలో పేటో కళారూపం ఒకటి. ఇది గడ్చిరోలి, ఉత్తర బస్తర్, మాడ్‌లలో నేటికీ ఇంకా మిగిలి ఉంది. దీనినే దక్షిణ, పశ్చిమ బస్తర్‌లలో కొన్ని మార్పులతో వేసోడ్‌లుగా పిలుస్తారు. ముఖ్యంగా ప్రజల్లో కొంత మంచి పేరు సంపాదించుకుని బతికిన పెద్దలు చనిపోయినప్పుడు వాళ్ల స్మృతిలో గోటులలో మూడు, నాలుగు రాత్రులు ఈ పేటో చెప్పిస్తుంటారు.

ఇది మైదాన ప్రాంతాల్లోని హరికథ, ఒగ్గుకథ, బుర్రకథ, చిరతల రామాయణం, దండోరా (మరాఠీ) పాండ్వాణీ (ఛత్తీస్‌ఘడ్) వంటిది. ఇప్పటికీ ఈ కళారూపానికి ప్రజల్లో మిగిలి ఉన్న ఆదరణ పరిగణనలోకి తీసుకుని విప్లవ కళాకారులు విప్లవ సారాంశంతో చిన్న చిన్న పేటోలు తయారు చేసి ప్రజల్లోకి తీసుకెళ్లారు.

గడ్చిరోలిలో చారిత్రక పరిణామాలపై ప్రభాకర్ (జారు) తాళ్లగూడెం అమరులపై సుఖదేవ్, భూంకాల్ వీరుల స్మృత్యర్థం పాండు రాసిన పేటోలు బాగా ప్రాచుర్యాన్ని పొందాయి. ఇది 2004లో భూంకాల్ వేడుకల సందర్భంగా చాల ప్రచారాన్ని పొందింది. మాడ్‌లో నేటికీ ఇది చాల ప్రదర్శనలు పొందుతున్నది. జనతన సర్కార్ల నిర్మాణంపై, సల్వాజుడుం తెల్ల బీభత్సంపై, గ్రీన్‌హంట్ పై కళాకారులు ఎంతో సమకాలీనంగా పేటోలు రూపొందించి ప్రదర్శిస్తున్నారు. సి.ఎన్.ఎం. మరింత శ్రద్ధతో అధ్యయనం చేసి ఈ కళారూపాన్ని విప్లవీకరించి ప్రదర్శిస్తున్నది.

నూతన సాంస్కృతికోద్యమంలో భాగంగా ఆదివాసీ సంప్రదాయంలో ఉన్న రూపాలతోపాటు నాటికలు, నాటకాలు రచించి ప్రజల దైనందిన సమస్యలు, సారా బలహీనత, హిందూ సంస్కృతి చొరబాటు, మూఢనమ్మకాలు, నిర్బంధం మొదలయిన ఎన్నో అంశాలపై ప్రదర్శిస్తున్నారు.

ఇటువంటి ప్రదర్శనల సందర్భంలో వచ్చే ఎంత చిన్న సమస్యలను ఈ పుస్తకం ప్రస్తావించిందో చూస్తే ఇది ఎంత జాగ్రత్తగా రచించారో అర్థమవుతుంది. ఉదాహరణకు నాటిక, నాటకం నాగరిక సమాజం నుంచి తీసుకున్న రూపం గనుక సారా, కల్లు తాగడాన్ని సీసాతో తాగడంగా చూపుతారు. ఆదివాసీ సమాజంలో సారా దొప్పలతో తాగుతారు. కనుక ఉపయోగించిన వస్తువులోనైనా, లేదా సైగలతో, హావభావాలతో చూసేప్పుడయినా ఆ జీవితం తెలిస్తే తప్ప ఆ మార్పును ప్రవేశపెట్టలేం.

రాను రాను జనతన సర్కార్ పనిచేసే పద్ధతిని సామ్రాజ్యవాద సంస్కృతిని ప్రతిఘటించే పోరాటాన్ని కూడా నాటికలుగా ప్రదర్శిస్తున్నారు. సామ్రాజ్యవాద సంస్కృతి, వస్తు వినియోగ సంస్కృతి ఆదివాసీ జీవితంలో ఎట్లా ప్రవేశించి ప్రమాదకరంగా మారుతున్నదో చెప్పే 'మాడియా' నాటిక ఇప్పుడు చాల ప్రచారంలో ఉంది.

విప్లవ ప్రజానీకం దగ్గరికి విప్లవ సందేశం తీసుక పోవడానికి మౌఖిక కళారూపాలను, దృశ్య కళారూపాలను తీసుకపోవడంలో, అందులోను తెలుగునుంచి, ఇరుగు పొరుగు భాషల నుంచి, మళ్లీ ఆదివాసీ రూపాల నుంచి అభివృద్ధి చేయడంలో ఎందరో అమర కళాకారులు అపార కృషి చేసారని పుస్తకం చదివితే మనకర్థమవుతుంది.

ఇంతే సమర్థంగా మైదాన ప్రాంతాల నుంచి, ముఖ్యంగా తెలుగు నుంచి లిఖిత రూపాలను కూడ దండకారణ్య సాహిత్యోద్యమం గ్రహించి కేవలం దండకారణ్య చరిత్ర రచనకు కాల్పనిక సాహిత్యానికే కాదు మొత్తం ప్రజా చరిత్ర రచనకు ఎంతో దోహదం చేసింది. ఉదాహరణకు 'కర్ణాటక పీపుల్స్ హిస్టరీ' సాకేత్ రాజన్ రెండు సంపుటాల్లో రాయడాని కన్నా ముందే 'అడవి మనదే' అనే దండకారణ్య పోరాట వంద సంవత్సరాల చరిత్రను పి. శంకర్ రాసాడు. ఇది ఆ తర్వాత కాలంలో హిందీలో కూడా అనువాదమైంది. నిజానికిది ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రం కూడా ఏర్పడడానికి ముందు ఇప్పటికి పదేళ్ల క్రితమే పూర్తి చేయబడింది.

చర్చల కాలంలో ఈ పుస్తకాన్ని ఒక ఇంగ్లిష్ పత్రికలో సమీక్షిస్తూ ప్రఖ్యాత సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు గారు ఈ పుస్తకాన్ని మన పాలకులు, ప్రభుత్వం చదువుకుంటే బుద్ధి వస్తుంది అని ప్రశంసించారు.

అట్లే 'సరిహద్దు' (మొదట 'అడవిలో అన్నలు' అనే పేరుతో 'అరుణతార'లో సీరియలైజ్ అయినపుడు జెండర్ దృష్టితో చాల ఆసక్తికరమైన చర్చ జరిగింది.) నవల రాసిన సాధనయే 'రాగో' నవల 1993లో వెలువరించినపుడు తెలుగు కాల్పనిక సాహిత్యం తలతిప్పి చూసింది. ఈ నవలకు ముందుమాటగా బాలగోపాల్ రాసిన 'మనిషి–మార్క్సిజం–చరిత్ర' లేవనెత్తిన 'మానవ స్వభావం' చర్చ ఇంకా సాహిత్యంలో కొనసాగుతున్నది. మార్క్సిస్ట్ దృక్పథం నుంచి ముదునూరి భారతి మధురవాణి నుంచి రాగో దాకా తెలుగు సాహిత్యంలో మహిళా పాత్రలే కాదు, తెలుగు సమాజంలో, భారతీయ సమాజాల్లో మహిళలు వర్గ పోరాటంలో వేస్తున్న ముందడుగు గురించి కూడా చర్చించారు.

అరుణతారలో వస్తున్న మిడ్కో, ఎన్.డి.ల కథలు, పుస్తక రూపంలో వచ్చిన వరలక్ష్మి, బి.డి. దమయంతి రచనలు ఇవ్వాళ మొత్తంగానే తెలుగు సాహిత్యానికి ఉత్తమోత్తమ చేర్పులున్నాయి. వీళ్లే కాకుండా సుజాత, నిత్యా, మైనా, ఫెనెన్స్, జార్, శ్రవణ్, లహర్, విశ్వం, తాయమ్మ కరుణ (దీప) మొదలైనవాళ్లు దండకారణ్య ప్రజల మధ్య పని చేస్తూ వారి జీవితాలను, వారి పోరాట అనుభవాలను, వారితో గల అనుబంధాలను, అనుభూతులను వాస్తవ ఘటనల ఆధారంగా కథలలోకి మలిచారు.

దండకారణ్యంలో కవితా శిల్పానికి అమరుడు మంజీరను స్మరించుకోవాలి. అట్లే ఇవ్వాళ ఎన్.డి. వంటి కవులు కూడా వచన కవితా శిల్పంలో సాధించగల నైపుణ్యానికి దాఖలాగా వస్తున్నాయి. వస్తువయితే వాళ్లు మాత్రమే రాయగల జీవితం, పోరాటమని వేరే చెప్పనక్కర్లేదు.

ఇటీవలి కాలంలో ముఖ్యంగా సల్వాజుడుం విధ్వంసం, హత్యాకాండ మొదలయినప్పటి నుంచీ దండకారణ్యం నుంచి వరలక్ష్మి, శబరి, దమయంతి రాస్తున్న రిపోర్టులు ఎంత సమగ్రంగా, సాంద్రంగా ఉంటున్నాయంటే, రచనా శైలిలో ఢిల్లీ పి.యు.డి.ఆర్. ఆరంభ కాలంలో, అట్లే, సి.పి.డి.ఆర్. పెద్ది శంకర్ ఎన్‌కౌంటర్ అపుడు, ఢిల్లీ పి.యు.డి.ఆర్., ఎ.పి.సి.ఎల్.సి. జగిత్యాలలో 'కల్లోలిత ప్రాంతాలు' ప్రకటించినపుడు తెచ్చిన సమగ్ర నివేదికల స్థాయిలో ఉంటున్నాయి. విషయ ప్రామాణికత, వివరాలు, విశ్లేషణల విషయంలో నెలల తరబడి చేసిన అధ్యయనాలు గనుక వీటికెక్కువ సాధికారత కూడ వస్తుంది.

ఈ అన్నింటికీ శిఖర సమానంగా ఇటీవల వెలువడిన దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర – మనకు తెలియని మన చరిత్ర ఒక అధ్యయనంగా ప్రారంభమైతే – మనకు తెలిసిన ఈ చరిత్ర – ఎట్లా ఒక పోరాట ఆచరణ చరిత్రగా ఆవిష్కరింపబడుతుందో చెప్తుంది. చరిత్రను నిర్మిస్తున్న వాళ్లే చరిత్రను రచించుకుంటే ఎట్లా ఉంటుందో రాగల కాలంలో చరిత్ర నిర్మాతలయిన ప్రజలు ఎటువంటి చరిత్ర రచన చేసి కల్పన కన్నా వాస్తవం గగుర్పాటు కలిగించేదిగా ఉంటుందని రుజువు చేయగలరో దాఖలాగా ఉంది. ఆ కోవలోనిదే ఈ సాహిత్య సాంస్కృతికోద్యమ చరిత్ర.

# నిత్యజీవితంలో సోషలిజం పనితీరు – అధ్యయన ప్రణాళిక

## సన్నాహక సమావేశం, అక్టోబర్ 23, 2010, హైదరాబాద్

'నిత్య జీవితంలో సోషలిజం పనితీరు' ప్రాజెక్ట్ సన్నాహక సమావేశం 23 అక్టోబర్ 2010న, మధ్యాహ్నం 3 గంటల నుంచి సి.డి.ఆర్.సి. – వీక్షణం కార్యాలయంలో జరిగింది.

మొట్టమొదటగా ఈ అధ్యయన ప్రణాళికను ఎందుకు చేపట్టారో ఎన్. వేణుగోపాల్ వివరించారు. రెండుపేజీల అధ్యయన ప్రణాళిక ఆలోచనలను సమావేశానికి వచ్చినవారికి అందజేశారు. చదివి వినిపించారు.

సోషలిజం విఫలమయిందనీ, పనికిరాదనీ, కాలం చెల్లిందనీ, ఇంకా సోషలిజం గురించి మాట్లాడడం చాదస్తమనీ, అనేక విమర్శలు వెలువడుతున్న దృశ్యం ఒకవైపున ఉండగా, తమ సమాజాలలోని అసమానతలను రద్దుచేసి సోషలిస్టు వ్యవస్థలను నెలకొల్పుకోవాలనే ఆకాంక్షతో ఎన్నో దేశాలలో ప్రజలు అనేక రూపాలలో చేస్తున్న పోరాటాలు, త్యాగాలు మరొకవైపున ఉన్నాయి. సోషలిజం అనే ఆదర్శం ఇవాళ్టికీ మానవజాతి సమానతా స్వప్నంగా మిగిలే ఉన్నది. ఆ రాజకీయ వివాదాలన్నిటినీ అలా ఉంచి అసలు సోషలిజం అమలయిన క్రమంలో మామూలు మనుషుల జీవితాలలో వాస్తవికంగా ఏం జరిగిందో వెలికితీసి, సోషలిజం ఎందువల్ల ఉత్తమమైన సామాజిక వ్యవస్థ అవుతుందో చెప్పాలని సి.డి.ఆర్.సి. డైరెక్టర్ బి.ఎస్. రాజు ఒక ఆలోచన చేశారు. అందుకోసం ఒక వివరమైన, సమగ్రమైన పరిశోధన, అధ్యయనం చేయాలని ప్రతిపాదించారు. ఆ అధ్యయనంలో రాజకీయ, ఆర్థిక వివాదాల జోలికి పోకుండా ప్రధానంగా ఆయా సోషలిస్టు ప్రయోగాల నిర్మాణాల క్రమంలో మామూలు మనుషుల జీవితాలలో, రోజువారీ అంశాలలో ఏ మార్పులు వచ్చాయి, ఆ మార్పులలో ఏవి ప్రగతిశీలమైనవి, మానవజాతి సమానతా స్వప్నానికి అనుకూలమైనవి, ఏ కార్యక్రమాలవల్ల మానవజీవితం మెరుగుపడింది, ఎందువల్ల అది విఫలమయింది అని చిన్న చిన్న సాధారణ అంశాలతో అధ్యయనం చేయాలని ఈ ఆలోచన.

ఈ ప్రాజెక్ట్ గురించి చర్చించే ముందు కొన్ని వివరాలు పంచుకోదలిచామనీ. ఆ తర్వాత ఈ ప్రణాళికను విస్తృతం చేయడానికి మీ సూచనలను, సలహాలను, సహకారాన్ని కోరుతున్నామనీ సమావేశంలో పాల్గొన్నవారికి తెలిపారు. దీనిపై చర్చ జరిగింది. చర్చలో రమేష్ పట్నాయక్, ఆర్. సుబ్బారావు, ఎ. నర్సింహారెడ్డి, వరవరరావు, కె. బాబురావు, బి.ఎస్. రాజు, పి. ప్రసాద్, ఆర్.వి. రమణమూర్తి, కె. లక్ష్మీనారాయణ తదితరులు పాల్గొన్నారు. ఈ ప్రాజెక్ట్‌పై అందరూ ఆసక్తిని కనబరిచారు. ఎన్నో సలహాలూ, సూచనలూ చేశారు. దీనికి కావాల్సిన సహాయ, సహకారాలను అందజేస్తామన్నారు. ఈ ప్రాజెక్ట్‌పై రాబోయే సమావేశంలో మరింత విస్తృతంగా చర్చించాలని అభిప్రాయపడ్డారు. వీ

దండకారణ్యంలో వెలువడుతున్న పత్రికల గురించి ఒక దినపత్రికలో చదివిన వార్తతో ఈ పుస్తక పరిచయం ప్రారంభించాను. ముగించే ముందు ఈ పత్రికల గురించిన సాధికార సమాచారం గురించి ప్రస్తావించాలి.

దండకారణ్య సాంస్కృతికోద్యమ నిర్మాణంలో 'ఝుంకార్' పత్రిక ఒక సార్థకమైన భూమికను పోషిస్తున్నది. దండకారణ్య రచయితల పత్రికగా 1995లో ప్రారంభమైన ఈ పత్రిక ఇపుడు చేతన నాట్యమంచ్ అధికార స్వరమైంది. దండకారణ్య ఉద్యమానికి, చేతన నాట్యమంచ్ నిర్మాణానికి, ఝుంకార్‌కు, భారత విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమానికి అమరురాలు అనురాధ గాంధీ చేసిన సేవలకు గుర్తింపుగా ఆమెకి అంకితమైన 'ఝుంకార్' ప్రత్యేక సంచిక ఒకటే వెలువడింది. ఇది ఇపుడు తెలుగు, హిందీ, మరికొన్ని ఆదివాసీ భాషల్లో కూడా వెలువడుతున్నది.

ఇంకా ఈ పుస్తకంలో ఇతర ప్రచార సాధనాల గురించి, అంటే ఆధునిక, సాంకేతిక విజ్ఞానాన్ని కూడ ఉపయోగించుకొని వెలువడుతున్న ఆడియో, వీడియో క్యాసెట్స్ గురించికూడా చాల సమాచారాన్ని ఇచ్చింది.

నిర్మాణ స్వరూపాన్ని వివరించింది. సాహితి, కళారంగాలలో శిక్షణ, వర్క్‌షాప్‌ల సమాచారాన్నిచ్చింది. వర్తమాన పరిస్థితుల్లో ఎదుర్కొంటున్న సవాళ్లను వివరించింది. ఇంత సమగ్రమయిన పుస్తకాన్ని మళ్లీ ఎత్తిరాస్తే తప్ప పరిచయం చేసిన తనివి తీరదు.

ఈ పుస్తకం చదివితే నాకనిపించిన విషయాలు – ఈ సాహిత్యానికి ఎప్పటికప్పుడు బయట మనం చేయవలసిన ప్రచారంలో చాల వెనుక బడుతున్నామని. వాస్తవానికి ఎంతో వినయంగా వాళ్లు పత్రికల విషయంలో రాసినపుడు తమ అల్ప సంతోషాన్ని వ్యక్తం చేసారు.

'ఈ పత్రిక (ఝుంకార్) గురించి చెప్పుకునే ముందు ఆంధ్రప్రదేశ్ విప్లవ రచయితల సంఘం అధికార పత్రిక అరుణతార, వరంగల్ నుంచి 1980వ దశాబ్దం చివర వరకు సాహితీ మిత్రులు వెలువరించిన సృజన పత్రికలో గుర్తు చేసుకోవడం, ఈ సందర్భంగా ఆ పత్రికలకు విప్లవాభివందనలు తెలియజేయడం అవసరం. దండకారణ్య ఉద్యమాన్ని, రచయితలను, రచనలను ప్రోత్సహించడానికి అవి గొప్పగా తోడ్పడినాయి. ఇప్పటికీ ఝుంకార్ పత్రిక విరసం వారికి అందినపుడు అందులో నుంచి ఎంపిక చేసుకున్న రచనలను తమ అరుణతార పత్రికలో వేసి దండకారణ్య ఉద్యమాన్ని ప్రచారం చేయడంలో తమ వంతు బాధ్యత వారు నిర్వహిస్తున్నారు' అని రాసుకున్నారు. కాని నిజానికిది చాలదు. ఇది దండకారణ్య సాహిత్య సాంస్కృతికోద్యమం గురించి కన్న మన విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమం కాలంతోపాటు నడవడానికి చాలా అవసరం. మనం సమకాలీన పోరాట చరిత్రకు ఎంత వెనుకబడి ఉండి, మనం బుద్ధికి పదనుపెట్టుకోవాల్సిన సాహిత్యం, కళలు, సంస్కృతి ద్వారా కాకుండా బయటి బూర్జువా ప్రచార సాధనాలతో, మీడియాతో సాంస్కృతిక రూపాలతో ప్రభావితులమై, ప్రలోభపడి పతనమవు తున్నామో గ్రహించడానికి కూడ చాలా అవసరం.

1993లో హైదరాబాద్‌లో అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి (ఎ.ఐ.ఎల్.ఆర్.సి.) దశాబ్ది ఉత్సవాలు జరిగినపుడు దండకారణ్య రచయితలు 'దండకారణ్య సాహిత్యోద్యమం – పరిశీలన' అని ఒక ఇరవై పేజీల పొత్తం వెలువరించి సంఘీభావంగా పంపించారు.

ఇప్పుడది రెండు వందల పేజీలుగా పదిరెట్లు కావడమే కాదు, రెండు దశాబ్దాల్లో అది గుణాత్మకంగా ఎదిగింది.

వాళ్లకిప్పుడు కవిత్వం, కథలు, వ్యాస రచన మొదలైన విషయాల్లో వర్క్‌షాపులు నిర్వహించగల విప్లవ సాహిత్య నిపుణులు కావాలి. ఆ క్రమంలో వాళ్ల నుంచి మనం నేర్చుకోగల ఎంతో ఉన్నతమైన ప్రజాకళ, సాంస్కృతిక రూపాలు వాళ్లనుంచి మనం పొందవచ్చు.

నవంబర్ 21న భువనేశ్వర్‌లో ఒడిషాలోని ఆదివాసీ సంఘటనల కళా సాంస్కృతిక ప్రదర్శనలు దినమంతా చూసిన తన్మయత్వంలో ఈ పుస్తకం చదువుతుంటే – ఇది కేవలం పఠనం కాదు, ఒక విప్లవ సాంస్కృతిక అనుభవం – అనుభవైక సేద్యమైన పోరాట సాంస్కృతిక ఆచరణ అని అనిపించింది.

*(రచయిత విరసం సభ్యులు)* వీ

*మానవ ప్రేమికుడిగా వివేకానందుడి వ్యక్తిత్వాన్ని విశ్లేషించే రాజేశ్వరరావు పుస్తకాన్ని, ఆదివాసుల జీవితాన్ని హృద్యంగా చిత్రించిన వనవాసి నవలను, తప్పక చదవాల్సిన పుస్తకాలుగా పరిచయం చేస్తున్నారు* **వి. హనుమంతరావు**

# చదవాల్సిన పుస్తకాలు

కుల మతాలు దేశాన్ని, ప్రజల ఐక్యతను ఎలా విచ్ఛిన్నం చేస్తున్నాయో, హిందూత్వం అనే పేరుతో హిందూ మతాన్ని భారతీయతగా ఎలా చలామణీ చేస్తున్నారో, కుల మతాల పేరుతో దళిత, వెనుకబడిన వర్గాలకు ఎలా అన్యాయం జరుగుతోందో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు ఎప్పుడో నలభై సంవత్సరాల క్రితం రచించిన పుస్తకం ఒక మిత్రుని చేతిలో చూసి తీసుకొని, చదివి, ఏమిటిది కమ్యూనిస్టు నాయకుడు రాసిన పుస్తకమేనా అని ఆశ్యర్చపోయా. ఆయన నమ్మిన కమ్యూనిస్టు సిద్ధాంతాలకు దన్నుగా ఉదహరించిన వ్యక్తి వివేకానందుడు కావడం, నేను బెంగుళూరు సమీపంలో ఉన్న వివేకానంద ఆరోగ్యాశ్రమంలో పద్దెనిమిది నెలల పాటు ఉండడంతో, కమ్యూనిస్టులు వివేకానందుణ్ని ఏ దృష్టికోణంతో చూశారో అని ఆసక్తికరంగా చదివా. చదివిన తర్వాత భారతదేశంలో మొట్టమొదటి కమ్యూనిస్టు వివేకానందుడా అని అనిపించింది. హిందూ మత ఛాందసులు ఆయనను ఒక మత ప్రచారకునిగా, గొప్ప దైవభక్తునిగా, హిందూ మతాన్ని ఉద్ధరించిన స్వామిజీగానే చిత్రిస్తూ వచ్చారు. ఆయనలోని దేశభక్తిని, మానవతను, పేద ప్రజల ఉద్ధారకునిగా తన ఉపన్యాసాలు ద్వారా ఎలా ప్రచారం చేస్తూ వచ్చారో రాజేశ్వరరావు ఆయన ఉపన్యాసాలు, రాతల నుంచి సేకరించారు. 'మన ప్రాచీన సంస్కృతి, నాగరికతలకు తామే వారసులమంటూ బిజెపి నాయకులు ఎలా వక్రభాష్యం చేస్తున్నారని ఒక విశాల హృదయం ఉన్న, మహోజ్వల భావాలు కల వివేకాందుని ఆ పార్టీ నాయకులు ఎంత హ్రస్వ దృష్టితో చూస్తున్నారో కాలదోషం పట్టిన, శిథిల జీర్ణావస్థలో ఉన్న దానినంతను ఎలా నెత్తినెక్కించు కొంటున్నారో హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొట్టి, తమ రాజకీయ అవసరాలకు ఉపయోగించుకొంటున్నారో" అంటూ తీవ్ర విమర్శ చేశారు. రాజకీయా జోలికి పోకుండా వివేకానందుని దేశభక్తిని గురించి రాజేశ్వరరావు ఏమిరాశారో, ఎలా అంచనా వేశారో ఈ పుస్తకంలో చూడవచ్చు–

"అన్ని మతాల అంతిమ లక్ష్యం 'పరమసత్యం' అన్న దానిని కనుగొనడమేనని – ఈ అంతిమ లక్ష్యాన్ని ఏ మతం ద్వారా అయినా సరే, అది హిందూ, ఇస్లాం, క్రైస్తవ మతాల ద్వారా అయినా, ఏ ఆరాధనా పద్ధతుల ద్వారా అయినా సరే సాధించవచ్చుని" రామకృష్ణ పరమహంస ప్రభోదించిన ఉదారవాద సిద్ధాంతాలతో వివేకానందుడు ప్రభావితు డయ్యాడు. ఈ పరమ సత్యం ఏమిటో కనుగొనడానికి చేసిన దేశ పర్యటనలో ప్రజల నికృష్ట జీవితాన్ని, దుర్భర స్థితిగతులను స్వయంగా చూసి వారికి విముక్తి కలిగించాలనే సంకల్పం ఆయనకు కలిగింది. 'మతం అంటే ఆయన దృష్టిలో ఒక సాధనం, ఒక వాహిక. దేశంలోని లక్షలాది శ్రామిక ప్రజలను చైతన్యపరచి ఉత్తేజపరచడానికి ఒక మార్గం మాత్రమే'నని రాజేశ్వరరావు అభిప్రాయపడ్డారు.

నిజమైన దేవుడెవరు అని ప్రశ్నించుకొంటూ వివేకానందుడు ఒక యువజన సభలో ప్రసంగ సందర్భంలో 'భౌతిక నాగరికత, చివరకు సుఖ భోగాలు అన్నవి కూడా అవసరమే. అవి సృజించడం కోసం పేదవారికి పని కల్పించడం జరుగుతుంది. ఈ భౌతిక ప్రపంచంలో నాకు ఆహారం ఇవ్వని దేవుణ్ని నేను నమ్మజాలను. స్వర్గంలో సర్వ సౌఖ్యాలు ఇస్తాడన్న దేవుణ్ని అసలే నమ్మలేను. అందుకోసం భారతదేశం లేచి నిలబడాలి. పేద ప్రజలకు ఇంత అన్నం పెట్టాలి. విద్యను వ్యాప్తి చేయాలి. పురోహిత వర్గాలు సాగించే మంత్రతంత్రాల దౌర్భాగ్యాన్ని మట్టుపెట్టాలి. ఆహారం సమృద్ధిగా ఉండాలి. అందరికీ అన్ని అవకాశాలు కల్పించాలి' అని చేసిన ప్రభోదాన్ని ఆ పుస్తకంలో ఉటంకించారు. సమాజంలో ఆధునికులమని శ్రమ జీవులను చిన్న చూపు చూసే వారినుద్దేశిస్తూ వివేకానందుడు 'పేద ప్రజానికమే ఈ దేశానికి వెన్నముకవంటి వారు... అట్టడుగున ఉన్న ప్రజానీకం గనుక పని చేయడం మానివేస్తే మీరు తినే తిండి, మీరు కట్టే బట్ట ఎక్కడి నుంచి ఊడిపడతాయి? ఒక్కరోజు కలకత్తాలో పాకీపని వారు పని మానివేస్తే భయోత్పాతం చెలరేగుతుంది. వారు కనుక మూడు దినాలు పని మానివేస్తే ఈ మహానగరం అంతా వ్యాధులతో అనతి కాలంలోనే నిర్మానష్యమౌతుంది. వీళ్లనే మీరు పాటకపుజనం అని నీచంగా పిలుస్తూ నిరసిస్తారు. మీ సంస్కృతి గురించి గొప్పలు చెప్పుకుంటారు' అని తన నిరసనను తెలియజేశారు.

వివేకానందుడు ఆనాడే ఇలా హెచ్చరించాడు– 'ఇప్పుడు కాలం మారిపోయింది. ఈ అట్టడుగున ఉన్న ప్రజానీకం క్రమంగా మేల్కొని ఈ సత్యాన్ని తెలుసుకోవడానికి వ్యతిరేకంగా ఒక ఐక్య సంఘటనను ఏర్పరచుకొంటున్నారు. ఈ విధంగా మేల్కొనిన వారిలో యూరోప్, అమెరికాలకు చెందిన ప్రజానీకం కూడా ఉన్నారు. భారతదేశంలో కూడా ఈ చైతన్య రేఖలు ప్రారంభమయ్యాయి. ఇటీవలి కాలంలో జరుగుతున్న అనేక సమ్మెల రూపంలో ఈ చైతన్యం వ్యక్తమవుతుంది. సమాజంలో ఉన్న ఉన్నత వర్గాలు ఇక ఎంతమాత్రం ఈ అట్టడుగున ఉన్న ప్రజానీకాన్ని అణచి ఉంచలేరు. ఎంత ప్రయత్నించినా ఇది సాగదు' అని అన్నారు. అచ్చం కమ్యూనిస్టు నాయకుని ఉపన్యాసంలా లేదూ?

మన దేశంలో 'సోషలిజం' అనే మాట రష్యాలో విప్లవానంతరం వింటూ వచ్చాం. కాని అంతకు చాలా ముందు కాలంలోనే వివేకానందుడు 'నేను ఒక సోషలిస్టును. అయితే సోషలిజం అన్నది ఒక సర్వ సమగ్ర విధానంగా నేను భావించడం వల్ల కాదు. ఏ మాత్రం అన్నం లేని పరిస్థితులలో గుప్పెడు మెతుకులు ఉన్నప్పటికీ అది మంచిదే కదా' అని వివేకానందుడు అన్నారు. స్వామిజీ తనదైన విశిష్ట పద్ధతిలో సోషలిజాన్ని 'శూద్రరాజ్యం' అన్నారు. (శ్రమ చేసే వారే శూద్రులు. అందుచేత శూద్రరాజ్యం అంటే వివేకానందుని దృష్టిలో 'శ్రమజీవుల రాజ్యం' అన్నమాట.) సామాన్య ప్రజల శక్తి సంపన్నతల గురించి తన ఆలోచనలను ప్రజలతో పంచుకొన్న వివేకానందుడు 'భారత దేశానికి గల ఒకే ఒక పెన్నిధి, ఆశా రేఖ దేశంలోని జన సామాన్యమే. సంపన్న వర్గాల వారు భౌతికంగా, మానసికంగా మరణించారు' అనే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ, ఆయన ఏమన్నారో చూడండి.

'మేము ఆర్య సంతతికి చెందిన వారని గొప్పలు చెప్పుకోవచ్చు... గొప్ప గొప్ప వంశాల్లో జన్మించామని గర్వపడవచ్చు. ఓ భారత కులీనులారా, మీరు బతికే ఉన్నామని అనుకొంటున్నారా? మీరు చచ్చిన శవాల వంటి వారు... రక్తమాంసాలు లేని కంకాళాలుగా గత భారత దేశపు మృత జీవులుగా ఉన్న మీరు దుమ్ము, ధూళిలో కలిసిపోక ఇంకా ఎందుకున్నా రయ్యా? పొండి, శూన్యంలోకి కలిసిపోండి. అదృశ్యమైపోండి. మీ స్థానంలో ఒక నవ భారతదేశం ఉద్భవించనివ్వండి' అని అన్నారంటే వివేకానందుడు ఎంత ఉద్వేగంతో, ఎంత తీవ్ర అసహ్యభావంతో శిథిల ఫ్యూడల్ వ్యవస్థ హైన్యాన్ని, నైచ్యాన్ని అభివర్ణించారో గమనించగలం. ఈ భావాలనే మిస్ మేరీకి రాసిన లేఖలో వ్యక్తం చేస్తూ 'బ్రిటిష్ పరిపాలన దేశంలో కొన్ని వందల మంది ఆధునికులమనుకొనే వారిని, మిడిమిడి జ్ఞానం కలిగినవారిని విజాతీయ భావాలు కలిగిన వారిని మాత్రమే తయారు చేసింది. భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన అనేక ఘోరమైన కరువు కాటకాలను సృష్టించింది. అందువలన లక్షలాది భారత ప్రజలు మరణించారని' తన ఆగ్రహం వ్యక్తం చేశారు. ఇలాంటి దేశభక్తుని ఛాందస హిందూ మతం పరిమితుల్లోకి కుదించడం ఘోరమైన నేరమని రాజేశ్వరరావు అన్నారు. ఆయన వివేకానందుడు ప్రవచించిన విషయాలన్ని వినయ్ కె. రాయ్ సేకరించిన 'వివేకానంద సామాజిక, రాజకీయ అభిప్రాయాలు' అనే పుస్తకాన్ని ప్రచురించగా అందు నుంచి రాజేశ్వరరావు ఉటంకించారు. రాజేశ్వరరావు తన వ్యాసాన్ని ముగిస్తూ 'స్వామి వివేకానంద అకుంఠితమైన దేశభక్తుడు. సాంఘిక విప్లవ వాది, మత సామరస్య ప్రబోధకుడు. మతం గురించి స్వతఃసిద్ధమైన యోచనాపరుడు' అని అన్నారు.

కుల వ్యవస్థ భారతదేశ సర్వతోముఖాభివృద్ధికి పెద్ద ఆటంకం అని రాజేశ్వరరావు అంటూ 'ఆర్యులు మన దేశంలోకి రావడంతో ఏర్పడిన వర్ణ వ్యవస్థ ఘనీభవించి క్రీస్తు శకం 200, 400 సంవత్సరాల నాటికి కుల వ్యవస్థగా మారిపోగా, దేశాన్ని కుల వ్యవస్థ అనే ఉక్కు చట్రంలో మనుస్మృతి బిగించిందని, కుల వ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలను విశ్లేషించారు. ఆర్యులకు లొంగకుండా ఉన్న ప్రజలు కొందరు అడవులు, కొండల్లోకి పోయి తలదాచుకొన్న వారే నేటి గిరిజనులని, అలా పోకుండానే వర్ణ కులవ్యవస్థల్లో ఇమడలేని వారు ఊరు బయట అంటరాని వాళ్లుగా పరిగణించి వారికి నీచమైన వృత్తులు కల్పించ బడ్డాయని ఆయన అభిప్రాయం. వేల సంవత్సరాల నుండి ప్రజల్లో నరనరాన జీర్ణించుకపోయిన కుల తత్వాలు భావాలు మనస్సులో నుండి తొలగించడం తేలిక కాదు. రాజకీయ పార్టీలు కులతత్వాలను సంకుచిత రాజకీయ అవసరాల కోసం వాడుకోవడం, ఎన్నికల్లో కులాల వారీగా అభ్యర్థుల ఎంపిక, ఓట్ల సేకరణ జరగడం మనం చూస్తున్నాం. ఏ కులం ఆధారంగా చిరంజీవి రాజకీయాల్లో ప్రవేశించారో అందరికీ తెలిసిన విషయమే. ఈ విషయాన్ని రాజేశ్వరరావు ప్రస్తావిస్తూ, 'నేడు భారతదేశంలో కులాలు, వర్గాలు ఓవర్‌లాప్ అయిన మాట వాస్తవం. అయినా కులాన్ని, వర్గాన్ని ఒకటిగానే చూడడం సరికాదు' అని అన్నారు. వికృతరూపంలో పెట్టుబడిదారీ విధానం పెరుగుతున్న ఈ రోజుల్లో విలువలు వెనుకపట్టు బడుతున్నాయని 'ధనం మూలం మిదం జగత్' అనే విలువ ముందుకు వచ్చి, ప్రతీదానికి మంత్రాలు, కట్నాలు, కానుకలు, పిల్లలకు ఉయ్యాలలు, అన్నప్రాసన పెద్ద ఎత్తున ధనిక వర్గాలు చేయడం జరుగుతున్న విషయాన్ని ప్రస్తావించి 'మన పార్టీ దురాచారాలకు వ్యతిరేకంగా ప్రజల్లో చైతన్యం కలగజేసే ప్రయత్నం సన్నగిల్లింది. అందుచేత వీటి ప్రభావం పూర్తిగా కాకపోయినా, గమనింపతగిన మోతాదులో మన పార్టీ మీద పడుతుంది. కొంతమంది కామ్రేడ్స్ వీటిల్లో మునిగిపోయి సతమతమవుతున్నారు. భార్య, పిల్లల్లో చైతన్యాన్ని కలుగజేయడానికి బదులు వారి ఒత్తిళ్లకు లొంగిపోతున్నారు.

సాంఘిక దురాచారాలకు, దుబారా ఖర్చులకు లోనై పార్టీ పని కుంటుపరచడం జరుగుతున్నది. వంద సంవత్సరాల క్రితం మూఢ నమ్మకాలు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఒంటరిగా వీరేశలింగం పోరాడి నెగ్గారు. కాని మనం ఇంత పెద్ద పార్టీ ఉన్నా, ఈ మహనీయుని కన్నా వెనుకబడి ఉండడం సబబా అని ప్రశ్నించుకోవాలి అని ఆత్మవిమర్శనా పూర్వకంగా ప్రశ్నించారు. ఆయన చేసిన మరో ఆత్మవిమర్శ ఏమంటే, 'మనం ఆర్థిక రాజకీయ పోరాటాలు సాగించితే నేటి ఆధునిక యుగంలో కుల వ్యవస్థ క్రమంగా బలహీనపడి అంతరిస్తుందని ఆశించిన వారు' అంటూ తప్పు పట్టారు. ఆయన ఈ సందర్భంలో డా. అంబేద్కర్‌ను ఉదహరిస్తూ ఆయన 'సాంఘిక న్యాయాన్ని ముందు పెట్టి పోరాడారు. కుల వ్యవస్థ నిర్మూలిస్తే గాని దళితులకు విముక్తి కలగదనే నిర్ణయానికి వచ్చారు' అంటూ ఆయనకు నివాళులర్పించారు.

మతం సామరస్యతకు ముస్లిం సూఫీల, హిందూ సాధువుల ఆదర్శ కృషిని రాజేశ్వరరావు శ్లాఘిస్తూ ఈ సామరస్యతా సాధన క్రమంలో సంత్ కబీర్‌ది ప్రత్యేక స్థానం అని కొనియాడారు. అలాగే హిందూ సాధువులు నానక్, నామ్‌దేవ్, తుకారాం, రామానంద్ వంటి భక్తులు మధ్యయుగంలోనూ, ఆధునిక యుగంలోనూ మత సామరస్య పరిరక్షణలో రాజా రామ్మోహన్ రాయ్, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, మహాత్మాగాంధీ ప్రభృతులు ఆదర్శనీయమైన పాత్ర వహించిన విషయాన్ని పేర్కొన్నారు. అలాగే మొఘల్ చక్రవర్తులలో అక్బర్, షాజహాన్ వంటి కొందరు, గోల్కొండ నవాబులైన కుతుబ్‌షాహీలు ఈ సామరస్య ధోరణులకు క్రియాశీలమైన ప్రోత్సాహం ఇచ్చిన విషయాన్ని గుర్తు చేశారు. మొఘల్ యువసామ్రాట్ దారాషుకూ మత సామరస్యంలో ప్రగాఢ విశ్వాసమున్నవాడని, 'ఇస్లాం బోధనల సారమైన అద్వైతం భారతీయ ఉపనిషత్తుల్లోనే వ్యక్తమవుతుందని చెప్పి, వాటిలో పెక్కు భాగాలను పర్షియన్‌లోకి అనువదింప చేసాడ'ని కొనియాడారు. బాబ్రీ మసీదు వివాదం పూర్వరంగాన్ని రాజేశ్వరరావు ఉదహరించారు. 'హిందూ మతతత్వ వాదులు కొందరు ఈ నిర్మాణాల్లో కొన్ని హిందూ దేవాలయాల శిథిలాలపై కట్టినట్లు ఆరోపిస్తున్నారు... ఇదే వరసన చెప్పాలంటే బౌద్ధమందిరాలెన్నో విధ్వంసం చేయడమో, హిందూ ఆలయాలుగా మార్చడమో జరిగిపోయాయి. గౌతముడు 'బుద్ధు'డైన బౌద్ గయలోని బౌద్ధ ఆలయం మట్టి కుప్పలో కప్పబడి అదృశ్యమైంది' అంటూ చారిత్రక సంఘటనలను ఉదహరించారు. 'పచ్చి మతతత్వ హిందూ ఛాందస వర్గాలు మత విద్వేషాలను రెచ్చగొట్టి ఏమి సాధించదలచుకొన్నాయి? మత కలహాల వల్ల, రక్తపాతం వల్ల సమైక్యత విచ్ఛిన్నం, సెక్యులర్ ప్రజాతంత్ర వ్యవస్థ విధ్వంసం, ప్రపంచ ప్రజల దృష్టిలో మన దేశ ప్రతిష్ట మంటగలపడం తప్పించి ఈ ధూర్త వర్తనం ఎందుకుపయోగపడేటట్లు?' అని ప్రశ్నించారు.

రాజేశ్వరరావు రాసిన వ్యాసాల సంకలనం ఈ పుస్తకం, నవయుగ వైతాళికులు సురవరం ప్రతాపరెడ్డి రాసిన వ్యాసాల విశ్లేషణ కూడా చేర్చి ప్రచురించిన 37 పేజీల పుస్తకం జూన్ 2003లో ప్రచురితమైనా, ఆ వ్యాసాలు అంతకు చాలా ముందు కాలం నాటివి. దేశ చరిత్రను ఎంతో లోతుగా అధ్యయనం చేసినట్లు ఈ వ్యాసాలు స్ఫురింపజేస్తాయి. ఈ పుస్తకం ఇవాళ దొరకకపోవచ్చుననే ఉద్దేశంతో ఆయన వ్యాసాలను సుదీర్ఘంగా కోట్ చేయడం జరిగింది.

**వనవాసి**

ఇటీవలి కాలంలో ఆదివాసుల గురించిన వార్తలు పత్రికల్లో ప్రముఖంగా చోటు చేసుకొంటున్న నేపథ్యంలో హైదరాబాద్ బుక్ ట్రస్ట్‌వారు పునఃప్రచురించిన 'వనవాసి' పుస్తకం తప్పకుండా చదవ దగినది. ఎప్పుడో 1961లో ఈ పుస్తకం ప్రచురించబడింది. ఇది పునః ప్రచురణ.

# ముదునూరి భారతి, ఆర్.ఎస్. రావుల పుస్తకాలపై చర్చాగోష్టి

## శుక్రవారం, 12 నవంబర్ 2010, హైదరాబాద్

ముదునూరి భారతి పరిశోధనా పత్రాలు, వ్యాసాల పుస్తకాలపై, ఆర్.ఎస్. రావు వ్యాసాల పుస్తకాలపై చర్చ 12 నవంబర్ 2010న హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ, పొలిటికల్ సైన్స్ విభాగం, సెమినార్ హాల్‌లో, మధ్యాహ్నం 2 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు జరిగింది. ఈ చర్చా సమావేశంలో విద్యావేత్తలు, సెంట్రల్ యూనివర్సిటీ ప్రొఫెసర్లు, రిసర్చ్ స్కాలర్లు, మేధావులు, వివిధ రంగాలకు చెందిన వారు ఎనభై మందికి పైగా పాల్గొన్నారు.

ముదునూరి భారతి అయిదు ఇంగ్లిష్ పుస్తకాలు – 'ఇన్ సర్చ్ ఆఫ్ మెథడ్, క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్ ఇన్ మార్క్సియన్ ఫ్రేంవర్క్', 'మెథడాలజీ ఆఫ్ సోషల్ ఎన్‌క్వైరీ', ఇండివిడ్యువల్, సబ్‌గ్రూప్స్, గ్రూప్స్ అండ్ ఫ్రీడం', 'ఆన్ ఎడ్యుకేషన్' (ఆర్.ఎస్.రావుతో కలిసి), తెలుగులో 'అభివృద్ధిని ఇలా చూద్దాం' (వ్యాస సంకలనం), ఆర్.ఎస్. రావు 'కొత్తచూపు' (వ్యాస సంకలనం) పుస్తకాలపై చర్చ జరిగింది.

ఇంగ్లిష్ పుస్తకాలు బి1 కలెక్టివ్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సి.డి.ఆర్.సి.)లు సంయుక్తంగా ప్రచురించాయి. తెలుగు వ్యాస సంకలనాలను వీక్షణం పబ్లికేషన్స్ ప్రచురించింది.

ఇంగ్లిష్ పుస్తకాలపై సెషన్‌కు ఆర్. కవితారావు అధ్యక్షత వహించారు. ఇంగ్లిష్ పుస్తకాలపై మాట్లాడినవారిలో ఎస్.జి. కులకర్ణి (హెడ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫిలాసఫీ, యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్), శశీజ్ హెగ్డే, యివటూరి రామబ్రహ్మం, డి. నర్సింహారెడ్డి (రిటైర్డ్ ఎకనామిక్స్ ప్రొఫెసర్, యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్), జి.ఎన్. రావు, కె. చిన్నయ సూరి, శివలింగ ప్రసాద్, జి. హరగోపాల్, పి.కె. త్రిపాఠి (ఎకనామిక్స్ ప్రొఫెసర్, సంబల్‌పూర్ యూనివర్సిటీ), జి. నాంచారయ్య, ఎ. నర్సింహారెడ్డి తదితరులు ఉన్నారు.

తెలుగు పుస్తకాల సెషన్‌కు ఎన్. వేణుగోపాల్ అధ్యక్షత వహించారు. తెలుగు పుస్తకాలపై మాట్లాడిన వారిలో సి.ఎస్.ఆర్. ప్రసాద్, వి. శ్రీనివాస్, ఎం. రాఘవాచారి, వై. రామచంద్రం, డి.వి. రామకృష్ణారావు, వరవరరావు తదితరులు ఉన్నారు. శనిగరం సత్య పాటతో సమావేశం ముగిసింది. వీ

బిభూతి భూషన్ బంధోపాధ్యాయ రచించగా సినిమా రూపంలో వచ్చిన 'పథేర్ పాంచోలీ' తర్వాత ఆయన రచించిన రచన ఇది. నానాటికీ అంతరించి పోతున్న అరణ్యాలు, కనుమరుగైపోతున్న వన జీవనం గురించి ఇంతటి హృద్యమైన అనుభూత్యాత్మక రచన మరోటి మన సాహిత్యంలో అరుదని చెప్పవచ్చు. పథేర్ పాంచోలీలో గ్రామీణ జీవితాలను చిత్రించగా, అడవుల్లో నివసించే ఆదివాసుల కథ 'వనవాసి'. బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా అజ్ఞానంలో, కటిక దారిద్ర్యంలో నివసించే ప్రజల్లో ఉద్యోగరీత్యా వెళ్లిన యువకుడు చూసి, అనుభవించి, ఆ అనుభవాలను ఈ నవల మన కళ్లముందు సాక్షాత్కరింప చేసారు బంధోపాధ్యాయ. వంద సంవత్సరాల క్రితం భారత భూభాగంలో నలభై శాతం ఆక్రమించుకొని ఉన్న అడవులు 1997 నాటికి 19 శాతానికి తగ్గి అడవులు అంతరించిపోతున్న పరిస్థితి. ఇది అభివృద్ధి పేరుతో జరుగుతున్న వాస్తవం, చేదు నిజం. అరణ్యాలిలా అంతరించిపోతుంటే, ఆ అటవీ ఉత్పత్తుల మీద ఆధారపడి జీవించే ఆదిమవాసుల సంక్షేమం ప్రశ్నార్థకమయి పోతుంది. వారి జీవితాలే ప్రశ్నార్థకమైపోతుంటే అదేమీ అభివృద్ధి? అలాంటి ప్రజలను నిర్వాసితులను చేసే అభివృద్ధి అభివృద్ధే కాదు, కానే రాదు. ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ ప్రజల జీవితాలను సంక్షోభంలో పడివేస్తున్న సందర్భంలో స్వచ్ఛమైన ప్రాణవాయువును, అతి స్వచ్ఛమైన అరణ్య వృక్షాల మీద నుంచి 'సభ్య సమాజపు' నాగరికత సోకని అరణ్య వాసుల స్వచ్ఛమైన జీవితాలను ఎలా వెళ్లదీస్తున్నారో రచయిత మనకందించారు. విశేషమేమిటంటే, ఈ నవలలోని యువకుడు ఎవరోకాదు, స్వయాన రచయితే. రచయితే కథానాయకుడైనపుడు, స్వానుభవాలను చిత్రీకరించినపుడు ఆ నవల ఎంత హృద్యమంగా, సాఫీగా, మానవీయంగా ఉంటుందో హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురించిన పుస్తకాన్ని కొని చదవండి.

**ఏడు పుస్తకాలు**

ఎనిమిది సార్లు పునర్ముద్రించిన 'ఒక దళారీ పశ్చాత్తాపం' పుస్తకాన్ని ప్రచురించిన వీక్షణం పబ్లికేషన్స్ సంస్థకు మాతృసంస్థ అయిన సెంటర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్‌తో కలిసి ఇంగ్లిష్‌లో, తెలుగులో ఏడు పుస్తకాలను విడుదల చేసింది. ఏడు పుస్తకాలను ఒకేసారి విడుదల చేసిన ప్రచురణ సంస్థ మరొకటి లేదేమో. పుస్తకాలు ఏడైనా, అన్నింటిలోనూ విషయాలు రెండే – ఆర్థికం, అభివృద్ధి. పాలక పార్టీకి చెందిన చోటా నాయకులతో ప్రారంభించి అగ్రనాయకుల వరకు నోరు విప్పితే అభివృద్ధి అనే మాట వినిపించకుండా ఉండదు.

లక్షల టన్నుల అభివృద్ధి జరిగిపోతోందని పాలక పార్టీలు, పాలకులు చెప్పే అభివృద్ధి అంతా డొల్ల అని ప్రతిపక్షాలు అంటున్నాయి. అసలు అభివృద్ధి నిర్వచనం ఏమిటి? దేశంలో మనం చూస్తున్నది, వింటున్నది అభివృద్ధి పథకాలు మాత్రమే, అభివృద్ధి కాదు అంటారు పరిశోధక రచయిత్రి ముదునూరి భారతి. అందుకనే 'అభివృద్ధిని ఇలా చూద్దాం' అనే పేరుతో ప్రచురితమైన పుస్తకం నన్ను ఆకర్షించి, ఆ పుస్తకాన్ని చదవడం ప్రారంభించా. 1371 పేజీలున్న ఈ ఏడు పుస్తకాల్లో ఆర్.ఎస్. రావు రాసిన 'కొత్తచూపు' పుస్తకం తప్ప మిగతా ఆరు పుస్తకాలను ముదునూరి భారతి రచించిచారు. ఆర్.ఎస్. రావు 'కొత్తచూపు' పుస్తకాన్ని రచించగా, 'మెథడాలజీ ఆఫ్ సోషల్ ఎన్క్వైరీ', 'ఇన్ సెర్చ్ ఆఫ్ మెథడ్', 'ఇండివిడ్యువల్, సబ్ గ్రూప్స్, గ్రూప్స్ అండ్ ఫ్రీడం', 'క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్ ఇన్ మార్క్సియన్ ఫ్రేమ్‌వర్క్', ఆన్ ఎడ్యుకేషన్', 'అభివృద్ధిని ఇలా చూద్దాం' అనే ఆరు పుస్తకాలను భారతి రచించారు. విద్య గురించిన పుస్తకాన్ని ఇద్దరూ కలిపి రచించారు. వాటిని ఎ.సి. రూములో కంప్యూటర్ ముందు కూర్చొని రాసిన, రాయగలిన పుస్తకాలు కావు. గ్రామీణ ప్రజలను కలుసుకొని, కొన్ని అభివృద్ధి పథకాలను స్వయంగా చూసి, అధ్యయనం చేసి రాసిన పుస్తకాలు. విడుదల చేసి పదిహేను దినాలే అయింది కాబట్టి లోతుగా అధ్యయనం చేసే సమయమూ లేదు, విశ్లేషించే సామర్థ్యమూ లేదు. ఇదిగో ఈ పుస్తకాలు వచ్చాయి అని చెప్పడమే నా ఉద్దేశం. మన రాష్ట్రంలో ఇలాంటి పుస్తకాలు రావడమే చాలా అరుదు. ధైర్యం చేసి ప్రచురించిన సి.డి.ఆర్.సి., వీక్షణం ప్రచురణకర్తలు అభినందనీయులు.

*(రచయిత సీనియర్ పాత్రికేయులు, వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

*తన లోతైన అధ్యయనంతో, నిశితమైన దృష్టితో సోషలిజంపై నిర్మాణ దృష్టినిచ్చే, చర్చించే మార్తా హార్నెకర్ పుస్తకాలను పరిచయం చేస్తున్నారు* **బి. సాంబశివ రాజు**

# 21వ శతాబ్ది సోషలిస్టు నిర్మాణ దృక్కోణం

## సందర్భం

1. సోషలిస్టు దేశాలుగా పిలువబడ్డ సోవియట్ రష్యా దాని అనుబంధ తూర్పు యూరప్ దేశాల్లో అధికారం చెలాయించిన ప్రభుత్వాలు కుప్ప కూలిపోవడం.
2. చైనాలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సుదీర్ఘ విప్లవ చైతన్య యాత్ర ద్వారా ఏర్పడ్డ నూతన ప్రజాస్వామిక ఆర్థిక వ్యవస్థ, సోషలిస్టులు నిర్మాణ కృషి, సాంస్కృతిక విప్లవ వ్యవస్థ నిర్మాణ ప్రయత్న విఫలం, తదనంతర తిరోగమనం.
3. లాటిన్ అమెరికాలో వామపక్ష ప్రభుత్వాల ఏర్పాటు – విఫలం, గెరిల్లా ఉద్యమాల పుట్టుక – పతనం – తిరిగి జరుగుతున్న వామపక్ష ప్రభుత్వాల ఏర్పాటు ప్రయత్నాలు.
4. ఆసియా ఖండంలో కొద్దిపాటి మినహాయించి దెబ్బతిని పోయి కనుమరుగయిన వామపక్ష ఉద్యమాలు.
5. ఆఫ్రికాలో ప్రజా ఉద్యమాల విఫలం.
6. నేపాల్‌లో మావోయిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో ఉవ్వెత్తున ఎగసిన ప్రజాయుద్ధ ఉద్యమం – ప్రశ్నార్థకమయిన దాని గమనం – మనుగడ.
7. భారతదేశంలో వామపక్ష ఉద్యమాల తిరోగమనం – విఫలత – తిరిగి జరుగుతున్న ప్రజా పోరాట ఉద్యమాల నిర్మాణ ప్రయత్నాలు.
8. పశ్చిమ యూరపియన్ దేశాలలో వామపక్ష శక్తులు నయా ఉదారవాద గూటిలో చేరిక.
9. ప్రపంచ మొత్తంగా పైన ఉదహరించిన వామపక్ష శక్తుల విఫలత వల్ల ఏర్పడ్డ ఖాళీనంతా నయా ఉదారవాదం ఆక్రమించుకుని 'ప్రపంచీకరణ' పేరుతో అతి సులువుగా సొంతం చేసుకోగలడం.

సోషలిస్టు నిర్మాణ ఉద్యమాలు ఇటువంటి నిరాశాజనకమయిన, దయనీయమయిన స్థితిలోకి చేరిన సందర్భంలో ఉత్తర, దక్షిణ అమెరికాల నుండి కొంతమంది మార్క్సియన్ మేధావులు ఈ వైఫల్యాలకు కారణాలు వెదకడమే కాక, నయా ఉదారవాదాన్ని ఢీకొనడానికి ప్రత్యామ్నాయ ఉద్యమాల అవసరాన్ని గుర్తించడం, నూతన ఉద్యమ నిర్మాణానికి రూపకల్పనకు సైద్ధాంతిక ప్రతిపాదనలు అందించడం జరుగుతున్నది. అటువంటి మేధావులలో ప్రముఖంగా మనకు కనిపించే పేర్లు మార్తా హార్నెకర్, ఇస్త్వాన్ మేస్జరోస్, మైకేల్ లెబోవిట్జ్, జేమ్స్ పెట్రాస్.

21వ శతాబ్దంలో సోషలిజాన్ని తప్పిదాలు లేకుండా ఎలా నిర్మించవచ్చో మార్తా హార్నెకర్ తన అభిప్రాయాలను రచనల ద్వారా తెలియజేస్తున్నారు.

## మార్తా హార్నెకర్ గురించి...

ఆమె చిలీలో జన్మించింది. ప్రముఖ మార్క్సిస్ట్ మేధావి లూయీ ఆల్తూజర్ విద్యార్థిగా ప్యారిస్‌లో చదువుకుంది. సాల్వడార్ అయెండీ ప్రభుత్వం నడుస్తున్న రోజుల్లో ఆమె చిలీలో నివసించింది. చిలీ మిలిటరీ, అమెరికా ప్రభుత్వపు అండదండలతో, కుట్రతో అయెండీని చంపి ప్రభుత్వ అధికారాన్ని హస్తగతం చేసుకున్నప్పుడు ఆమె క్యూబాలో తలదాచుకుంది. క్యూబాలో ఉంటూ 'లాటిన్ అమెరికా పాపులర్ మెమరీ' అనే రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ నడిపింది. ప్రస్తుతం వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్‌కు ఒక సలహాదారుగా ఉంది.

వెనిజులాలో మొదలై, లాటిన్ అమెరికాలో బొలివారియన్ విప్లవంగా ప్రాచుర్యం పొందుతున్న ఉద్యమానికి ఆమె ప్రముఖ సమర్థకురాలుగా ఉంది.

ఆమె ఇంతవరకు అరవై పైచిలుకుగా తన రచనలను ప్రచురించింది. 1960ల చివర్లో ఆమె రాసిన 'ది బేసిక్ కాన్సెప్ట్స్ ఆఫ్ హిస్టారికల్ మెటీరియలిజం' 63 సార్లు ప్రచురించబడింది. ఇంత విస్తృత ప్రాచుర్యం పొందిన మార్క్సియన్ గ్రంథం అరుదైనదిగా చెప్పుకోవచ్చు. ఆమె రాసిన పుస్తకాలలో కొన్ని పేర్లు :

1) ది లెఫ్ట్ ఆఫ్టర్ సియాటిల్.
2) ది లెఫ్ట్ ఆన్ ది థ్రెషోల్డ్ ఆఫ్ ట్వెంటీ ఫస్ట్ సెంచురీ.
3) అండర్‌స్టాండింగ్ ది వెనిజ్యులన్ రెవల్యూషన్ : హ్యూగో ఛావెజ్ టాక్స్ టు మార్తా హార్నెకర్.

ఈ మధ్యకాలంలో ఆమె రచించిన 'రీబిల్డింగ్ ది లెఫ్ట్', 'లాటిన్ అమెరికా అండ్ ట్వెంటీ ఫస్ట్ సెంచురీ సోషలిజం – ఇన్వెంటింగ్ టు అవాయిడ్ మిస్టేక్స్' పుస్తకాలు చదివి ఈ పరిచయ వ్యాసం రాస్తున్నాను.

నా చిన్నతనం నుండి వామపక్ష ఆలోచనలకు దగ్గరై, 1968 నుండి వామపక్ష ఉద్యమాలు, హక్కుల ఉద్యమాలు మక్కువతో పరిశీలిస్తున్న, అధ్యయనం చేస్తున్న నాకు పైన ఉదహరించిన వామపక్ష చారిత్రక సందర్భం, స్థితి ఎంతో బాధాకరంగా తోస్తోంది.

ఇటువంటి పరిస్థితికి మూలాలు ఎక్కడున్నాయ్? ఎందుకిలా జరిగింది? సోషలిజం ఓ ఉన్నతమయిన న్యాయబద్ధమైన వ్యవస్థగా కొంత కాలమైనా, కొన్ని దేశాలలో నిరూపించబడ్డాక కూడా అక్కడి ప్రజలే వాటిని ఎందుకు కాపాడుకోలేకపోయారు? అచేతనంగా ఉండి పోయారు ? ఎన్నో త్యాగాలతో, రక్తతర్పణతో సాధించుకున్న విజయాలను చేజార్చుకున్నారు? మన దేశంలో వామపక్ష శక్తులు నక్సల్బరీ ఉద్యమానంతరం వెలసిన ఓ వెలుగు ముక్కలు ముక్కలుగా, చిరిగిన

వస్త్రంలా ఎందుకు మారిపోయింది? ఇటువంటి అనేకానేక ప్రశ్నలతో సతమతమవుతున్న నాకు మార్తా హర్నేకర్ ప్రతిపాదనలు, పరిశీలన, అనుభవాల సారాంశం, పైన ఉదహరించిన పుస్తకాలు చదివాక ఒకింత కొత్త గాలి పీల్చుకున్నట్టు అనిపించింది. మూసి ఉంచిన కిటికీలను తెరచినట్టయింది.

## ఆమె ఏమంటోందో చూడండి

మనం రాడికల్‌గా ఉండాలనుకుంటే, దానర్థం మనం అత్యంత అతివాద పోరాట నినాదాలు ఇవ్వడమూ, దుందుడుకు చర్యలకు పాల్పడడమూ కాదు – ఇటువంటి వాటితో ఏ కొద్దిమందో ఏకీభవించవచ్చు. కానీ, ఇవి ప్రజాసమూహంలో అధిక భాగాన్ని భయభ్రాంతులకు గురిచేస్తాయి. విస్తృత ప్రజారాసులు ఉద్యమంలో కలిసి రావడానికి, భాగస్వాములు కావడానికి మార్గాలు చూపడానికి బదులుగా అటువంటి పద్ధతులు అలా భాగస్వాములు కావాలనుకొనే వారికి జాగాయే లేకుండా చేస్తాయి. మనలాగానే చాలామంది ప్రజా ఉద్యమాలలో పాల్గొనడానికి మక్కువ చూపుతున్నారనే యథార్థాన్ని స్పృహలో ఉంచుకోవడం, వెసులుబాటుతో మెలగడం చాలా అవసరం. అటువంటి పద్ధతి మనకు ఎంతో బలాన్ని చేకూరుస్తుంది. నిజానికి ఇట్లా చేయగలగడమే మనను మరింత రాడికల్‌గా నిలబెడుతుంది. మనకి కావలసిన వామపక్ష శక్తి, పై విషయాలను గ్రహించి విస్తృత ప్రజారాసులను ఒత్తిడి ద్వారానో, పై నుండి రుద్దడం ద్వారానో గాక ఓపికతో వారిని ఒప్పించడం ద్వారా ఉద్యమాలను నిర్మించేదిగాను, సమన్వయ పరిచేదిగాను ఉండాలి. ఆ రకంగా అది అగ్రభాగాన నిలవాలి. మనం ఇంతవరకు చేసిన దాని కన్నా, గతం కన్నా, విస్తృత ప్రజారాసులతో కలిసి కట్టుగా మున్ముందు చేయవలసినది చాలా ముఖ్యమనే గ్రహింపు చాలా అవసరం. అలా చేయడం ద్వారానే మనం సర్వ మానావాళి అభివృద్ధికి నాయకత్వం వహించగలుగుతాం. అటువంటి స్పృహ ఉన్న వామపక్ష శక్తే తప్పులు లేని 21వ శతాబ్ది సోషలిస్టు నిర్మాణాన్ని చేయగలుగుతుంది.

మనకు ఇప్పుడు ఒక నూతనమయిన వామపక్ష సంస్కృతి కావాలి. ఆ సంస్కృతి నలుగురిని కలుపుకొని పని చేయగలిగేదై ఉండాలిగాని, మన శక్తులను విడగొట్టేదిగా ఉండకూడదు. అది స్నేహపూర్వకమైనది గానూ, బహుముఖమయిన సంస్కృతులను కలుపుకుని ఓర్పుతో నడుపుకు పోయేదిగా ఉండాలి.

మంచి ప్రమాణాలతో, విలువలతో, మానవీయతతో, అభిప్రాయ భేదాల ఎడ సహనం, ఓరిమి కలిగి వీటన్నిటి చుట్టూ ఓ బలమైన ప్రజాశక్తిని, ఐక్యతను నిర్మించ గలిగే శక్తిగా నూతన వామపక్షం ఉండాలి.

అంతేగాక, నూతన వామపక్ష శక్తి పర్యావరణం పట్ల లోతైన అవగాహన, దాని రక్షణ పట్ల అంకిత భావం కలిగినదై ఉండాలి. మానవాభివృద్ధికీ, ఉన్నతమైన సమాజానికీ మార్కెట్ శక్తులు, లాభాపేక్షే నడిపించే శక్తులనే ఆలోచనకు పూర్తి విముఖంగా ఉండాలి. అటువంటి అవగాహనను మన దరిచేర నివ్వకూడదు.

ఏ శక్తులయితే శ్రమరహిత సౌఖ్యాలు, అధికారం, విలాసాలు అనుభవిస్తున్నాయో, వాటిని సులువుగా వదులుకోవడానికి ఏ రకంగానూ ఒప్పుకోవు. అటువంటి శక్తులను ఓడించాలంటే ఇంటా – బయటా, విస్తృతంగా ప్రజలను సమీకరించుకోవాలి. వీటన్నిటినీ కూడగట్టగలిగే వ్యవస్థ, సంస్థ వీరంతా కలుసుకోగలిగే – సైబర్ లేక ఫిజికల్ స్పేస్‌ని సమకూర్చగలిగే ప్రణాళికను కూడా రచించాలి. మిలియన్లలో స్త్రీ – పురుషులు ఒకే గొంతుతో, ఒకే ఆశయంతో – సోషలిస్టు నిర్మాణ ఆశయంతో పోరాడడానికి సిద్ధంగా ఉండేటట్లు చేయగలగాలి.

ఇట్లా చెయ్యాలంటే ఒక వివరణాత్మకమయిన ఆక్షన్ ప్లాన్, నిర్మాణపు ప్లాన్ రచించి విస్తృత ప్రజారాసులలో సర్క్యులేట్ చేసి ఆమోదింప చేయాలి. ఇది వామపక్ష మేధావులు, కార్యకర్తలే కాక, మధ్యతరగతి ప్రజలు, ప్రొఫెషనల్స్, చిన్న – మధ్యతరగతి వ్యాపారస్తులు, పైన ఉదహరించిన ప్రణాళికను ఆమోదించేలా ఒప్పించగలగాలి.

ప్రజల భాగస్వామ్యంతో నిర్మాణమయిన సంస్థలకు మనం అత్యంత గౌరవమివ్వాలి. మనశక్తి యుక్తులను కూడా వీటికి జోడించాలి. వాటిని మనం వక్రీకరణకు గురిచెయ్యకూడదు. రాజకీయ నాయకులు, రాజకీయ క్యాడర్‌కే అన్నీ తెలుసుననే దురహంకారాన్ని వదులుకోవాలి. ప్రజా ఉద్యమాలు, నిర్మాణాల నుండి మనం ఎంతగానో నేర్చుకోవాలనే స్పృహ ఎల్లెడల ఉండాలి. ఉద్యమాలు కొనసాగించడంలో ఎన్నో కొత్త కొత్త విషయాలు, పరిజ్ఞానం సంతరించుకోవడం జరుగుతుంది. కొత్త ప్రశ్నలు – సవాళ్లు ఎదురవ్వడం, వాటికి సరైన పరిష్కారాలు కనుక్కోవడం అనే నిరంతర ప్రక్రియను ప్రోదిచెయ్యాలి.

మేం చెబుతాం – మీరు ఆచరించండి అనేట్లుగా లీడర్లు, క్యాడర్లు వ్యవహరించకూడదు. ప్రజల నుండి నేర్చుకోగలిగే, వారిని ఓర్మితో తీర్చిదిద్దగలిగే, ఎడ్యుకేట్ చెయ్యగలిగే, వారి ఆలోచనా పరిధిని ప్రాపంచిక దృక్పథంతో విస్తృతపరచగలిగే వారుగా క్యాడర్లు, లీడర్లు ఉండాలి.

బ్యూరాక్రాటిజమ్ అనేది ఓ పెద్ద అశనిపాతం. అత్యంత ప్రమాదకరం. సోవియట్ సోషలిస్టు నిర్మాణంలో దీని పాత్ర చాలా పెద్దది. ప్రజల ఆలోచనా శక్తి, క్రియేటివిటీని బ్యూరాక్రసీ పూర్తిగా నీరు కార్చేస్తుంది. పై నుండి వస్తే ఆచరిద్దామనే ఓ ప్రమాదకరమైన స్తబ్దమయిన మైండ్‌సెట్ ఏర్పాటవుతుంది. ప్రజలను జడపదార్థంగా తయారు చేస్తుంది.

ప్రజలు తమంత తాముగా అభివృద్ధి చెందుతూ, చైతన్యయుతం గానూ, విప్లవాత్మకంగానూ 21వ శతాబ్దపు సోషలిజాన్ని నిర్మాణం చేసుకోవడానికి నడుం బిగించాలి. ఆ నిర్మాణానికి రథసారథులు వారే కావాలి.

ఇంతవరకు చెప్పి నా పరిచయం పొడిగిస్తున్నాను. ఆమె ప్రతిపాదిస్తున్న 21వ శతాబ్దపు సోషలిస్టులు కొరవడడానికి ఆమె రచనలు విమర్శనాత్మక దృష్టితో చదివి అవగాహన చేసుకోవడం మంచిది.

భారతదేశ వామపక్ష ఉద్యమ శక్తులు బలోపేతమవడానికి, ఉద్యమ నిర్మాణాల విస్తృతికి, నూతన ఆలోచనలతో, ఆవిష్కరణలతో, వైవిధ్యభరిత భారతీయ సామాజిక శక్తుల ఐక్యతతో, ప్రపంచీకరణకు వ్యతిరేకంగానూ, మార్కెట్ ఎకానమీకి వ్యతిరేకంగానూ మన ఆలోచనా వనరులను సంపన్నం చేసుకోవడానికి లాటిన్ అమెరికా ఉద్యమాలు, మార్తా హర్నేకర్ రచనలు చదివి, చర్చించి, గ్రహించి విస్తృత ప్రజా ఉద్యమాల నిర్మాణానికి ఉపయోగించుకోవడం ఎంతైనా అవసరం.

ఆమె అభిప్రాయాలతో విభేదాలుండవచ్చు. కాని చర్చించి, నిగ్గు తేల్చి స్వీకరించేందుకు అవసరమయిన విషయాలు ఎన్నో ఉన్నాయని నా అభిప్రాయం.

*(రచయిత సి.డి.ఆర్.సి. డైరెక్టర్‌లలో ఒకరు)*

*అసలు పుస్తకాలు ఎందుకు చదవాలి అనే మౌలిక ప్రశ్నతో మొదలై, చదవాల్సిన అవసరాన్ని, చదవాల్సిన పుస్తకాలను, మనిషికుండే పరిమితులనూ, ప్రాధాన్యతలనూ వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# చదవవలసిన పుస్తకాలు

'చదవవలసిన పుస్తకాలు' ఏమిటో చెప్పడం కనబడుతున్నంత సులభమైనది కాదు. 'చదవవలసిన పుస్తకాలు' అనే చదువరులందరికీ వర్తించే ఏకైక జాబితాను తయారు చేయడం అసాధ్యం. అసలు ఆ మాటను రెండు వైపుల నుంచి – పుస్తకాలు చదివే పాఠకుల వైపునుంచీ, పుస్తకాల వైపు నుంచీ కూడ – అర్థం చేసుకోవచ్చు. పాఠకుల వైపు నుంచి చూసినప్పుడు ఆ పాఠకుల దేశ, కాల, వయో, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక స్థాయిలను బట్టి చదవవలసిన పుస్తకాల జాబితాలు మారవచ్చు, ఒక్కొక్క వ్యక్తికీ లేదా ఒక్కొక్క సమూహానికీ ఒక్కొక్క రకంగా ఉండవచ్చు. లేదా పుస్తకాల వైపు నుంచి చూసినప్పుడు స్థలకాలాలతో నిమిత్తం లేకుండా, కనీసం ఆధునిక కాలంలో, ప్రతిఒక్కరూ తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాలు అనే ఒక జాబితా, లేదా కొన్ని జాబితాలు తయారవుతాయి. అసలు ఏ జాబితా అయినా తయారుచేస్తున్నవారి దృక్పథాన్ని బట్టీ, సామాజిక స్థితిని బట్టీ, అధ్యయనాన్ని బట్టీ తయారవుతుందని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. అందువల్ల పాఠకులలో ప్రతి ఒక్కరూ ఈ వేరు వేరు జాబితాల నుంచి తమ సొంత జాబితాను తయారుచేసుకోవలసి వస్తుంది.

అసలు పుస్తకం చదవడం ఎందుకు? చదువు ద్వారా మనిషికి తన గురించీ, సమాజం గురించీ, ప్రకృతి గురించీ అవగాహన పెరుగుతుంది. తన జీవితంలోనూ, తన చుట్టూ ఉన్న సమాజంలోనూ, ప్రకృతిలోనూ జరుగుతున్న మార్పులను అర్థం చేసుకోవడానికి చదువు ఉపయోగపడుతుంది. తాను పొందుతున్న అనుభవాలు తనకే ప్రత్యేకమైనవి కావనీ, ఇతర వ్యక్తులు ఏదో ఒక కాలంలో ఒక స్థలంలో అనుభవించినవేననీ మనిషికి పుస్తక పఠనం ద్వారానే తెలుస్తుంది. తనలో ఉన్న ప్రత్యేకతలేమిటో, తనలో జరుగుతున్న మార్పులేమిటో, బయటి పరిణామాలకు తన స్పందన ఎలా ఉండడం అవసరమో, సముచితమో తెలుసుకోవడానికీ, తెలిసినదాన్ని మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడానికీ పుస్తక పఠనమే వీలుకలిగిస్తుంది. అంటే మనిషి సామాజికవ్యక్తిగా మారడం ఎలాగో పుస్తక పఠనం నేర్పుతుంది. మనుషులు ఎంత ప్రతికూల సమయంలోనైనా కూడా పుస్తకం చదివే అలవాటును నిలబెట్టుకున్నారో చూపే ఉత్తేజకరమైన అనుభవాలు ఎన్నో ఉన్నాయి. ఒకవైపు నిరంతర యుద్ధాలలో పాల్గొంటూనే, యుద్ధరంగం మీదా, ఒక యుద్ధ రంగం నుంచి మరో యుద్ధరంగాన్ని ప్రయాణంలో శకటాలలోనూ నెపోలియన్ పుస్తకాలు ఎలా చదువుతూ ఉండేవాడో చరిత్ర నమోదు చేసింది. అలాగే ఉరికంబం ఎక్కబోతూ చివరి రోజులలో భగత్‌సింగ్ పుస్తకాలు చదువుతున్నాడనీ, నోట్స్ తీసుకుంటున్నాడనీ ఆధారాలు ఉన్నాయి. ఉరితీయడానికి ముందురోజు లెనిన్ రాసిన 'రాజ్యమూ – విప్లవమూ' పుస్తకాన్ని భగత్‌సింగ్ చదువుతూ ఉన్నాడని అప్పటి రికార్డ్స్ తెలుపుతున్నాయి. చైనా లాంగ్ మార్చ్ నుంచి, లాటిన్ అమెరికా గెరిల్లా పోరాటాల నుంచి, దండకారణ్య ప్రజాసైన్యం దాకా ప్రజాసైనిక జీవితంలో పుస్తక పఠనం అనివార్యమైన, తప్పనిసరి అయిన జీవితపార్శ్వంగా ఉన్నదని కూడ ఆధారాలున్నాయి. అంటే యుద్ధాన్నీ, మృత్యువునూ, నిరంతర ప్రమాదాన్నీ దైనందిన జీవితాన్నీ కూడా అధిగమించగలిగే ఆకర్షణ ఏదో పుస్తకాలలో ఉంటుందన్నమాట.

అక్షరాస్యులు కానివారు చాలమంది ఈ అవగాహనలను తమ ఆచరణ ద్వారా పొందుతారు. మరొకమాటల్లో చెప్పాలంటే అక్షరాస్యులు పుస్తకాలలో చదవగలిగినదాన్ని, నిరక్షరాస్యులు తమ చేతల్లోనూ, ఇతరుల చేతల్లోనూ చదువుతారు. కాని ఆ అవగాహనకు పరిమితులుంటాయి. అది ప్రత్యక్ష ఆచరణ అధ్యయనం కాగా, పుస్తకంలో పరోక్ష ఆచరణ అధ్యయనానికి వీలుంటుంది. తన చుట్టూ జరుగుతున్న పరిణామాలను మాత్రమే కాక, తాను ప్రత్యక్షంగా చూడని పరిణామాలను కూడ అర్థం చేసుకునే శక్తి సామర్థ్యాలను మనిషికి పుస్తక పఠనమే కలగజేస్తుంది. ఈ ప్రకృతి ఏమిటో, అందులో తన స్థానమేమిటో, ఏ చారిత్రక పరిణామాలను దాటి తాను ప్రస్తుతం జీవిస్తున్న సమాజం ఏర్పడిందో, దీని మంచి చెడులేమిటో మనిషికి పుస్తకాల ద్వారానే అర్థమవుతుంది. తాను జీవిస్తున్న సమాజంలో అర్థవంతంగా పాల్గొనడానికి, తన జీవితానికి ఒక లక్ష్యం ఏర్పరచుకోవడానికి మనిషికి సహకరించేది చైతన్యాన్ని పెంచే పుస్తకమే.

అక్షరాస్యులయిన ప్రతి ఒక్కరూ తమ జీవితక్రమంలో – విద్యార్థిగా తప్పనిసరిగానో, వృత్తి ఉద్యోగాలలో నైపుణ్యం కోసమో – కొన్ని పుస్తకాలు చదవవలసి వస్తుంది. లేదా విద్యార్థి దశలోనో, ఆ తర్వాత జీవితంలోనో కేవలం ఆసక్తితో చదివే పుస్తకాలు కూడ ఉంటాయి. అంటే ప్రతి మనిషీ తన జీవితంలో తప్పనిసరిగా చదివే పుస్తకాలు కొన్ని డజన్లో, కొన్ని వందలో ఉంటాయి. కనీసం కొందరికయినా పుస్తకాలు చదవడంలో రుచి దొరికి 'పుస్తకాల పురుగులు'గా మారి దాదాపు ప్రతిరోజూ చదవకుండా ఉండలేని స్థితికి చేరుకుని జీవితకాలంలో కొన్ని వేల పుస్తకాలయినా చదువుతారు. సంవత్సరానికి మూడువందల పుస్తకాలు చదవడం గరిష్ట పరిమితి అనుకుంటే అరవై సంవత్సరాల పఠన జీవితంలో ఒక మనిషి అత్యధికంగా పద్దెనిమిది వేల పుస్తకాల కన్న ఎక్కువ చదవడం కుదరదు. ఇది కొంచెం విస్తరించినా ఇరవై – ఇరవై ఐదు వేల పుస్తకాలు చదవడం అసాధ్యమైన గరిష్ట ప్రమాణం కావచ్చు.

పూర్తిగా చదవకపోయినా, విజ్ఞాన సర్వస్వాలు, సంక్షిప్తీకరణలు, సమీక్షలు, పరిచయాలు, జాబితాలు, ఉపన్యాసాలు, సంభాషణలు వంటి మార్గాల ద్వారా మరి కొన్ని వేల పుస్తకాల గురించి కూడ తెలుసుకోవచ్చు. ఎంత ఎక్కువలో ఎక్కువ పుస్తకాలు చదివేవారయినా, పుస్తకాల గురించి తెలుసుకునేవారయినా, జీవితకాలంలో ఇరవై, ముప్పై వేల పుస్తకాలు చదివినప్పటికీ, మొత్తం మీద వెలువడిన పుస్తకాలలో వెయ్యికి ఒక్కటి కూడ చదివినట్టు కాదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఎందుకంటే మానవజాతి – అన్ని ప్రాంతాలూ సమాజాలూ సాహిత్యాలూ భాషలూ కలిసి – సామూహికంగా ఇప్పటికి రాసిన, సంకలనం చేసిన పుస్తకాలు కోట్ల సంఖ్యలో ఉంటాయి. ఐక్యరాజ్యసమితికి చెందిన యునెస్కో ప్రపంచవ్యాప్తంగా ప్రతిసంవత్సరం పదిలక్షల పుస్తకాలు వెలువడుతున్నాయని 2006లో అంచనా వేసింది. ఈ వార్షిక సంఖ్య కూడ పూర్తిగా విశ్వసనీయమైనది కాదు. యునెస్కో జాబితాలోకి రాని పుస్తక ప్రచురణలు ఎన్నో ఉంటాయి. చాల భాషలలో, చాల సమాజాలలో వెలువడుతున్న పుస్తకాలన్నీ ఈ యునెస్కో సమాచార సేకర్తలకు అంది ఉంటాయనే నమ్మకం లేదు.

ఈ వార్షిక సంఖ్య ఇటీవలి దశాబ్దాలలో చాల ఎక్కువగా ఉండవచ్చు. అచ్చు యంత్రం కనిపెట్టక ముందు, చేతిరాతతో పుస్తకాలు రాసి, చేతిరాతతోనే ప్రతులు తీసుకునే రోజుల్లో, వెలువడిన పుస్తకాల సంఖ్య ఏటేటా కొన్ని వందలకు మించి ఉండకపోవచ్చు. అచ్చు యంత్రం కనిపెట్టాక ఆ సంఖ్య కొన్ని వేలకు చేరి ఉండవచ్చు. పుస్తక ప్రచురణలో, ముద్రణలో ఆధునిక సౌకర్యాలు పెరుగుతున్న కొద్దీ ఈ సంఖ్య పెరిగిపోతూ ఉండవచ్చు. గూగుల్ అనే ఇంటర్నెట్ సంస్థ ఇటీవలి కాలంలో ప్రపంచంలో వెలువడిన పుస్తకాలన్నిటినీ డిజిటైజ్ చేయాలనే ఒక పథకం తయారు చేసుకుని ఆధునిక కాలంలో ప్రపంచంలో వెలువడిన పుస్తకాల సంఖ్య దాదాపు పదమూడు కోట్లు అని తేల్చింది. ఈ సమాచార సేకరణలో పుస్తకం అనే మాటకు ఇచ్చుకున్న నిర్వచనంవల్ల, స్పష్టంగా చెప్పని ఆధునిక కాలం అనే మాట వల్ల, ప్రచురణ సంస్థలను ఐ.ఎస్.బి.ఎన్. అనే సాంకేతిక ప్రమాణంతోనే గుర్తించడం వల్ల, ఈ పదమూడు కోట్ల సంఖ్యకు కూడ చాల పరిమితులున్నాయి.

మొత్తం మీద అర్థమయ్యేదేమంటే, మనిషి చదవదలచుకుంటే ఎదురుగా ఉన్న పుస్తకాలు సముద్రంతో సమానమైనన్ని కాగా, అందులో తప్పనిసరిగా చదవవలసినవీ, మంచివీ, విజ్ఞాన వినోద దాయకమైనవీ, ఆహ్లాదకరమైనవీ ఒక నదితో సమానమైనన్ని ఉండగా, ఒక మనిషి ఎక్కువలో ఎక్కువ ఒక దోసెడు నీళ్లు మాత్రం తాగడానికి వీలవుతుంది. మరి ఆ దోసెడు నీటిని ఎంచుకోవడం ఎలా అనేది పెద్ద ప్రశ్న.

ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చదవవలసిన పుస్తకాల' గురించి కొన్ని ఆలోచనలు ప్రతిపాదించడం ఈ వ్యాస లక్ష్యం. చదవగలిగే తక్కువ సమయంలో చదవదగిన ఎక్కువ పుస్తకాలను సూచించడం కూడ కష్టం కావచ్చుగాని కనీసం ఆయా పాఠకుల అభిరుచులను బట్టి మొత్తంగా పఠన కార్యక్రమం ఏ పద్ధతిని అనుసరిస్తే ఎక్కువ ప్రయోజనకరమో సూచించడం ఈ వ్యాస లక్ష్యం.

ప్రతి మనిషికీ కొద్దిగానైనా ప్రకృతి శాస్త్రాల పరిచయం, మానవ పరిణామం గురించి అవగాహన తప్పనిసరిగా ఉండవలసి ఉంటుంది. కనుక ఎవరికైనా 'చదవవలసిన పుస్తకాల' జాబితాలో ఈ ప్రకృతిశాస్త్రాల, మానవపరిణామ విషయాల గురించి చైతన్యం పెంచగల పుస్తకాలు తప్పకుండా ఉండాలి. గెలీలియో, కోపర్నికస్, న్యూటన్, డార్విన్‌ల సిద్ధాంతాల నుంచి ఎన్నో పుస్తకాలు చదవవలసి ఉంటుందని చెప్పవచ్చు గాని అది ఆచరణ సాధ్యం కాని జాబితా అయిపోతుంది. ఈ అంశాలను వివరించిన పుస్తకాలు ఇంగ్లిషులో చాల ఉన్నాయి. కనీసంగా, ఎంగెల్స్ రాసిన 'మానవ పరిణామంలో శ్రమ పాత్ర' గాని, జె.డి. బెర్నాల్ రాసిన 'సైన్స్ ఇన్ హిస్టరీ' గాని, ఐజాక్ అసిమోవ్ రచనలు గాని చదవడం ఈ పరిజ్ఞానానికి ఉపయోగపడుతుంది. తెలుగు పాఠకులకు సంబంధించి నంత వరకు ఈ విషయాల కోసం నండూరి రామమోహనరావు రాసిన 'విశ్వరూపం', 'నరావతారం' చాల ఉపయోగకరమైన పుస్తకాలు. ఈ రెండు పుస్తకాలు మూడు దశాబ్దాల కింద రాసినవే అయినా, ఈలోగా శాస్త్ర పరిశోధనలు మరింత ముందుకు సాగినా, ఈ పుస్తకాల శైలి వల్ల, విస్తృతివల్ల చాల ప్రాచుర్యాన్ని పొందాయి. ఇటీవలి కాలంలో ఈ విషయాలపైననే మరింత అదనపు సమాచారంతో, ఆసక్తిదాయకంగా కొడవటిగంటి రోహిణీప్రసాద్ రాసిన 'విశ్వాంతరాళం', 'మానవ పరిణామం', 'జీవకణాలూ – నాడీకణాలూ' కూడ వెలువడ్డాయి.

ప్రకృతి గురించి, మానవపరిణామం గురించి తెలుసుకున్న తర్వాత సమాజ చరిత్ర గురించి తెలిపే పుస్తకాలు చదవడం అవసరం. నిజానికి ఇది చాల ఇబ్బందికరమైనది. ప్రపంచంలో ప్రతి ఒక్క సమాజానికీ దానికే ప్రత్యేకమైన చరిత్రలు ఉన్నాయి. అవి కూడ పాలకవర్గ దృక్పథం నుంచి రాసినవీ, ప్రజల దృక్పథం నుంచి రాసినవీ ఎన్నో ఉన్నాయి. గతంలో తక్కువ ఆధారాలతో, పరిమిత దృక్పథంతో రాసిన పుస్తకాల కన్న ఆ తర్వాత ఎక్కువ ఆధారాలతో, మరింత సమగ్ర దృక్పథంతో రాసినవీ ఉన్నాయి. కనుక చరిత్ర అధ్యయనంలో పాఠకులు తమకు అవసరమని అనిపించిన, తమకు అభిరుచిగల ప్రాంతీయ చరిత్రనో, తాము అభిమానించే దృక్పథం నుంచి రాసిన చరిత్రనో చదవవచ్చు. తప్పనిసరిగా చదవవలసిన చరిత్ర లేదా చరిత్రలు ఇవే అని కచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. అయితే చారిత్రక దృక్పథం గురించి మాత్రం ఎవరయినా తప్పనిసరిగా చదవవలసిన పుస్తకం ఇ.ఎచ్. కార్ రాసిన 'వాట్ ఈజ్ హిస్టరీ?' ('చరిత్ర అంటే ఏమిటి?' అని తెలుగులో వచ్చింది). అలాగే గార్డన్ చైల్డ్ రాసిన 'వాట్ హాపెండ్ ఇన్ హిస్టరీ', 'మాన్ మేక్స్ హిమ్ సెల్ఫ్' ('చరిత్రలో ఏం జరిగింది', 'మానవుడే చరిత్ర నిర్మాత' అని తెలుగులో వచ్చాయి) కూడ ఇందుకు ఉపయోగపడతాయి. ఫ్రెడరిక్ ఎంగెల్స్ రాసిన 'కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుక', కార్ల్ మార్క్స్ రాసిన 'ఎ కాంట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ' ముందుమాట చారిత్రక దృక్పథం ఏర్పడడానికి చాల ఉపయోగపడతాయి. అలాగే క్రిస్ హార్మన్ రాసిన 'ఎ పీపుల్స్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్', హోవార్డ్ జిన్ రాసిన 'ఎ పీపుల్స్ హిస్టరీ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా' ఉపయోగకరమైనవి. భారత సమాజ చరిత్రకు సంబంధించినంతవరకు డి.డి. కోశాంబి రాసిన 'ఆన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ' చదవడం ఒక స్థూల అవగాహనను ఇస్తుంది. రాహుల్ సాంకృత్యాయన్ నేరుగా చరిత్ర రాయకపోయినా, చారిత్రక నవలల ద్వారా ఈ దృక్పథాన్ని అందించడానికి ప్రయత్నించారు. ఆయన రాసిన 'ఓల్గా సే గంగా', 'సింహ సేనాపతి', 'జయయౌధేయ', 'విస్మృత యాత్రికుడు' వంటి నవలలు. 'రుగ్వేద ఆర్యులు' వంటి పుస్తకాలు ఉత్తేజకరంగానూ, ఆలోచనాస్ఫోరకంగానూ ఉంటాయి. తెలుగు సమాజ చరిత్రకు సంబంధించినంతవరకు సురవరం ప్రతాపరెడ్డి రాసిన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర', కంభంపాటి సత్యనారాయణ రాసిన 'ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి' చదవడం ఉపయోగకరం.

ప్రకృతి చరిత్రనూ, సామాజిక చరిత్రనూ, అందులో మనిషి స్థానాన్నీ అర్థం చేసుకోవడానికి కొంత తాత్విక దృక్పథం, కొంత రాజకీయార్థిక దృక్పథం కూడ తప్పనిసరిగా అవసరమవుతాయి. నిజానికి చరిత్రలాగే తత్వశాస్త్ర అధ్యయనం కూడ దానికదిగా ఒక మహాసముద్రం. ఆ వందలకొలది పుస్తకాలలో కొన్నిటిని విడదీసి చూపడం కష్టం. కాని ప్రతి మనిషీ కనీసం తత్వశాస్త్ర చరిత్రను, ప్రధాన తాత్విక దృక్పథాలను పరిచయం చేసుకోవడం అవసరం. తెలుగులో సరయిన తాత్విక పరిభాష ఇంకా అభివృద్ధి చెందలేదు గాని గోపీచంద్ రాసిన 'తత్వవేత్తలు', నండూరి రామమోహనరావు రాసిన 'విశ్వదర్శనం', రాహుల్ సాంకృత్యాయన్ రాసిన 'ప్రాక్పశ్చిమ దర్శనాలు', దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ రాసిన 'భారతీయ తత్వశాస్త్రం – సులభ పరిచయం' వంటి గ్రంథాలయినా అధ్యయనం చేయడం అవసరం. మార్క్స్ రాసిన 'ఎకనమిక్ అండ్ ఫిలసాఫికల్ మాన్యుస్క్రిప్ట్స్', 'థీసిస్ ఆన్ ఫ్యూర్ బా', ఎంగెల్స్ రాసిన 'లుడ్విగ్ ఫ్యూర్ బా అండ్ ఎండ్ ఆఫ్ క్లాసికల్ జర్మన్ ఫిలాసఫీ', లెనిన్ రాసిన 'మెటీరియలిజం అండ్ ఎంపిరియో క్రిటిసిజం', మావో రాసిన 'వైరుధ్యాలు', 'ఆచరణ', దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ రాసిన 'వాట్ ఈజ్ లివింగ్ అండ్ వాట్ ఈజ్ డెడ్ ఇన్ ఇండియన్ ఫిలాసఫీ' వంటి పుస్తకాలు చదవడం ఉపయోగకరం. గతితర్కం గురించి మాట్లాడుతూ ఒక సందర్భంలో మావో 'చైనాలో డెబ్బై కోట్ల గతితర్క వాదులను చూడాలని నా ఉద్దేశం' అన్నాడు. అప్పుడు చైనా జనాభా డెబ్బై కోట్లు. అంటే, ప్రతి ఒక్కరూ గతి తార్కిక ఆలోచనా పద్ధతిని నేర్చుకోవాలని ఆయన ఉద్దేశం.

ఇక రాజకీయార్థిక శాస్త్ర పుస్తకాల అధ్యయనం సమాజాన్ని, సమాజానికి పునాది అయిన ఉత్పత్తి శక్తులనూ ఉత్పత్తి సంబంధాలనూ అర్థం చేసుకోవడానికి చాల ఉపయోగపడుతుంది. ఈ రంగంలో కూడ ఇంగ్లిషులో వందలాది పుస్తకాలున్నాయి గాని తెలుగులో ఆ పరిభాష సులభమైన స్థాయిలో అభివృద్ధి చెందలేదు, సులభ గ్రాహ్యమైన పుస్తకాలు వెలువడలేదు. ఇంగ్లిషులోని మంచి పుస్తకాలకయినా మంచి తెలుగు అనువాదాలు రాలేదు. లియో హ్యూబర్‌మన్ రాసిన 'మాన్స్ వరల్డ్లీ గూడ్స్' వంటి పుస్తకాలు రాజకీయార్థికశాస్త్ర దృక్పథాన్ని సులభంగా పరిచయం చేస్తాయి. అలాగే రాజకీయార్థ శాస్త్రం మీద ఎన్నో పాఠ్య పుస్తకాలున్నాయిగాని లియాంటివ్ రాసిన 'రాజకీయార్థ శాస్త్రం' వంటి పుస్తకం ఒకటయినా చదవడం అవసరం. చైనాలో సాంస్కృతిక విప్లవ కాలంలో సాధారణ పాఠకులందరికీ అర్థమయ్యే పద్ధతిలో రాజకీయార్థ శాస్త్రాన్ని బోధించడానికి 'షాంఘై టెక్స్ట్ బుక్' తయారైంది. అదీ, మావో రాసిన 'క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్' కూడా చదవడం అవసరం.

ఇక సాహిత్యంలో కవిత్వం, కథ, నవల, నాటకం, వ్యాసం వంటి ప్రక్రియలలో చదవవలసిన పుస్తకాలు అసంఖ్యాకంగా ఉంటాయి. వాటిలో ప్రతి ఒక్కటీ ఒక మానవ జీవిత, సమాజ శకలాన్ని, మానవ సంబంధాల విశిష్ట అనుభవాన్ని చెపుతుంది గనుక దేనికది చదవవలసిందే. కాని అన్నీ చదవడం సాధ్యం కాదు గనుక, అభిరుచిని బట్టి, ఆయా సమాజాల గురించి ఉండే ఆసక్తినిబట్టి కొన్ని పుస్తకాలు ఎంచుకోక తప్పదు. పద్దెనిమిది, పందొమ్మిదో శతాబ్దాలలో యూరప్‌లో సమాజంలో, మానవ జీవితంలో అనూహ్యమైన, అసాధారణమైన, ప్రగాఢమైన మార్పులు వచ్చాయి గనుక, ఆ కాలపు నవలా సాహిత్యం ఆ మార్పులను పట్టుకున్నది గనుక ఆ నవలలు చదువుతుంటే మానవస్వభావాల గురించీ, వాటిలో వచ్చే మార్పుల గురించీ, వ్యక్తికీ సమాజానికీ మధ్య ఉండే ఐక్యత – ఘర్షణ గురించీ గొప్ప అవగాహన కలిగి పాఠకుల చైతన్యం ఉన్నతీకరణ జరుగుతుంది. ఆ నవలల అధ్యయనం గొప్ప జీవితానుభవంలా ఉంటుంది. ఇంగ్లిష్, ఫ్రెంచి, రష్యన్ సమాజాలలో వెలువడిన ఆ నవలలు, కాల్పనిక సాహిత్యం ప్రతిచోటా చదవవలసిన పుస్తకాల జాబితాలో ఉండడం అందువల్లనే. అలాగే రష్యా, చైనాలలో విప్లవక్రమంలో మానవజీవితం అనుభవించిన సంఘర్షణ, కొత్తసమాజ నిర్మాణపు పురుటి నొప్పులు చాల గొప్ప సాహిత్యాన్ని వెలువరించాయి. అలాగే చాల దేశాలలో సోషలిజం కోసం మనుషులు కన్న కలలూ, చేసిన పోరాటాలూ నిర్మాణాలూ గొప్ప సాహిత్యాన్ని సృష్టించాయి. ఆ కథలూ నవలలూ కవిత్వాలూ నాటకాలూ వ్యాసాలూ అన్నీ, కనీసం వాటిలో ముఖ్యమైనవైనా తప్పనిసరిగా చదివి తీరవలసినవే. అటువంటి కథల, నవలల జాబితా కనీసం వంద పుస్తకాలదైనా తయారవుతుంది.

ఇక పాఠకులెవరికైనా ప్రత్యేకంగా కొన్ని రంగాలమీద, కొన్ని సమాజాల మీద హెచ్చు ఆసక్తి ఉండవచ్చు. ఒకరికి వ్యవసాయరంగంలో ఏమి జరిగిందో, జరుగుతున్నదో తెలుసుకోవాలని ఉంటే, మరొకరికి క్రీడారంగంలోని పరిణామాల మీద ఆసక్తి ఉండవచ్చు. ఒకరికి అమెరికన్ సమాజంలో ఏమి జరిగిందో చదవాలని ఉంటే, మరొకరికి దండకారణ్యంలో ఆదివాసి తెగల జీవితం గురించి చదవాలని ఉండవచ్చు. అలా ఆయా రంగాలకే, సమాజాలకే పరిమితమైన, ప్రత్యేకమైన పుస్తకాలు, అలా పరిమితమవుతూనే సార్వకాలిక, సార్వజనిక ఆలోచనలను ప్రేరేపించగల పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. శ్రీశ్రీ అన్నట్టు 'అట్టడుగున అంతమందిమీ మానవులమే' అని నిరూపించడానికి దేశం, కాలం, భాష, సంస్కృతి ఏదయినా మనిషి పడే వేదన, మనిషి కనే కల, మనిషి సాగించే ఆచరణ అన్నిచోట్లా ఒకటే. కనుక ఏ సమాజంలో నయినా మనిషి గురించి పట్టించుకున్న పుస్తకమేదీ మనిషికి అనవసరమైనది కాదు. అందువల్ల మనిషి గురించి, మానవజీవిత ఉన్నతీకరణ గురించి ఆలోచించిన, చర్చించిన, మార్గాలు సూచించిన పుస్తకాలన్నీ చదవవలసినవే. ఎవరికి వారు వారి పరిమితులను బట్టి వాటిలో కొన్ని ఎన్నుకొని చదువుతారు.

ఇక ప్రస్తుత సమాజంలో పుస్తకపఠనానికి ఉన్న అవరోధాలను గురించి కూడ చెప్పుకోవాలి. 'చదవడం తగ్గిపోతున్నది' అనే మాట ఇటీవల చాల తరచుగా వినబడుతున్నది. ముఖ్యంగా టెలివిజన్ వంటి వినోదసాధనం, సెల్‌ఫోన్ వంటి సమయహరణ సాధనం వచ్చిన తర్వాత, నగరీకరణ పెరిగి ఉద్యోగాలకూ వృత్తులకూ ఎన్నోగంటల ప్రయాణం చేయవలసిన ఒత్తిడి పెరిగిన తర్వాత మనుషులు పుస్తకాలు చదవడం తగ్గిందని చాలమంది అంటున్నారు. నిజంగానే మన సమాజం లాంటి సమాజాలలో అక్షరాస్యుల సంఖ్యకూ అచ్చవుతున్న పుస్తకాల సంఖ్యకూ పొంతన ఉండడం లేదు. కాని ఈ దృశ్యాన్నే మరొక పక్కనుంచి చూస్తే రచయితలు పెరిగారు, ప్రచురణ సంస్థలు పెరిగాయి, సాలీనా వెలువడుతున్న పుస్తకాల సంఖ్య పెరిగింది. అది జనాభాతో, అక్షరాస్యులతో పోల్చి చూసినప్పుడు ఉండవలసినంతగా లేకపోవచ్చు గాని పెరుగుదల అసలే లేదని చెప్పలేం.

గతంలో చదివే అలవాటు ఉండి ఇప్పుడు వదిలేసినవాళ్లయినా, ఇప్పుడు చదవవలసిన యువతరమయినా ప్రధానంగా పుస్తక పఠనానికి అవరోధాలుగా చూపుతున్న వాదనలలో ముఖ్యమైనవి – 'చదవడానికి సమయం దొరకడం లేదు', 'కావలసిన పుస్తకం దొరకడం లేదు', 'ఏ పుస్తకం చదవాలో చెప్పేవాళ్లు లేరు', 'చదవవలసిన పుస్తకం పరభాషలో ఉంది/అనువాదం సరిగా లేదు.'

నిజానికి చదవడానికి సమయం లేదనే వాదన చాల సందర్భాలలో వాస్తవం కాదు. ఆధునిక జీవితంలో వ్యాపకాలు పెరిగిపోయిన మాట, సమయంపైన ఒత్తిడి పెరిగిన మాట నిజమే గాని, ఒకసారి చదువు రుచి దొరికిన తర్వాత, చదువు అవసరం గుర్తించిన తర్వాత రోజుకు గంటో, అరగంటో సమయం దొరికించుకోవడం కష్టం కాదు. వారానికి ఒకటో రెండో పుస్తకాలు తప్పనిసరిగా చదవాలనే నియమం పెట్టుకుంటే, సమయాన్ని ప్రణాళికాబద్ధంగా వినియోగించుకుంటే ఇది అనుకుంటున్నంత పెద్ద సమస్య కాదు.

కావలసిన పుస్తకం దొరకడం లేదనేది కొంతవరకు నిజమైన సమస్యే. గతంలో లాగ అందుబాటులో గ్రంథాలయాలు, చదువుకున్న వారు, పుస్తకపఠన సంస్కృతి ఇప్పుడు లేవు. అందువల్ల ఎవరయినా ఏదయినా పుస్తకం చదువుదామని అనుకున్నా, ఆ సమయానికి ఆ పుస్తకం దొరకకపోవడం, ఆ తర్వాత జీవన వ్యాపకాలలో పడి అది మరచిపోవడం జరుగుతున్నాయి. అనుకున్న పుస్తకం అనుకున్నప్పుడే దొరికితే చదవడానికి ఎక్కువ అవకాశం ఉండే మాట నిజమే. పాఠకులు ఒక్కచోటికి రావడం, పఠన సంస్కృతిని పెంపొందించడం, ఒకరి సొంత గ్రంథాలయాన్ని మరొకరు వినియోగించుకునే అవకాశం ఉండడం, సామూహిక పఠనం కోసం స్టడీసర్కిళ్లు ఏర్పడడం వంటి మార్గాలు వెతికి ఈ సమస్యను పరిష్కరించుకోవచ్చు.

అటువంటి పఠన సంస్కృతి పెరిగినప్పుడు, స్టడీసర్కిళ్లు ఏర్పడినప్పుడు ఏపుస్తకం చదవాలో చెప్పే మార్గదర్శకులు, సలహాదారులు, పుస్తకాలలో అర్థం కాని విషయాలను వివరించేవారు కూడ సమకూరుతారు. తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాలు పరభాషలలో ఉండడం, మాతృభాషలో ఉన్నప్పటికీ సరయిన, సులభమైన అనువాదాలు లేకపోవడం నిజమైన సమస్యే. తెలుగులో ఇది మరింత పెద్ద సమస్య. కాని ఈ సమస్యను పరభాష తెలిసినవారిని పక్కన కూచోబెట్టుకుని చదువుతూ, అనువాదం చేయమని కోరుతూ కాలక్రమంలో పరిష్కరించుకోవలసిందే తప్ప తక్షణ పరిష్కారాలు లేవు.

చివరిగా, పుస్తక పఠనం మీద ఆసక్తి ఉన్నవారికి కొన్ని సూచనలు చేయవలసి ఉంది.

ఒకటి, పైన వివరించిన జాబితాగాని, ఇతరులు సూచించే జాబితా గాని ఎప్పుడూ సంపూర్ణమూ సమగ్రమూ కావు. ఈ పుస్తకాలలో మీకు ప్రత్యేకంగా ఉపయోగకరమని అనిపించేవి కొన్నే ఉండవచ్చు. అలాగే ఏ ఒక్క పుస్తకమూ సంపూర్ణంగా ఆమోదించగలిగేదీ తృప్తినిచ్చేదీ కాదు. ఎందుకంటే అది ఒక నిర్దిష్ట స్థల కాలాలలో ఒక ప్రత్యేక దృక్పథంతో రాసినది గనుక దానిలో కాలంచెల్లినదీ, కాలంవల్ల మార్పుకు గురయినదీ ఎంతోకొంత ఉంటుంది. కనుక ఒక చదువరికి ఒక పుస్తకం కొన్ని అవగాహనలకు మార్గదర్శి మాత్రమే అవుతుంది, కొన్ని ఆలోచనలను ప్రేరేపించగల చెకుముకి రాయి మాత్రమే అవుతుంది గాని అదే సంపూర్ణ అవగాహనను పొట్టువలిచి నూరి నోట్లో పెట్టజాలదు. ఏ పుస్తకమయినా చదువరి నుంచి కొంత సమయాన్ని, కొంత శ్రమను, కొన్ని ఆలోచనలను, కొన్ని ఆచరణలను, కొంత మార్పును కోరుతుంది. చదువరికి ఆ ఆసక్తి, సంసిద్ధత, సాహసం, పట్టుదల, కృషి ఉన్నప్పుడే ఆ పుస్తకం ఉపయోగపడుతుంది.

రెండు, పాఠకులెవరయినా ఇప్పటికే చదివి, ఆలోచించి, ఆచరణలో ఉన్న అభిప్రాయాలకు భిన్నమైన, వ్యతిరేకమైన అభిప్రాయాలను తప్పకుండా చదవాలనే నియమం పెట్టుకోవాలి. ఏ అభిప్రాయమయినా నిగ్గుతేలేది సమానమైన అభిప్రాయం ఉన్నవాళ్ల మధ్య కాదు, ఆ అభిప్రాయాన్ని ఖండించే, వ్యతిరేకించే అభిప్రాయాలతో పోటీపడి అది నెగ్గగలుగుతుందా లేదా అనేదాని మీద మాత్రమే ఒక అభిప్రాయపు బలం నిర్ధారణ అవుతుంది. అందువల్ల భిన్నాభిప్రాయాల పుస్తకాలను తప్పనిసరిగా చదవాలి. అయితే ఆ భిన్నాభిప్రాయాల గాలికి కొట్టుకుపోకుండా ఉండడం కూడ నేర్చుకోవాలి. చదువరి తన నేలమీద తాను గట్టిగా నిలబడినప్పుడు మాత్రమే ఆ భిన్నాభిప్రాయాల గాలికి కొట్టుకుపోకుండా ఉండడం వీలవుతుంది.

మూడు, పుస్తకపఠనం ప్రారంభించిన కొత్తలో చేతికి దొరికిన పుస్తకమల్లా చదివే అలవాటు ఉంటుంది. అది చాల మంచిది కూడ. పుస్తకపఠన దాహం అలానే పెరుగుతుంది. కాని కొద్ది కాలం గడిచాకనయినా ఈ పద్ధతి మాని, అభిరుచి, ఆసక్తి, అవసరం, జీవితలక్ష్యాలకు అనుగుణమైన విషయాలు వంటి వాటిని దృష్టిలో పెట్టుకుని తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాల ప్రణాళిక తయారు చేసుకోవాలి. ప్రణాళికాబద్ధంగా చదవడం అలవాటు చేసుకోవాలి. తెలుగులో గతంలో తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాల జాబితాలు కొన్ని తయారయ్యాయి గాని అవి ప్రధానంగా సాహిత్యరంగపు జాబితాలే. అలా కాకుండా సాహిత్యంతోసహా సమగ్ర ప్రాపంచిక దృక్పథాన్ని అందించే పుస్తకాల జాబితాలు ఇంగ్లిషులో ఎన్నో ఉన్నాయి. ఆ జాబితాలకు మన సామాజిక స్థితినిబట్టీ, అవసరాలనుబట్టీ, అభిరుచులను బట్టీ మార్పులు చేర్పులు చేసుకుని మన సొంత ప్రణాళికను రూపొందించుకోవచ్చు.

ఇంతకూ పుస్తకం చదవడం ఎందుకు? సమాజాన్నీ, ప్రపంచాన్నీ అర్థం చేసుకునేందుకు. అర్థం చేసుకుంటే సరిపోతుందా? ఆ అర్థమైనది, ఎక్కడో ఒకచోట, ఏదో ఒక స్థాయిలో ఆచరణలోకి రాకపోతే ప్రయోజనమేమీ లేదు. అంటే, పుస్తకం చదవడం చదవడం కోసం మాత్రమే కాదు, ఆ పుస్తకం ద్వారా నేర్చుకున్న అవగాహనను, జ్ఞానాన్ని మార్పు కోసం ఉపయోగించడానికి. జరుగుతున్న మార్పులో భాగం కావడానికి. ఏ పని చేస్తున్నా శ్వాస ఆడడం మాననట్టు, మనం పాల్గొన్నా, పాల్గొనకపోయినా మార్పు జరుగుతూ ఉంటుంది. ఆ మార్పు ఏ దిశలో జరుగుతున్నదో అవగాహన చేసుకోవాడనికి, ఆ మార్పు దిశ ప్రతికూలమైనదే అయితే దాన్ని మార్చడానికి, ఆ మార్పు ప్రయత్నాలలో భాగం కావడానికి పుస్తకం అదనపు అవగాహనను ఇస్తుంది. ఉట్టి చేతితో శ్రమ చేయడం ప్రారంభించిన మనిషి, ఆ చేతికి కొనసాగింపుగా పనిముట్టును తయారు చేసుకుని ఉత్పాదకత పెంచుకున్నట్టుగా, పుస్తకం అనే పనిముట్టును పట్టుకొనే మనుషులు సమాజ చలనాన్ని మరింత వేగవంతం చేయగలుగుతారు.

అటువంటి మార్పు పరికరాలను ఇచ్చే పుస్తకాలు తప్పనిసరిగా చదవవలసినవి. మార్క్స్ – ఎంగెల్స్ రాసిన 'కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక' అలా ఎల్లకాలాలకు, అన్ని సమాజాలకు చదవవలసిన పుస్తకం అవుతుంది. ఆ మార్పును మరింత ముందుకు తీసుకుపోయిన పుస్తకాలుగా 'బోల్షివిక్ పార్టీ చరిత్ర', 'మావో రచనలు', చేగువేరా రచనలు ఉపయోగపడతాయి. భారత సమాజానికి సంబంధించి ఇటువంటి పుస్తకాలు అనేకం ఉన్నాయి. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట చరిత్ర పుస్తకాల నుంచి వ్యవసాయ విప్లవం వరకు అవన్నీ చదవవలసినవే.

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

*కొత్త జాతీయ ఫైబర్ విధానం సహజ నూలు ఉత్పత్తిలో ప్రపంచంలోనే రెండవ స్థానంలో ఉన్న భారత చేనేత ప్రజానీకానికి వ్యతిరేకమని అంటున్నారు* **డి. నరసింహారెడ్డి**

# జాతీయ ఫైబర్ విధానం - ఒక సమీక్ష

**జా**తీయ ఫైబర్ విధానం అవసరం ఎంతైనా ఉంది. ఈ విధానం దేశంలో ఉత్పత్తి అవుతున్న అన్ని రకాల నూలు పోగులకు సంబంధించినది. కేంద్ర జౌళి మంత్రిత్వశాఖ ఈ విధాన రూపకల్పనకు గత ఏడాది జూలై నెలలో శ్రీకారం చుట్టింది. దీనిని రూపొందించడానికి ఒక కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కమిటీలో 72 మంది సభ్యులను ఎంపిక చేసుకోవడం జరిగింది. కాకపోతే, ఈ కమిటీలో పూర్తిగా కార్పొరేట్ సంస్థలు, కంపెనీలకు సంబంధించిన వ్యక్తులనే తీసుకున్నారు. ఈ కమిటీలో చేనేత పరిశ్రమకు సంబంధించి ఒక్క ప్రతినిధికి కూడా చోటు దక్కలేదు. రైతుల ప్రతినిధులు కూడా ఇందులో లేరు. ప్రభుత్వ నిధులతో ఒక విదేశీ కంపెని ఈ కమిటీకి విజ్ఞాన, సమాచార సేవలు అందించింది. ఈ ఏడాది జూన్‌లో ముసాయిదా విధానం విడుదల చేశారు.

ఆశ్చర్యకరంగా, ఈ ముసాయిదా కేవలం ఇంటర్నెట్‌లో పెట్టారు. దీనిపై వ్యాఖ్యానించడానికి మొదట పది రోజుల గడువు మాత్రమే ఇచ్చారు. దీనిని సవాలు చేస్తే, అప్పుడు గడువు పొడిగించారు. జూలై మాసాంతానికి ఈ ప్రక్రియ కూడా ముగిసింది. తదుపరి, ప్రభుత్వం ఏమి చేస్తుంది, ఎలా ఈ ముసాయిదాను విధానంగా మారుస్తారు అనేది ఇంకా అంతుపట్టని విషయం. అయినా ఇప్పటికీ అనేక మందికి ఈ విధానం గురించి గానీ, దాని నేపథ్యం గురించి గానీ తెలిసే అవకాశం లేదు. అందరికి తెలియ చెప్పాలనే తపన ప్రభుత్వ స్థాయిలో కనపడడం లేదు. అంతకు ముందు ప్రతి సమావేశంలో దీని గురించి ఊదరగొట్టిన కేంద్ర జౌళి శాఖా మంత్రి దయానిధి మారన్, ముసాయిదా గురించి ఎక్కడ ప్రస్తావించకపోవడం గమనార్హం. ఈ ముసాయిదాలోని మంచి చెడ్డలు విస్తృతంగా చర్చిస్తేనే అందరికీ ఆమోదయోగ్యమైన విధానం రూపొందే అవకాశం ఉంటుంది.

ఎంతో ఆశగా ఎదురు చూస్తున్న ఈ విధానం ముసాయిదా తీవ్ర నిరాశను మిగిల్చింది. కొత్త పంథాగానీ, కొత్త రూపుగానీ ఈ విధానంలో మనకు కనపడలేదు. భారత జౌళి రంగంలో ఉన్న అనేక ఉపరంగాల మధ్య గల వైరుధ్యాలను అర్థం చేసుకొని వాటి మధ్య ఒక సమన్వయం సాధించే దిశగా ఈ ముసాయిదా ఎటువంటి ప్రయత్నం చేయకపోవడం మనకు స్పష్టంగా కనపడుతుంది. పర్యావరణ అనుకూల భారత ప్రభుత్వ ఆలోచనలకూ భిన్నంగా ఈ ముసాయిదా రూపొందించబడింది. మొత్తానికి, ఈ ముసాయిదా పత్తి, కృత్రిమ నూలు మధ్య ఉన్న నిష్పత్తిని మార్చే ప్రయత్నం చేస్తున్నది. కృత్రిమ నూలు ఉత్పత్తిని పెంచి, పత్తిపై ఆధారపడడాన్ని తగ్గించి, ఆధునిక జౌళి రంగ అభివృద్ధి సాధించాలని ఈ జాతీయ ఫైబర్ ముసాయిదా విధానం ప్రధాన ఉద్దేశం.

అంతర్జాతీయంగా ప్రస్తుతం ఉన్న పత్తి, కృత్రిమ నూలు ఉత్పత్తి మధ్య ఉన్న నిష్పత్తిని అందుకోవాలని స్పష్టంగా చెప్పబడింది. ప్రస్తుతం అంతర్జాతీయంగా ఈ నిష్పత్తి 40:60 ఉండగా దేశంలో ఇది 59:41గా ఉన్నది. అంటే, పత్తి ఉత్పత్తి కృత్రిమ నూలుతో పోలిస్తే మన దేశంలో ఎక్కువ. అంతర్జాతీయంగా తక్కువ. కాకపోతే కృత్రిమ నూలు ఉత్పత్తి ఎందుకు ఎక్కువ చేయాలనే విషయం మీద సరైన వివరణ ఇందులో లేదు.

భారత దేశం పత్తి ఉత్పత్తిలో ప్రపంచ స్థాయిలో రెండవ స్థానంలో ఉంది. 2008లో జరిగిన ఉత్పత్తి ఐదు వందల కోట్ల కేజీలు. పత్తి నూలు, పత్తి ఆధార వస్త్ర ఉత్పత్తిలో కూడా అగ్రగామి. నూట డెబ్భై లక్షల కేజీల ఉత్పత్తి ద్వారా సిల్క్ లో కూడా రెండవ స్థాయిలో ఉంది. జనపనార ఉత్పత్తి 17 లక్షల టన్నులకు చేరుకొని ప్రపంచంలో మొదటి స్థాయిలో ఉంది. ఈ విధంగా జౌళి రంగంలోని అన్ని ఉపరంగాలలో భారత దేశం స్థానం చాల అత్యున్నత స్థాయిలోనే ఉంది. ఏ దేశంలో కూడా ఇన్ని రకాల ఫైబర్ ఉత్పత్తులు చేసే సామర్థ్యం పూర్తిగా లేదు. అన్నిరకాల ఫైబర్ ఉత్పత్తులలో సంపూర్ణంగా ముడిపదార్థాల ఉత్పత్తి నుంచి, వాటిని ఉపయోగించి తయారుచేసే జౌళి ఉత్పత్తుల దాక భారతదేశం అగ్రగామిగా కొనసాగుతోంది. వీటిని ఉత్పత్తి చేసే పద్ధతులు కూడా అనేకం. వివిధ రకాల సాంకేతిక పరిజ్ఞానం మన సొంతం. చేతి మగ్గంపై నేసిన వస్త్రాల నుంచి మిల్లుల వరకు ఈ దేశంలో అనేక రకాలుగా నైపుణ్యం కనపడుతుంది. ఇంతటి వైవిధ్యం కలిగిన భారత జౌళి రంగంలో కనీసం పది కోట్ల మంది కేవలం సహజ ఫైబర్ ఉత్పత్తుల మీద ఆధారపడి జీవిస్తున్నారు. సహజ ఫైబర్ ఉత్పత్తులలో పత్తి, సిల్క్, జూట్, ఉన్ని, అరటి వంటి అనేక రకాల వ్యవసాయ పంటలున్నాయి. ఈ వ్యవసాయ ఉత్పత్తుల నుంచి నార తీసి, నూలు తయారుచేసే కుటీర, చిన్న, పెద్ద పరిశ్రమలు ఉన్నాయి. ఈ నూలు నుంచి జౌళి, వస్త్రాలు తాయారు చేసే చేనేత పారిశ్రామికులు, పెద్ద పరిశ్రమలు ఉన్నాయి. అన్ని రంగాలు అన్ని రాష్ట్రాలలో వివిధ స్థాయిలలో ఉండడం మనకు చిరపరిచితమే. కాకపోతే, పత్తి నూలుకు సంబంధించిన పరిశ్రమ కేవలం తమిళనాడులో కేంద్రీకృతమై ఉన్నది. అట్లాగే, కృత్రిమ నూలుకు సంబంధించిన పరిశ్రమ గుజరాత్ రాష్ట్రంలో కేంద్రీకృతమై ఉన్నది.

1995లో ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పాటు సందర్భంగా జరిగిన ఒప్పందాలలో భాగంగా భారత ప్రభుత్వం దేశీయ జౌళి రంగాన్ని సంస్కరించ పూనుకున్నది. 2005లో ప్రపంచవ్యాప్తంగా 'ఎస్.డబ్ల్యు.ఇ.సి.' స్వేచ్ఛా వస్త్ర వాణిజ్యం అమలులోకి వచ్చిన తర్వాత కూడా సంస్కరణల పరంపర కొనసాగింది. ఎగుమతుల ద్వార భారత జౌళిరంగం ఇంకా వేగంగా అభివృద్ధి చెందే అవకాశాలున్నాయని జౌళి

విధానాలలో మార్పులు తీసుకుని రావడం జరిగింది. ఈ మార్పులలో కుటీర, చిన్న, చేనేత రంగాలకు ప్రాధాన్యం కల్పించలేదు. గత పదేళ్లలో, పెద్ద పారిశ్రామికులకు ఆధునీకరణ పేరుతో దాదాపు లక్ష కోట్ల రూపాయల రాయితీలు, సబ్సిడీలు, ప్రోత్సాహకాలు ఇచ్చారు. చేనేత వంటి రంగాలకు పూర్తిగా మొండి చెయ్యి చూపారు. ఇంత చేసినా, ఎగుమతులు అనుకున్న, ఆశించిన స్థాయిలో పెరగలేదు. ప్రపంచ ఆర్థిక మాంద్యం కూడా దీనికి కారణం. చైనా లాగా భారత జౌళిరంగం, అన్ని వసతులు కల్పించినా ఎందుకు పెరగలేదు అనే ప్రశ్నకు సమాధానం వెతకకుండా, ఇంకా రాయితీలు, సబ్సిడీలు, ప్రోత్సాహకాలు కల్పించే దిశగా జాతీయ ఫైబర్ విధానం రూపొందించబడింది. ఇప్పటికే, గత పదేళ్ల విధానపర వివక్షతో కుదేలైన చేనేత పరిశ్రమ, దాని మీద ఆధారపడి జీవిస్తున్న కుటుంబాలకు ఇది గొడ్డలిపెట్టు.

సహజ ఫైబర్ వచ్చే పంటలను ఉత్పత్తి చేసే రైతులకు కూడా ఇది హానికారమే. పత్తి రైతులు ఉత్పత్తి ఖర్చులు పెరిగి పోయి, మార్కెట్లో గిట్టుబాటు ధర రాక నానా ఇబ్బందులు పడుతున్నారు. నాణ్యమైన విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు దొరకక అధిక ధరలకు కొని మోసపోతున్నారు. కనీస మద్దతు ధర ఉన్న, అనేక ప్రాంతాలలో దాని ఫలితం దొరకక రైతులు నష్టపోవడం మనకు తెలిసిందే. సెరికల్చర్ రైతులు, జనపనార పండించే రైతులకు ఈపాటి వసతులు లేక, సేద్యాన్నే వదులుకుంటున్నారు. గోగునార కింద ఇదివరకున్నని ఎకరాల భూమి ఇప్పుడు లేదు. దీనిపైనే ఆధారపడి జీవించే రైతులు, పరిశ్రమలలో పనిచేసే కార్మికులు ఉత్తరాంధ్ర జిల్లాలలో అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. సహజ ఫైబర్ నూలు వచ్చే పంటలు, వాటిని పండించే రైతులు లాభపడకుండా, వారి సమస్యలు తీర్చకుండా, వాటి జోలికి వెళ్లకుండా, జాతీయ ఫైబర్ విధానం 'నేల విడిచి సాము చేస్తున్న' చందంగా తయారు చేయబడింది.

సేంద్రీయ పద్ధతిలో, రసాయన పురుగు మందులు ఉపయోగించకుండా పత్తిని పండించే రైతుల గురించీ ఈ విధానంలో ప్రస్తావించినా అవసరమైన చర్యలు మాత్రం ప్రతిపాదించలేదు. రైతులకు మేలు చేసే ఈ పద్ధతినైన ప్రోత్సహిస్తే బాగుండేది.

**వివిధ జౌళి ఉప రంగాలలో ఉపాధి**

| క్ర.సం. | రంగం | మిలియన్ | వాటా % | పెరుగుదల |
|---|---|---|---|---|
| 1 | మిల్లు రంగం | 0.94 | 2.87 | 0.46 |
| 2 | ఎం.ఎం.ఎఫ్. రంగం | 0.16 | 0.49 | 0.08 |
| 3 | పవర్‌లూమ్ | 4.86 | 14.83 | 0.22 |
| 4 | చేనేత | 6.5 | 19.84 | 0.50 |
| 5 | నిట్టింగ్ | 0.43 | 1.31 | 0.02 |
| 6 | ప్రాసెస్సింగ్ | 0.29 | 0.88 | 0.15 |
| 7 | ఉన్ని | 1.5 | 4.58 | 1.70 |
| 8 | రెడీమేడ్ వస్త్రాలు | 5.57 | 17.00 | 5.65 |
| 9 | సెరికల్చర్ | 5.95 | 18.16 | 1.75 |
| 10 | చేతివృత్తులు | 6.57 | 20.05 | 1.43 |
| | మొత్తం జౌళి రంగం (జనపనార మినహాయిస్తే) | 32.77 | 100 | |

మూలం : సెంటర్ ఫర్ ట్రేడ్ డెవలప్‌మెంట్ (సి.ఇ.ఎన్.టి.ఎ.డి.), 2009

పత్తి ఉత్పతి ప్రస్తుతం 2010-11లో 319 లక్షల బేళ్లుకాగా, 2020 నాటికీ 483 లక్షల బేళ్లు అవుతుందని, జాతీయ ఫైబర్ విధానం అంచనా. రైతుకు లాభంలేకుండా, దానికి అనుగుణమైన ప్రభుత్వ చర్యలు లేకుండా ఇది ఎలా సాధ్యమో ఈ ముసాయిదా వివరించలేదు. అదనంగా ఈ పాటి పత్తి ఉత్పత్తి పూర్తిగా వినియోగం కాకుండా, ఏటా మిగులు ఉంటుంది అని కూడా చెప్పారు. 2019-20 నాటికి ఈ మిగులు 70 లక్షల బేళ్లకు చేరుతుందని అంచనా. ఈ అంచనాలలో ఉన్న శాస్త్రీయత ప్రక్కన పెడితే, దేశీయంగా ప్రత్తి వినియోగం పెరుగుతున్నా కూడా మిగులు ఉంటుంది అని చెప్పడం గమనార్హం. పెరుగుతున్న దేశీయ పత్తి ఉత్పత్తి పూర్తిగా వినియోగించుకోవాలంటే ఆధునిక ప్రాసెస్సింగ్ పరిశ్రమ అభివృద్ధి జరగాలని ఈ ముసాయిదా చెపుతున్నది. ఇంతటి విశ్లేషణ కలిగిన ఈ ముసాయిదా, మిగులు ఉన్నప్పుడు ప్రస్తుతం నూలు ధరలు ఎందుకు పెరుగుతున్నాయో చెప్పలేదు. ప్రత్తి ఉత్పత్తి పెరిగినా, సమాంతరంగా దేశీయ వినియోగం ఎందుకు పెరగడంలేదో చెప్పలేక పోయింది.

ముడి పత్తి, పత్తి నూలు ఎగుమతులు పెరుగుతున్నాయి. పత్తి వస్త్రాల ఎగుమతులు కూడా పెరుగుతున్నాయి. పత్తి ఉత్పత్తి ఖర్చులు పెరుగుతున్నాయి. పత్తి నూలు ధరలు పెరుగుతున్నాయి. పత్తి వస్త్రాల ఉత్పత్తి ఖర్చులు కూడా పెరుగుతున్నాయి. అంతర్జాతీయ, జాతీయ స్థాయిలో పోటి తీవ్రంగా ఉన్నపుడు, ప్రపంచ వస్త్ర వాణిజ్యంలో భారత దేశం వాటా పెంచుకోవాలనే లక్ష్యం ఉన్నపుడు ఈ విధంగా అన్ని ఉత్పత్తి ప్రక్రియలలో ఖర్చులు, ధరలు పెరగడమనే సమస్యను ఈ జాతీయ ఫైబర్ ముసాయిదా విధానం విస్మరించడం ఏ ప్రయోజనం కోరకు అనే అనుమానం వస్తుంది.

ఈ విధానం పూర్తిగా కృత్రిమ నూలు ఉత్పత్తికి, పాలియెస్టర్ వస్త్ర పరిశ్రమకు ప్రయోజనం చేకూర్చడానికే అని ముసాయిదాలో స్పష్టంగా చెప్పబడింది. మాన్ మేడ్ ఫైబర్ (ఎం.ఎం.ఎఫ్.)గా పిలవబడే కృత్రిమ నూలును, దాని ఆధారంగా తయారు చేసే వస్తువుల (వస్త్రాలు కాకుండా ఇతర) గురించి ఈ విధాన రూపకల్పన అని స్పష్టంగా పేర్కొన్నారు. స్వేచ్ఛా వాణిజ్య నేపథ్యంలో ఎం.ఎం.ఎఫ్. ఉత్పత్తుల దిగుమతులను అరికట్టి, ఎగుమతులు పెంచుకోవాలంటే ఈ పరిశ్రమకు రాయితీలు, సబ్సిడీలు, ప్రోత్సాహకాలు ఇవ్వక తప్పదని ఈ ముసాయిదాను సమర్థించడం జరుగుతున్నది. అనగా ఎం.ఎం.ఎఫ్. ఉత్పత్తుల ఖర్చులు తగ్గించే ప్రయత్నం ఈ విధానం ద్వారా చెయ్యడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఇది పూర్తిగా వివక్ష పూరిత నిర్ణయం. సహజ ఫైబర్ ఉత్పత్తులు గురించి పట్టించుకోకుండా ఎం.ఎం.ఎఫ్. గురించి మాత్రమే స్పందించడం సరియైన నిర్ణయం కాదు. దాదాపు పది కోట్ల కుటుంబాల ఉపాధి గురించి పట్టించుకోకపోవడం శోచనీయం. ఇందులో ముఖ్యంగా చిన్న, సన్నకారు రైతులు, చేనేత కార్మిక కుటుంబాల పరిస్థితి చక్కదిద్దాల్సిన బాధ్యత ప్రభుత్వం మీద ఉన్నది.

ఎం.ఎం.ఎఫ్. ఉత్పత్తులకు రాయితీలు, సబ్సిడీలు, ప్రోత్సాహకాలు ఇవ్వడం వలన దిగుమతులు ఆగుతాయా అన్నది అనుమానమే. అక్కడ ప్రభావం ఉన్నా లేకపోయినా, ఇది చెయ్యడం వలన దేశీయ పత్తి ఉత్పత్తులకు డిమాండ్ తగ్గే అవకాశం ఉన్నది. వాటి ధరలు పాలియెస్టర్ వస్త్రాలతో పోలిస్తే ఎక్కువ. పేదరికం, కొనుగోలు శక్తి తగ్గిపోతున్న దశలో, జీవన ఖర్చులు పెరుగుతున్న క్రమంలో అనేక కుటుంబాలు ఎం.ఎం.ఎఫ్. ఉత్పత్తులు కొనాల్సిన పరిస్థితి వస్తున్నది. ఈ ముసాయిదా

విధానం వలన పత్తి వస్త్రాలు సామాన్యుడికి అందుబాటులోకి రాకుండా పోతాయి. పత్తి పరిశ్రమ కేవలం ఎగుమతుల మీదనే ఆధారంగా ఉత్పత్తి చేయవలసి వస్తుంది. ఎగుమతుల మీద ఆధారపడడం ఒక భ్రమ అవుతుంది. దేశీయ జౌళి పరిశ్రమ ప్రమాదంలో పడుతుంది.

ఎం.ఎం.ఎఫ్. ఉత్పత్తి పెరగడం వల్ల పర్యావరణ వినాశనం పెరుగుతుంది. అందులో వాడే రసాయనాలు, ఇంధనాలు, కరెంట్ వలన అనేక పర్యావరణ అనర్థాలు. పాలియెస్టర్ వస్త్రాలు ధరించడం వల్ల ఉష్ణోగ్రత ఎక్కువగా ఉండే భారత దేశంలో అలెర్జీలు, చర్మరోగాలు వచ్చే అవకాశాలు పెరుగుతాయి.

ఈ విధానం వల్ల ఏ వర్గం లబ్ధి పొందుతుందో చెప్పలేదు. భారత జౌళి రంగానికి కావాల్సిన ముడి నూలు రకాలను ఉత్పత్తి చేసేది రైతులు. ఈ విధానం వల్ల రైతులు ఏ విధంగా లాభం పొందుతారు, వారు ఎదుర్కొంటున్న సమస్యలలో దేనికి ఈ విధానం పరిష్కారం చూపుతుంది అనే విషయాల మీద స్పష్టత లేదు. పత్తి రైతుల గురించి ప్రస్తావన ఉన్నా, వారి ప్రోత్సాహం కొరకు ఈ విధానంలో సరికొత్త ఆలోచనలు కనపడవు. గోగునార, జూట్, ఉన్ని, సిల్క్, ఇతర 'నూలు' పంటలను ఉత్పత్తి చేసే ఇతర రైతుల ప్రస్తావన అంతంతమాత్రమే. సేంద్రీయ పద్ధతిలో పత్తి ఉత్పత్తి చేసే రైతులకు సంబంధించి కొన్ని చర్యలు ప్రతిపాదించినా, ప్రస్తావించిన శైలిలో వాటి అమలు అనుమానమే.

రైతులు ఎదుర్కొంటున్న విత్తనాల కొరత, ధరల పెరుగుదల, నాణ్యత సమస్యలు గురించి గాని, పెరుగుతున్న పెట్టుబడి ఖర్చులు, రుణ సమస్యలు, మార్కెటింగ్ సమస్యలు గురించి గాని ఈ విధానంలో ఎటువంటి పరిష్కారాలు చూపబడలేదు. పత్తి ఉత్పాదకత పెరిగిన, పత్తికి కనీస మద్దతు ధర ఉన్న, అన్ని కేంద్రాలలో సరియైన సమయంలో కొనుగోళ్లు లేక రైతులు పడుతున్న ఇబ్బందుల ప్రస్తావన లేదు. వ్యవసాయ ఉత్పత్తులతో, రైతుల జీవితాలతో ముడిపడి ఉన్నా కూడా, ఈ విధాన రూపకల్పన కమిటీలో వ్యవసాయ శాఖకు కూడా ప్రాతినిధ్యం లేక పోవడం గమనించాల్సిన విషయం.

ఆశ్చర్యకరంగా, జాతీయ ఫైబర్ విధానం స్థానం మీద స్పష్టత లేదు. ఈ విధానం 2000 సంవత్సరంలో తీసుకు వచ్చిన జాతీయ జౌళి విధానం పైన అభివృద్ధి చేసినదా లేక ఈ రెండు విధానాలు వేరు వేరుగా ఉంటాయా? ఇవి రెండు వేరు విధానాలైతే, వీటి మధ్య సమన్వయం గాని సారూప్యం గాని ఉండాలి. అది మనకు కనపడదు. ప్రతిపాదించిన ఫైబర్ విధానంలోని అంశాలు జాతీయ జౌళి విధానం ఆశయాలకు వ్యతిరేకంగా ఉన్నాయి. ఒక కొత్త విధానం వచ్చినప్పుడు, పాత విధానంలోని లోపాలను గాని, అనుభవాలనుగాని, కొత్త పరిస్థితులనుగాని పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది. జాతీయ ఫైబర్ విధాన రూపకల్పనలో అటువంటి ప్రక్రియ జరగలేదు. అనేక విషయాలలో దూరదృష్టి, సమదృష్టి లోపించిన జాతీయ జౌళి విధానం గుణాలను, జాతీయ ఫైబర్ విధాన ముసాయిదాలో మాత్రం ప్రతిబింబించే అంశాలు మనకు కనబడతాయి.

ఈ నేపథ్యంలో ప్రతిపాదించిన జాతీయ ఫైబర్ విధానం పరిధి ఏమిటి? ఇది కేవలం వివిధ రకాల ఫైబర్స్ కు, (నూలు రకాల ఉత్పత్తికి) సంబంధించినదని చెపుతూ, దీనికి చేనేత రంగంతో అస్సలు సంబంధం లేదని చెపుతూ, ఎం.ఎం.ఎఫ్.కు సంబంధించిన అన్ని ప్రక్రియలను (నూలు ఉత్పత్తి నుంచి వస్త్ర/జౌళి ఉత్పత్తి వరకు) కూలంకషంగా ప్రస్తావించడం గమనించాల్సిన విషయం. ఈ విధానం పరిధి తోచిన విధంగా నిర్వచించడం ద్వారా ప్రభుత్వం విధాన రూపకల్పనలో ఉన్న

**ఫైబర్ ప్రకారంగా 2008-09లో ఎగుమతులు**
**(నూలు, వస్త్రాలు, మేడుప్స్)**

| ఫైబర్ | ఎగుమతులు (అంకెలు యు.ఎస్. డాలర్లలో) |
|---|---|
| సిల్క్ | 537 |
| ఉన్ని | 571 |
| పత్తి | 12,709 |
| జనపనార రకాలు | 155 |
| కృత్రిమ | 3,897 |
| మొత్తం | 17,869 |

డొల్లతనాన్ని బయటపెట్టింది. అన్ని రకాల సహజ ఫైబర్ నూలు ఉపయోగించి అనేక రకాల జౌళి ఉత్పత్తులను తయారు చేసే సామర్థ్యం కేవలం చేనేత రంగానికే ఉన్నది. ఈ నిజాన్ని, ప్రభుత్వం విస్మరించడం విస్మయం కలిగిస్తున్నది. కేవలం బడా కార్పొరేట్ సంస్థల ప్రాతినిధ్యం ద్వారా, వారికే మేలు చెయ్యడానికి ఈ ప్రక్రియ మొదలుపెట్టడం ప్రజాస్వామ్యంలో అక్షేపించదగింది.

జాతీయ ఫైబర్ విధానంలో చేనేతకు స్థానంలేదు అని చెప్పడం ద్వారా కేంద్ర జౌళి శాఖ మంత్రి దయానిధి మారన్ భారత జౌళి రంగంలో ప్రభుత్వ ఆలోచనలను బహిర్గతం చేశారు. అన్ని రకాల సహజ ఫైబర్ నూలు ఉపయోగంలో ముఖ్య భూమిక వహిస్తున్న చేనేతకు స్థానం లేదు అనడం భరించరానిది. ఇది ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదు.

ఒకవైపు చేనేతకు స్థానం లేదు అంటూ, ఆధునిక ప్రాసెస్సింగ్ పరిశ్రమలకు ప్రోత్సాహకాలు ఇవ్వాలని సిఫారసు చెయ్యడం ఈ ముసాయిదాలో మనకు కనపడుతుంది. ఈ ముసాయిదాలోని అంశాలను బట్టి అసలు విధానం అంటే ఏమిటి అనే ప్రశ్న ఉత్పన్నం అయ్యే అవకాశాలు ఉన్నాయి. ఇందులో పథకాలను, ప్రోత్సాహకాలను, స్కీంలను ఒకే గాటన కట్టి జాతీయ ఫైబర్ విధానం అని నామకరణం చేశారు. వీటిని వేరుచేసి చూడడానికి ప్రత్యేక నైపుణ్యం అవసరం ఉంటుంది. ఈ ముసాయిదాలో ఒక స్పష్టమైన నిర్మాణం కనపడదు. లక్ష్యాలు, ఉద్దేశాలు, సిఫార్సులు, సమస్యలు, పరిష్కారాలు అన్ని కలగలిపి ఉంటాయి. చదివేవాళ్లకు ఓపిక చాలా అవసరం.

ఈ విధానం ప్రధాన లక్ష్యం భారత జౌళిరంగం పోటి చేసే సామర్థ్యాన్ని పెంచడం. కాకపోతే, దీనిని సాధ్యపరిచేందుకు ఎటువంటి వ్యూహం అవసరం అనే దాని మీద దృష్టి కనపడదు. కేవలం రాయితీలు, సబ్సిడీలు, ప్రోత్సాహకాల ద్వారా, అదీ కేవలం ఎం.ఎం.ఎఫ్. పరిశ్రమకు ఇవ్వడం ద్వారా సాధ్యపడుతుంది అనుకోవడం పొరపాటే అవుతుంది. పోటి సామర్థ్యం పెంచాలంటే వైవిధ్యాన్ని కాపాడుకొంటూ, వివిధ ఉపరంగాల మధ్య సమన్వయం ఏర్పరిచి, అన్ని ఉపరంగాల అంతర్గత సమస్యలు పరిష్కరించి, ఉత్పత్తి ఖర్చులను తగ్గించాలి. కాని, ఈ ముసాయిదా జాతీయ ఫైబర్ విధానం ఉపరంగాల మధ్య ప్రభుత్వ సబ్సిడీల కొరకు పోటీ పెంచి తదనంతరం రాజకీయ లబ్ది పొందే విధంగా రూపొందించారు.

ఈ విధానం తీసుకుని రావడానికి ప్రధాన ఉద్దేశం భారత జౌళి రంగంలో పోటి చేసే సామర్థ్యం పెంచాలని చెప్పడం జరిగింది. కాకపోతే, ఉత్పత్తి ఖర్చులో సింహభాగం పెరుగుతున్న నూలు ధరలే ఆక్రమిస్తుంటే, చిన్న ఉత్పత్తిదారులు పోటీలో నిలదొక్కుకోవడానికి ఇబ్బంది పడుతున్నారు. ఈ సమస్యకు పరిష్కారం చూపే సరికొత్త ఆలోచన ఏదీ

ఈ ముసాయిదాలో ప్రతిపాదించబడలేదు. ఇంకొక ఉద్దేశం ఉత్పత్తి గొలుసులో ఉన్న అందరు భాగస్వాములకు తగిన విధంగా లాభాలు పెంచాలని కూడా ఉన్నది. ఈ ఉద్దేశానికి అనుగుణంగా తగిన విధంగా, చిన్న రైతులకు, చిన్న ఉత్పత్తిదారులకు, చేనేత పారిశ్రామికులకు మేలు చేకూర్చే ప్రతిపాదన మాత్రం ఒక్కటి కూడా ఇందులో లేదు.

ఈ విధానం దృష్టి ఆయా జౌళి ఉపరంగాలకు మేలుచేసే విధంగా కాకుండా, జాతీయ జౌళి పరిశ్రమ దీర్ఘకాలిక ప్రయోజనాలు కాపాడే విధంగా కాకుండా, కేవలం కొన్ని బడా, వ్యక్తిగత పరిశ్రమ లాభాలు పెంచే విధంగా రూపొందించబడింది. కొన్ని పెద్ద వ్యాపారవర్గాల గుత్తాధిపత్యాన్ని కొనసాగించడానికి ఇందులోని ప్రతిపాదనలు ఉపయోగపడతాయి. ప్రపంచ వస్త్ర వాణిజ్యంలో భారత ఉత్పత్తులకు ఉన్న ఆదరణ ఇక్కడి ఉత్పత్తి పద్ధతులబట్టే ఉంది. సాంకేతికంగా తక్కువ, మానవ శ్రమ, నైపుణ్యం ఎక్కువగా ఉండే భారత జౌళి రంగం గురించి భయపడే అమెరికా, యూరోపియన్ దేశాలలో అత్యంత ఆధునిక పద్ధతులలో వస్త్ర ఉత్పత్తి జరుగుతుంది. అంటే, ఆధునిక వస్త్ర పరిశ్రమ పోటిలో మనజాలదు. భారత పద్ధతిలో చెయ్యడం వలన, మన దిగుమతులతో పోటి పడలేక అక్కడి పరిశ్రమలు మూతపడడం లేదా ఇతర సాంకేతిక ఉత్పత్తుల వైపు మళ్లడం మనం గమనించాలి.

ఇటువంటి పరిస్థితుల్లో, భారత జౌళి రంగం ఆధునికం దిశగా పయనించడం సరి కాదు. జాతీయ ఫైబర్ విధానంలో ఆ దిశగా అడుగులు వేసే ప్రతిపాదనలు చెయ్యడం ఆత్మహత్యాసదృశ్యం. గత పదేళ్లలో జాతీయ జౌళి విధానంవల్ల అనేక ప్రాంతాలలో అనేక కుటుంబాలు ఉపాధి కోల్పోయ్యాయి. పేదరికం పెరిగింది. నిపుణులు కనుమరుగు అవుతున్నారు. ఈ పరిస్థితుల్లో జాతీయ ఫైబర్ విధానం చక్కదిద్దే ప్రతిపాదనలు చెయ్యకుండా గోరుచుట్టుపై రోకటి పోటు లాగ ఎం.ఎం.ఎఫ్./కృత్రిమ నూలు అభివృద్ధి బాట పట్టడం అత్యంత భాధాకరం.

జాతీయ ఫైబర్ విధాన ముసాయిదాలో కొన్ని కొత్త సంస్థలను ఏర్పాటు చేసే ప్రతిపాదనలు ఉన్నాయి. అవి: నూలు సలహా బోర్డు ఏర్పాటు, ఎం.ఎం.ఎఫ్./కృత్రిమ నూలు ఉత్పత్తులకు సలహా కౌన్సిల్, సేంద్రియ, సువెన్, అధిక పొడవు పత్తి రకాలకు సంబంధించి అంతర మంత్రిత్వ శాఖల సమన్వయ కమిటీ, ప్రత్యేక పత్తి మీద టెక్నాలజీ మిషన్ (టెక్నాలజీ మిషన్ ఆన్ స్పెషాలిటీ కాటన్), టెక్నికల్ టెక్స్‌టైల్స్ మీద టెక్నాలజీ మిషన్ (టెక్నాలజీ మిషన్ ఆన్ టెక్నికల్ టెక్స్‌టైల్స్), ఉన్ని మీద అంతర మంత్రిత్వ శాఖల సమన్వయ కమిటీ.

ఇందులో నూలు సలహా బోర్డు కేవలం చిలపల నూలు సమాచార సేకరణ, క్రోడీకరణ కొరకే. దీని వలన చేనేత రంగానికి అవసరమైన స్థాయిలో చిలపల నూలు అందుబాటులోకి వస్తుందా అనే అనుమానం ఒక పక్క ఉండగా, అసలు ఈ ప్రతిపాదన సరియైనది కాదంటూ మిల్లులు, స్పిన్నింగ్ మిల్లుల ప్రతినిధులు వ్యాఖ్యానించడం గమనార్హం. ప్రభుత్వానికి చేనేత రంగానికి అవసరమైన చిలపల నూలు అందించాలని చిత్తశుద్ధి ఉంటే, ఈ ముసాయిదాలో ప్రతిపాదించిన విధంగా నూలు సలహా బోర్డు ఏర్పాటు చేసి, దాని విధి విధానాలు విస్తృతపరిచి, చిలపల నూలుకు సంబంధించి అన్ని చర్యలు చేపట్టాలి.

కృత్రిమ నూలుకు, పాలియస్టర్ వస్త్రాల ఉత్పత్తికి ప్రోత్సహించే ఈ ముసాయిదా వలన పేద ప్రజలు సహజ నూలు వస్త్రాలు కొనే స్తోమత కోల్పోతారు. ఒకప్పుడు, 80వ దశకంలో, ప్రభుత్వం ఒక నినాదం తీసుకు వచ్చింది – 'పేదలకు పత్తి వస్త్రాలు, ధనికులకు పాలియస్టర్ వస్త్రాలు'. గత పదేళ్లలో ఈ పరిస్థితి తారుమారు అయింది. ప్రస్తుతం ప్రతిపాదించిన జాతీయ ఫైబర్ విధానం వల్ల ఈ నినాదం మార్చాల్సిన పరిస్థితి వస్తుంది – పేదలకు పాలియస్టర్ వస్త్రాలు, ధనికులకు పత్తి వస్త్రాలు. ఈ పరిస్థితి ఉత్పన్నమైతే పేద వినియోగ వర్గాలు అత్యంత దుర్భర పరిస్థితులలో పనిచేసేవారు పాలియస్టర్ వస్త్రాలు ధరించడం వలన అనారోగ్య పరిస్థితులకు గురి అవుతారు. దేశంలో పత్తి వస్త్రాల వినియోగం తగ్గిపోతుంది. తదనుగుణంగా, పత్తి వస్త్రాల ఉత్పత్తిపై ఆధారపడి జీవించే అనేక కుటుంబాలు ఉపాధి కోల్పోతాయి.

ఈ ప్రకారంగా, మార్కెట్లో వివిధ రకాల ఉత్పత్తి రంగాలకు ఉన్న వాటాలను జాతీయ ఫైబర్ విధానం ప్రభావితం చేస్తుంది. పెద్ద పారిశ్రామికులకు అనుగుణంగా, వారి మార్కెట్ వాటాలను పెంచే విధంగా ఈ విధానం రూపొందించారు. ఇది ఫైబర్ న్యూట్రల్ విధానం అని చెబుతూనే, నిష్పక్ష విధానం అవసరం అని చెబుతూనే, పూర్తిగా ఎం.ఎం.ఎఫ్./కృత్రిమ నూలుకు ప్రోత్సాహమివ్వడం ఈ విధానంలో మనం గమనించాల్సిన ముఖ్య విషయం.

క్లుప్తంగా, ఈ విధానం లోపభూయిష్టంగా ఉంది. దీని వలన ఉపాధి తగ్గవచ్చు, దిగుమతులు పెరగవచ్చు, పర్యావరణ విధ్వంసం పెరగవచ్చు, దేశీయ పరిశ్రమ ప్రమాదంలో పడవచ్చు. ఈ విధానం దేశీయ జౌళి పరిశ్రమ ఎదుర్కొంటున్న సమస్యలను పూర్తి స్థాయిలో అర్థం చేసుకోలేదు. చూపిన పరిష్కారాలు విజ్ఞతతో చేసినవి కావు. దీర్ఘకాలిక దేశీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని చెప్పినవి కావు. ఈ ముసాయిదా జాతీయ ఫైబర్ విధానం సరి చెయ్యాలంటే, దీనిపైన విస్తృత చర్చలు చెయ్యాల్సిన అవసరం ఎంతైన ఉంది. చిన్న, సన్నకారు రైతులు, చేనేత కార్మిక కుటుంబాల సమస్యలు, పరిష్కారాలు ఇందులో మిళితం చేసి ఒక సమగ్ర విధానం రూపకల్పన చెయ్యాలి. దేశీయ జౌళి రంగంలోని అన్ని ఉప రంగాల ప్రయోజనాలు కాపాడాల్సిన అవసరం ఎంతైన ఉంది.

ఈ విధానం అమలులోకి వస్తే భారత జౌళి రంగం స్వరూపం మారిపోయే అవకాశం ఉన్నది. మొదటగా, చిన్న ఉత్పత్తిదారులు కనుమరుగు అవుతారు. రెండవ దశలో దిగుమతులు, విదేశీ ఉత్పత్తులు పెరిగిపోతాయి. ఈ రెండు దశల క్రమంలో సహజ నూలు ఉత్పత్తులు 60 శాతం దేశ ప్రజలకు అందుబాటులో ఉండవు.

స్థూలంగా, వస్త్ర ఉత్పత్తిని, వినియోగాన్ని పూర్తిస్థాయిలో, సంపూర్ణంగా మార్చే ఇటువంటి విధానం వల్ల ఉన్న ఉపాధి కోల్పోయి, వినియోగంలో స్వావలంబన కోల్పోయి, స్వతంత్ర జౌళి రంగం ఉనికి కోల్పోయి, విదేశీ ఉత్పత్తుల మీద ఆధారపడే పరిస్థితి వచ్చే ప్రమాదం ఈ జాతీయ ఫైబర్ విధానం వల్ల ఉన్నప్పుడు, దీనిని పునరాలోచించి, విస్తృత చర్చలు జరిపి, అందరి అభిప్రాయాలు తీసుకొని ఒక ఆమోదయోగ్యమైన విధానం తీసుకురావాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

జాతీయ ఫైబర్ విధానంలో వివిధ జౌళి ఉపరంగాలలో పెరుగుతున్న ఉత్పత్తి ఖర్చుల్ని తగ్గించే పథక రచన జరగాలి. దేశీయ జౌళిరంగం ప్రాశస్త్యం సహజ నూలు ఉత్పత్తులు కనుక వీటిని ప్రోత్సహించేలా వ్యూహాలు పొందుపరచాలి. మార్కెట్లో వినియోగదారులు మోసపోకుండా జౌళి ఉత్పత్తులకు లేబులింగ్ చట్టం తీసుకురావాలి. సహజ నూలు కొరకు ఒక నిధిని (నేచురల్ ఫైబర్ ఫండ్) ఏర్పాటు చెయ్యాలి. నూలు ధరల స్థిరీకరణ కొరకు ప్రత్యేక నియంత్రణ యంత్రాంగం ఏర్పాటు చెయ్యాలి.

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త)* వీ

*అఖిల రష్యా ట్రేడ్ యూనియన్ ఐదవ మహాసభలో కమ్యూనిస్టు బృందాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ 3 నవంబర్ 1920న లియోన్ ట్రాట్స్కీ ఒక చర్చను ప్రారంభించాడు. అప్పుడప్పుడే ఏర్పడిన బోల్షివిక్ రాజ్యంలో సోషలిస్టు నిర్మాణంలో ట్రేడ్ యూనియన్‌ల పాత్ర గురించి, కర్తవ్యాల గురించి ఈ చర్చ మొదలైంది. తన ఉపన్యాసంలో ట్రాట్స్కీ చేసిన తప్పుడు సూత్రీకరణలను విమర్శిస్తూ లెనిన్ 30 డిసెంబర్ 1920న 'ఆన్ ది ట్రేడ్ యూనియన్స్' అనే ఉపన్యాసం చేశాడు. ఆ చర్చ మరింత కొనసాగి లెనిన్ 19 జనవరి 1921న 'ది పార్టీ క్రైసిస్' అనే వ్యాసం రాశాడు. జనవరి 21 నుంచి 25 వరకు 'వన్స్ అగెయిన్ ఆన్ ది ట్రేడ్ యూనియన్స్' అనే వ్యాసం రాశాడు. ఈ చివరి వ్యాసంలో అసలు ఒక విషయాన్ని ఎలా చూడాలి అనే అంశాన్ని వివరిస్తూ లియోన్ ట్రాట్స్కీ, నికొలాయ్ బుఖారిన్ ల తప్పుడు పద్ధతిని విమర్శించాడు. దాదాపు నలభై పేజీల ఆ వ్యాసం నుంచి పరిశీలనా పద్ధతికి సంబంధించిన భాగాల అనువాదం కింద ఇస్తున్నాం.*

# గతితర్క పరిశీలనా పద్ధతి

**...డి**సెంబర్ 30న జరిగిన చర్చలో బుఖారిన్ ఒక వాదన చేశాడు : 'ట్రేడ్ యూనియన్‌లు అంటే కమ్యూనిజాన్ని నేర్పే పాఠశాలలు అని కామ్రేడ్ జినోవీవ్ అన్నాడు. ట్రేడ్ యూనియన్‌లు అంటే పారిశ్రామిక నిర్వహణకు సంబంధించిన సాంకేతిక, పాలనాపరమైన సాధనం అని ట్రాట్స్కీ అన్నాడు. ఈ రెండు ప్రతిపాదనలను తప్పని అనడానికి ఎటువంటి తార్కిక ఆధారమూ లేదని నాకనిపిస్తుంది. ఈ రెండిటి సమ్మేళనం సరయినదని నాకనిపిస్తుంది.'

బుఖారిన్, ఆయనతో పాటు ఉన్న 'బృందం' లేదా 'అనుచర గణం' ఇదే విషయాన్ని వారు రాసిన ఆరవ థీసిస్‌లో కూడా ప్రకటించారు: 'ఒకపక్క ట్రేడ్ యూనియన్‌లు కమ్యూనిజానికి పాఠశాలలు... మరొకపక్క అవి నానాటికీ ఎక్కువగా, మొత్తంగా ఆర్థిక వ్యవస్థ నిర్వహణలోనూ, రాజ్యాంగ యంత్ర పాలనలోనూ అవిభాజ్యమైన భాగంగా ఉంటున్నాయి.'

ఇక్కడే బుఖారిన్ చేస్తున్న మౌలికమైన, సైద్ధాంతికమైన పొరపాటు ఉంది. ఆయన ఇక్కడ మార్క్సిస్ట్ గతితర్కానికి బదులుగా కలగలుపుడు వాదాన్ని ప్రవేశ పెడుతున్నారు. ఈ కలగలుపుడు వాదం అనేది అనేక రకాల 'కొత్తొక వింత' తాత్విక విధానాల, అభివృద్ధి నిరోధక తాత్విక విధానాల రచయితలకు చాలా ఇష్టమైన వాదం.

తార్కిక ఆధారాలు లేవని కామ్రేడ్ బుఖారిన్ అంటున్నప్పుడు మొత్తంగా ఆయన వాదనా పద్ధతి అంతా బహుశా అసంకల్పితంగానే కావచ్చు గానీ, మార్క్సిస్ట్ గతితార్కిక వాదాన్ని అనుసరించడం లేదు. అది రూపపరమైన, పాండిత్య ప్రకర్షగల తర్కాన్ని మాత్రమే అనుసరిస్తోంది. బుఖారిన్ స్వయంగా ఇచ్చిన సాదా ఉదాహరణ సహాయంతోనే దీన్ని వివరిస్తాను. డిసెంబర్ 30 చర్చలో ఆయన ఏమన్నాడంటే: "కామ్రేడ్స్, ప్రస్తుతం సాగుతున్న వివాదమంతా ఇలా ఉందని మీలో చాలామంది గుర్తించగలరు. అదేమంటే, ఇద్దరు మనుషులు ఒక గదిలోకి వస్తారు. అక్కడ వేదిక మీద ఉన్న లోటాను వర్ణించమని ఒకరినొకరు అడుగుతారు. ఒకరేమో 'అది ఒక కుంభాకార గాజు. అలా కాకుండా మరొకరకంగా వర్ణించే వాళ్లకు బుద్ధిలేదు' అంటారు. మరొకరేమో 'అది కేవలం తాగడానికి ఉపయోగించే పాత్ర. అలా కాకుండా మరొకరకంగా వర్ణించే వాళ్లకు బుద్ధిలేదు' అంటారు."

బుఖారిన్ ఇచ్చిన ఉదాహరణ ఏకపక్ష ఆలోచనా ధోరణి ప్రమాదానికి సుప్రసిద్ధమైన ఉదాహరణగా నిలుస్తుందని నాకనిపిస్తుంది. ఈ ఉదాహరణ ఇచ్చినందుకు ఆయనకు కృతజ్ఞతలు. అంతేకాదు, ఈ ఉదాహరణ గతితర్కానికీ, కలగలుపుడు వాదానికీ తేడా ఏమిటో చెప్పడానికి సుప్రసిద్ధమైన, అత్యద్భుతమైన ఉదాహరణగా కూడా పనికొస్తుంది.

ఒక లోటా తప్పని సరిగా ఒక కుంభాకార గాజుగానూ ఉంటుంది, తాగడానికి ఉపయోగించే పాత్రగానూ ఉంటుంది. అంతేకాదు, దానికి ఈ రెండు లక్షణాలకన్న, గుణాలకన్న, ముఖాలకన్న ఇంకా ఎక్కువ కూడా ఉండే అవకాశం ఉంది. అవి, అసంఖ్యాకంగా కూడా ఉండవచ్చు. దానికీ, మిగతా ప్రపంచానికీ ఉన్న 'మధ్యవర్తిత్వాలు' అంతస్సంబంధాలు లెక్కలేనన్ని ఉండవచ్చు. ఒక లోటా అనేది ఎవరిమీదికైనా విసరడానికి ఉపయోగపడే బరువైన వస్తువు. దాన్ని కాగితాలు ఎగిరిపోకుండా బరువుగా వాడుకోవచ్చు. దానిలో ఒక సీతాకోక చిలుకను బంధించి, ఆకర్షణీయంగా చూడడానికి ఉపయోగించవచ్చు. లేదా, దానిమీద కళాత్మకమైన చెక్కడాలూ, అలంకారాలూ ఉన్న విలువైన వస్తువు కావచ్చు. ఇవన్నీ ఎలా ఉన్నా, వాటికి అది తాగడానికి ఉపయోగపడే పాత్ర కావడానికి సంబంధం లేదు. అది గాజుతో తయారైందనడానికి, అది కుంభాకారంగా ఉందనడానికి ఇటువంటి అనేక వివరణలకూ, వర్ణనలకూ సంబంధం లేదు.

అంతేకాదు, నాకు ఇప్పటికిప్పుడు మంచినీళ్లు తాగడానికి ఒక లోటా కావాలనుకోండి, అది ఎంత కుంభాకారంగా ఉందో, అది నిజంగా గాజుతో తయారైందో లేదో, నాకు అక్కరలేదు. నాకు కావలసిందల్లా ఆ లోటా అడుగున ఏవైనా చిల్లులున్నాయా లేదా అనేదే. లేదా, నేను పెదాలానించి తాగే దగ్గర అది పగిలిపోయి, నన్ను గాయపరుస్తుందా లేదా అనేదే. కానీ, నాకు నీళ్లు తాగవలసిన అవసరమో, లోటా అవసరమో లేదనుకోండి, ఒక కుంభాకార గాజు చేసే పనితో మాత్రమే నాకు పనుందనుకోండి. అప్పుడు అడుగున పగిలిపోయిన లోటా అయినా, అసలు అడుగే లేని లోటా అయినా వగైరా ఏమైనా నాకు పట్టింపు లేదు.

రూపపరమైన తర్కం రూపపరమైన నిర్వచనాలతో మాత్రమే వ్యవహరిస్తుంది. అన్ని రూపపరమైన తర్క విధానాలు అదే విషయం చెబుతాయి. సాధారణంగా కనబడేదేమిటో, కొట్టవచ్చినట్టు కనబడేదేమిటో చూసి, అక్కడే ఆగిపోయి ఆ నిర్వచనాలు తయారవుతాయి. అలా తయారయిన రెండో, అంతకన్న ఎక్కువో నిర్వచనాలను తీసుకొని, వాటిని ముద్ద చేయడం. అంటే, కుంభాకార గాజును, తాగడానికి ఉపయోగించే పాత్రను కలిపి చెప్పడం. ఇది ఒక వస్తువు యొక్క విభిన్న కోణాలను సూచించే నిర్వచనాల కలగలుపుడు ఫలితమే తప్ప మరొకటి కాదు.

గతితార్కిక పరిశీలనా పద్ధతి మనం ఇంకా లోతుకు పోవాలని ఆశిస్తుంది. మొట్టమొదట ఒక వస్తువు గురించిన వాస్తవిక పరిజ్ఞానం పొందాలని మనం అనుకుంటే, దాని అన్ని కోణాలనూ, అన్ని సంబంధాలనూ, అన్ని 'మధ్యవర్తిత్వాలనూ' మనం చూడవలసి ఉంటుంది, పరీక్షించవలసి ఉంటుంది. నిజానికి ఇది ఎప్పటికయినా సంపూర్ణంగా సాధించగలమని మనం అనుకోలేనిది. కానీ, ఇలా సమగ్రంగా పరిశీలించాలనే సూత్రం కనీసం మనం పొరపాటు పడకుండా, సంకుచితంగా ఉండకుండా రక్షణ కవచంగా ఉపయోగ పడుతుంది. రెండవది, ఒక వస్తువును పరిశీలించేటప్పుడు దాన్ని అభివృద్ధి చెందుతున్నదిగా, మార్పు చెందుతున్నదిగా, 'స్వయం చలనంలో' ఉన్నదిగా గుర్తించాలని గతితార్కిక పరిశీలనా పద్ధతి కోరుతున్నది. ఒక లోటా లాంటి వస్తువు విషయంలో ఇలా చూడడం తక్షణమే స్పష్టంగా ఉండదు. కాని, అది కూడా చలనంలోనే ఉన్నది. అది చలనంలో ఉన్నదనే విషయం దాని లక్ష్యంలోనూ, ఉపయోగం లోనూ, చుట్టూరా ఉన్న ప్రపంచంతో దాని సంబంధంలోనూ మరింత వాస్తవికంగా ఉంటుంది. మూడవది, ఒక వస్తువు గురించి పూర్తి 'నిర్వచనం' అనేదానిలో సమస్త మానవ అనుభవం సమ్మిళితం కావాలి. అది సత్యానికి గీటురాయిగానూ ఉండాలి, మానవ అవసరాలతో సంబంధించిన ఆచరణాత్మక సూచనగానూ ఉండాలి. నాల్గవది, గతి తార్కిక పరిశీలనా పద్ధతి ఏమని భావిస్తుందంటే 'సత్యం ఎల్లవేళలా నిర్దిష్టమైనదే. ఎప్పుడు అమూర్తమైనది కాదు.' హెగెల్‌ను అనుసరిస్తూ ప్లెహనోవ్ ఈ మాట అంటూ ఉండేవాడు. (యువ పార్టీ సభ్యుల కోసం ఇక్కడ నన్నొక మాట చెప్పనివ్వండి. మీరు ఒక నిజమైన, తెలివైన కమ్యూనిస్టు కాదల్చుకుంటే ప్లెహనోవ్ తాత్విక రచనలను అన్నిటినీ చదవకుండా – అధ్యయనం చేయకుండా అని నా అభిప్రాయం – ఆ ఆశ అసాధ్యం. ఎందుకంటే, మార్క్సిజం గురించి అంతకన్న మంచి రచన ప్రపంచంలో ఎక్కడా రాలేదు.)*

అయితే ఇంతకీ గతితార్కిక పరిశీలనా పద్ధతి అంటే ఏమిటో నేనింకా పూర్తిగా వివరించనే లేదు. ప్రస్తుత సందర్భానికి ఈ మాత్రం సరిపోతుంది. ఇక మళ్లీ లోటా దగ్గర్నుంచి ట్రేడ్ యూనియన్‌ల దగ్గరికీ, ట్రాట్స్కీ చెప్పిన వేదిక దగ్గరికీ వద్దాం.

'ఒకపక్కన పాఠశాల, మరొకపక్కన సాధనం' అంటాడు బుఖారిన్. అదే మాట తన థీసిస్‌లో కూడా రాస్తాడు. అంతేకాదు, కమ్యూనిజం పాఠశాల అనే ఆలోచనకు తగినంతగా మద్దతు ఇవ్వకపోవడం ట్రాట్స్కీ పొరపాటట. సాధనం అనే అంశం పట్ల ముభావంగా ఉండడం జినోవీవ్ పొరపాటట.

బుఖారిన్ చేసే వాదనా పద్ధతి పనికిమాలినదని, అర్థంలేని కలగుపుడు వాదనని నేనెందుకు అంటున్నాను. ఎందుకంటే, ఆయన వాదన కనీసం తన సొంత దృక్పథం నుంచి ఒక స్వతంత్ర్య విశ్లేషణ చేసేందుకు కూడా ప్రయత్నించడం లేదు. ప్రస్తుత వివాదం సాగివచ్చిన సంపూర్ణ క్రమాన్ని ఆయన విశ్లేషించడం లేదు. మార్క్సిజం లేదా గతి తార్కిక పరిశీలనా పద్ధతి అటువంటి విశ్లేషణ సాగించాలని బేషరతుగా కోరుతుంది. లేదా ఆయన ఈ వివాదపు ప్రస్తుత సమయంలోని నిర్దిష్ట పరిస్థితుల పట్ల సంపూర్ణమైన వైఖరి, సంపూర్ణమైన వివరణ కూడా ఇవ్వడం లేదు. ఆయన ఆ పని చేసేందుకు సిద్ధంగా లేనేలేడు. ఆయన చేస్తున్నదంతా ఒక శుద్ధ, అమూర్త వాదన. నిర్దిష్ట అధ్యయనం చేసే ప్రయత్నమే ఆయనలో లేదు. జినోవీవ్ నుంచి ఒక ముక్క, ట్రాట్స్కీ నుంచి ఒక ముక్క తీసుకొని వాటిని కలుపుతున్నాడు. ఇదే కలగలుపుడు వాదం.

ఈ దృశ్యాన్ని స్పష్టం చేయడానికి మరొక ఉదాహరణ ఇస్తాను. దక్షిణ చైనాలోని తిరుగుబాటుదారుల గురించి, విప్లవకారుల గురించి నాకు అక్షరం ముక్క కూడా తెలియదు. (ఎన్నో సంవత్సరాల కింద సన్‌యెట్ సేన్ రాసిన రెండో మూడో వ్యాసాలు, కొన్ని పుస్తకాలు, వార్తాపత్రికల వ్యాసాలు మినహా.) ఇప్పుడు అక్కడ తిరుగుబాట్లు జరుగు తున్నాయి గనుక అక్కడ ఒక వివాదం జరుగుతున్నదని అనుకోవడం అసందర్భమేమీ కాదు. దేశవ్యాప్తంగా సాగుతున్న తీవ్రతరమైన వర్గపోరాటపు ఫలితంగానే అక్కడ తిరుగుబాటు జరుగుతుందని చైనీస్ నెంబర్ వన్ అంటున్నాడు అనుకుందాం. తిరుగుబాటు అనేది ఒక కళ అని, అక్కడ అదే జరుగుతున్నదని చైనీస్ నెంబర్ టు అంటున్నాడు అనుకుందాం. ఈ మాత్రం తెలిస్తే చాలు బుఖారిన్ లాగా ఒక థీసిస్ రాసెయొచ్చు : 'ఒకపక్క... మరొక పక్క...' ఒకరేమో అది 'కళ' అనే అంశం మర్చిపోయారు. మరొకరేమో అది 'తీవ్రతరమైనదనే' అంశం మర్చిపోయారు. వగైరా వగైరా. ఈ ప్రత్యేకమైన, నిర్దిష్టమైన వివాదం గురించి, సమస్య గురించి, వైఖరి గురించి నిర్దిష్టమైన అధ్యయనం ఏదీ జరగలేదు గనుక ఫలితంగా వచ్చేది ఒక మృతప్రాయమైన, నిస్సారమైన కలగలుపుడు వాదం తప్ప మరొకటి కాదు...

*(ఈ బ్రాకెట్‌లో వివరణ కూడా సరిపోదన్నట్టుగా లెనిన్ ఇక్కడే మరొక పాదసూచిక కూడా రాశాడు: 'అన్నట్టు మొట్టమొదట ప్రస్తుతం వెలువడిన ప్లెహనోవ్ రచనల్లో ఆయన తాత్విక వ్యాసాలన్నిటినీ ఒక ప్రత్యేక సంపుటంగానో, సంపుటాలుగానో వివరణమైన సూచికలతో తెచ్చి, కమ్యూనిజం మీద ప్రామాణిక పాఠ్య పుస్తకాల వరుసలో చేరిస్తే బాగుంటుంది. రెండవది, కార్మిక రాజ్యం దేశంలోని తత్వ శాస్త్ర ఆచార్యులందరూ మార్క్సిస్ట్ తత్వశాస్త్రం గురించి ప్లెహనోవ్ చేసిన వివరణలను అధ్యయనం చేయాలని, వాటిని విద్యార్థులకు బోధించే సామర్థ్యం అలవర్చుకోవాలని ఆదేశించాలి...'

నిజానికి లెనిన్ ఈ మాట రాస్తున్న సందర్భానికి దశాబ్దానికి పైగా ముందే ప్లెహనోవ్‌తో లెనిన్ విభేదించాడు. ప్లెహనోవ్ మెన్షివిక్‌లతో వెళ్లిపోగా, లెనిన్ బోల్షివిక్ పార్టీ నాయకుడయ్యాడు. ప్లెహనోవ్ లెనిన్ మీద చాల తీవ్రమైన విమర్శలు చేశాడు. ప్లెహనోవ్‌ను రివిజనిస్టు అనీ, విప్లవ ద్రోహి అనీ కూడా బోల్షివిక్ పార్టీ ప్రస్తావించింది. అయినా, ప్లెహనోవ్ దగ్గర నేర్చుకోవలసిన విషయం ఉన్నప్పుడు లెనిన్ ఇంత ప్రశంసాపూర్వకంగా రాశాడు.) వీ

*మానవ సమాజ పరిణామాన్ని వ్యవసాయం, ఉత్పత్తి, భాషా, సంస్కృతుల క్రమ పరిణామాలతో కలిపి అర్థం చేసుకోవాల్సిన అవసరాన్ని చెబుతున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# మానవ సమాజాల అధ్యయనం

మతభావనల మూలాలను అన్వేషించాలంటే సమాజాలు లోనయిన చారిత్రక పరిణామాలను సమీక్షించాలి. అందుకే మానవుల సామాజికప్రవర్తన కొందరు పరిశీలకులకు ఆసక్తికరమైన అంశం. సమాజశాస్త్రంలోని ఈ విభాగం గత ఒకటిరెండు శతాబ్దాలుగా బాగా పరిణతి చెందింది. సాంస్కృతిక పునరుజ్జీవనం (రినేసాన్స్) మొదలయాక యూరప్‌లో మేధావులు కొందరు రకరకాల విషయాల గురించి కొత్తపద్ధతుల్లో ఆలోచించడం, అప్పటిదాకా ఉన్న మతమౌఢ్యపు వైఖరిని విడనాడే ప్రయత్నాలూ చేశారు. దీనికి తోడుగా పదిహేనో శతాబ్దం ప్రారంభమయేనాటికి పశ్చిమ యూరప్ దేశాల నావికులూ, దోపిడిదార్లూ ఓడలెక్కి సాహసవంతమైన దూరప్రయాణాలు చెయ్యడం, కొత్తదేశాల ఆచూకీ తెలుసుకోవడం మొదలైనవన్నీ జరిగాయి. అప్పటిదాకా సమాజమూ, సమాజనిర్మాణమూ, కట్టుబాట్లూ, మతమూ, వగైరాల గురించి ఉన్న సంకుచిత, స్థానికభావనల స్థానంలో అంతులేని కొత్త సమాచారం వచ్చి పోగుపడసాగింది. ప్రపంచం చాలాపెద్దదనీ, ఎన్నో విషయాల్లో ఎంతో వైవిధ్యం కలిగినటువంటిదనీ ఆలోచనాపరులు గ్రహించసాగారు. ఇది వారి చింతనను బాగా ప్రభావితం చేసింది. ఒకవంక యూరప్ రాజవంశాలన్నీ నావికులను ప్రోత్సహించి, వలసప్రాంతాలను సృష్టించడం, వాటిని దోచుకుని సొమ్ముచేసుకోవడం వగైరాలు మొదలుపెట్టారు. మరొకవంక కుతూహలం ఉన్న పరిశీలకులూ, శాస్త్రవేత్తలూ అప్పటిదాకా అపరిచితంగా ఉన్న ప్రకృతి వింతలనూ, పురాతన సంస్కృతులనూ, సమాజాలనూ అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తూ వచ్చారు.

మనదేశంలో ఈ అధ్యయనం ఆలస్యంగా మొదలయింది. బ్రిటిష్ చరిత్రకారులు మంచి కృషి చేసినప్పటికీ అందులో వారి వలసవాద వైఖరి ద్యోతకమయేది. మన సనాతనభావాలను వారు ఈసడించుకోవడం గమనించిన తిలక్వంటివారు హిందూమతపు విశిష్టతను సమర్థించే ప్రయత్నాలు చేశారు. తరవాతికాలంలో కోశాంబీ, దేవీప్రసాద్ చట్టోపాధ్యాయవంటి మేధావులు మనదేశపు తాత్వికశాస్త్రాల చరిత్రను సరైన పద్ధతిలో విశ్లేషించారు.

ఈనాడు మనం చరిత్రను అర్థం చేసుకోవాలంటే సామాజికంగా మానవజాతి పరిణామాన్ని గురించికూడా తెలుసుకోవాలి. తొలి మానవులు గుహలలో తలదాచుని బతికినినాటినుంచీ తిండీ, నివాస స్థలమూ, శరీరానికి కట్టుకునే దుస్తులూ, పిల్లల సంరక్షణా మొదలైన కొన్ని జీవితావసరాలను అతిముఖ్యమైనవిగా పరిగణించారు. వీటి తరవాతనే తక్కినవన్నీ లెక్కలోకి వచ్చాయి. సమాజస్థితి కూడా మారుతూ వచ్చింది. వేటాడుతూ, ఏరుకుతింటూ తిరిగిన దశలో ఉన్న పరిస్థితులు క్రమంగా పోయి, వన్యప్రాణులను మచ్చిక చేసి మందలుగా పెంచే దశవచ్చింది. ఆ తరవాత ప్రాథమికస్థాయిలో మొక్కల పెంపకమూ, ఆ తరవాత వ్యవసాయపద్ధతులూ మొదలయాయి. తిండి కోసం వెతుక్కుంటూ తిరిగే పరిస్థితి పోయాక, అదనపు ఆహారోత్పత్తికూడా మొదలవడంతో ప్రజలు స్థిరనివాసానికి అలవాటు పడసాగారు.

పశ్చిమాసియా ప్రాంతాల్లో సుమారుగా క్రీ.పూ. 7000లో మొదలైన ఈ విప్లవాత్మకమైన పరిణామం కొత్తరాతియుగంగా రూపొందసాగింది. అంతకుమునుపు యూరప్‌లో 40 వేల ఏళ్ల క్రితం వరకూ నియాండర్తాల్ మానవజాతులూ, ఆ తరవాత వారి స్థానంలో 20 వేల ఏళ్ల క్రితం వరకూ క్రోమాగ్నన్ జాతులూ ఉండేవి. సుమారు 10 వేల ఏళ్ల క్రితం హిమయుగం అంతమయింది.

ఇరాక్లోని యూఫ్రటీస్, టైగ్రిస్ నదుల మధ్యనుండే మెసొపొటేమియాలోనూ, టర్కీలోనూ మొదలైన పశుపాలనా, వ్యవసాయమూ క్రీ.పూ. 5000 నాటికల్లా దక్షిణయూరప్ బాల్కన్ ప్రాంతానికీ, మరొక వెయ్యేళ్లకు ఈజిప్ట్, మధ్య యూరప్‌లకూ, మరొక వెయ్యేళ్లకు బ్రిటన్‌కూ వ్యాపించాయి. చైనాలోనూ, మన దేశంలోనూ కూడా అటువంటివే పరిణామాలు జరిగాయి. వీరెవరికీ సంబంధం లేకుండా దక్షిణ అమెరికాలో కూడా కొత్తరాతి యుగం మొదలయింది. ఇవన్నీ ఎక్కడ, ఎప్పుడు మొదలైన మార్పులైనా వీటివల్ల సమాజ నిర్మాణం మీదా, అందులోని సమూహాల సంబంధాల మీదా అపూర్వమైన ప్రభావాలు కలగసాగాయి.


అయిదారు వేల ఏళ్లక్రితపు స్త్రీపురుషుల అవశేషాలు ఇటలీలో లభించాయి

20 లక్షల సంవత్సరాల క్రితం ఆఫ్రికాలో మొదలైన హోమోఎరెక్టస్ జాతి మానవులు మరొక 5, 10 లక్షల ఏళ్లు గడిచేసరికి కాలినడకన ప్రపంచంలోని అనేక ప్రాంతాలకు వెళ్లి స్థిరపడ్డారు. మళ్లీ 70 వేల ఏళ్ల క్రితం ఆధునిక మానవజాతి సమూహాలు ప్రపంచవ్యాప్తంగా దూరప్రయాణాలు చేశాయి. వీరు అంతకు ముందున్న మానవజాతులతో వనరుల కోసం పోటీపడడంతో తక్కినజాతులన్నీ అంతరించగా వారికి వారసులుగా మనం మిగిలాం.

ఈ సుదీర్ఘ వ్యవధిలో మనుషులు మాట్లాడనేర్చారు. భాష, వ్యక్తుల మధ్య సంపర్కం, ఆలుమగలూ, పిల్లలతో కూడిన కుటుంబ వ్యవస్థా ఏర్పాటయాయి. సంచార జీవితం గడుపుతున్నప్పటికీ వారికి ప్రకృతిని గురించిన మంచి అవగాహనా, చావుపుటకల గురించిన తాత్విక చింతనా ఉండేవి. మొదట్లో లిపి లేకుండానే శబ్దరూపంలో ఉపయోగపడిన భాషలకు తరవాతి కాలంలో లిపి అవసరం ఏర్పడింది. పాటలూ, ఆటలూ, చిత్రలేఖనం, కాలగణనం మొదలైనవన్నీ వ్యవసాయసమాజాలు ఉద్భవించక మునుపే

ఆరంభమయాయి. మనుషులకు ప్రకృతిలో సహజంగానూ, అనుకోకుండానూ తలెత్తే మార్పుల గురించిన పరిజ్ఞానమూ, ఊహాపోహలూ ఉండేవి. సమాజంలో కొన్ని కట్టుబాట్లు ఉండేవి. కులపెద్దలూ, గణాచార్లూ, మంత్రతంత్రాలతో తెగను కాపాడ ప్రయత్నించేవారూ ఉండేవారు. తెగలోని వారంతా ఒకరికొకరు తోడ్పడుతూ, తమ ప్రాంతాన్నీ, వనరులనూ కాపాడుకుంటూ ఐకమత్యంతో జీవించేవారు. ఏ ఇబ్బంది వచ్చినా అంతా కలిసికట్టుగా ఎదుర్కోవాలనే అనుకునేవారు. ఇదొక ప్రాథమిక సామ్యవాదదశవంటిది.

ఈ సమాజాల్లో వ్యక్తులమధ్య తలెత్తే పోటీలనూ, కొట్లాటలనూ కులపెద్దలే తీర్చేవారు. అధిక సంఖ్యాకులు కలిసి జీవిస్తున్నప్పుడు అనివార్యంగా కలిగే రకరకాల స్పర్ధలను మనుషులు జంతువుల పద్ధతిలో కాక, ముందాలోచనతో, సామరస్యంగా పరిష్కరించుకోవడం మొదలు పెట్టారు. ఐక్యత లేని జాతి అప్పటి పరిస్థితుల్లో మనగలగడం కష్టంగా ఉండేది గనక ఈ వైఖరి వారి మనుగడకు తోడ్పడింది. జనాభా పెరుగుతున్నకొద్దీ మానవ సమూహాలు ఒకదానికొకటి తారసిల్లడం, ఇతరుల గురించి స్వపర భేదాలను నిర్ణయించుకోవడం తప్పనిసరి అయింది. మందలుగా జీవించే జంతువుల పద్ధతిలో కాకుండా తెగలో ఎవరికైనా గాయాలో, ప్రమాదమో సంభవిస్తే నలుగురూ కలిసి సంరక్షించే ప్రయత్నాలు చేసేవారు. కోలుకున్న వ్యక్తి బతికితే తెగకు ఆసరా పెరిగేది. ఇటువంటి ప్రవర్తన అసలైన మానవనైజానికి రూపాన్నివ్వసాగింది.

మానవనైజం గురించి ఈనాడు ప్రవచించేవారు అది ఏనాడైనా స్వార్థపూరితమైనదేననీ, ఎవరైనా సరే స్వలాభం సంగతే ముందు ఆలోచిస్తారనీ నమ్మబలుకుతారు. ఇది పూర్తిగా అబద్ధం. ఇది అబద్ధమని రుజువు చెయ్యడానికి సాక్ష్యం మనమే. తొలి మానవజాతులే గనక అడుగడుగునా వ్యక్తిగత స్వార్థానికి ఒడిగట్టి ఉంటే మానవజాతి ఇన్నేళ్లపాటు మనగలిగేదే కాదు. అందుకని ఈనాటి స్వార్థ ప్రవర్తన మధ్యలో వచ్చినటువంటిదై ఉండాలి. ఈ మార్పు ఎలా జరిగిందో వివరించడం తేలికే.

తొలి మానవ సమాజాలు ఇప్పటివంటివి కావు. ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుని మనం దీన్నంతా ఆటవిక, అనాగరికదశ అనుకోవచ్చుగాని అది తప్పు. మధ్యయుగాల తరవాత యూరప్‌లో మొదలైన మానవశాస్త్రంలో మొదట్లో ప్రతి సంస్కృతినీ యూరప్తో పోల్చి విమర్శించడం, ఆ దృష్టితోనే అర్థంచేసుకోవడానికి ప్రయత్నించడం కనబడుతుంది. నిన్నమొన్నకూడా మనదేశపు చరిత్రను పాశ్చాత్యులు హిందూ, ముస్లిం, బ్రిటిష్ యుగాల కింద విడగొట్టి వివరించే ప్రయత్నం చేశారు. ఇది చాలా సంకుచితమైన పద్ధతి అని ఈ నాడు అందరూ అంగీకరిస్తారు. అలాగే మనుషులు ఏ యుగంలో జీవించినప్పటికీ ప్రకృతిని అర్థం చేసుకోవడానికి, అర్థవంతమైన జీవితాలు గడపడానికీ తమ సర్వశక్తులూ ధారపోశారని మనం గుర్తుంచుకోవాలి. సమాజ స్వరూపం మారుతూ ఉంటుంది. దాని పునాదులు కదులుతూనే ఉంటాయి. వాటినిబట్టి ఎన్నెన్నో మార్పులు కలుగుతాయి. వాటన్నిటినీ సక్రమంగా అర్థం చేసుకోవాలి.

మానవశాస్త్రం (ఆంత్రోపాలజీ), సామాజికమానవశాస్త్రం (సోషల్ ఆంత్రోపాలజీ) చరిత్రలో మానవజాతి సాధించిన పరిణతిని తెలియజేస్తాయి. ఇవి ప్రాథమికస్థాయిలో మొదలైనది యూరప్‌లో పంతొమ్మిదో శతాబ్దంలోనే. సమాజం గురించిన ఆలోచనలు ఆనాటి పరిశీలకుల మనసుల్లో బాగా పెరగడానికి కారణం అంతకుపూర్వపు రాజకీయ పరిణామాలే. పారిశ్రామిక విప్లవం, ఫ్రెంచ్ విప్లవం మొదలైనవన్నీ అప్పటి సమాజాన్ని పెద్దపెట్టున కుదిపేశాయి. వాటి ఫలితంగా అంతకుపూర్వపు సామాజిక సంబంధాలన్నీ అకస్మాత్తుగా నాశనం కాసాగాయి. ఇటువంటి అపూర్వమైన మేధోమథనం కారణంగా యూరప్‌లో ఎంతోకాలం నుంచీ నెలకొని ఉండిన భావాలూ, సామాజిక ధోరణులూ కుప్పకూలిపోవడం మొదలైంది. వాస్తవప్రపంచంలో రాచరిక వ్యవస్థలూ, మతమూ, భూస్వామ్యపద్ధతులూ, సమాజంలో అప్పటిదాకా ఉండిన వర్గాలూ, స్థానికప్రభుత్వ వ్యవస్థా, వ్యక్తులమధ్య పరస్పర సంబంధాలూ అన్నీ తీవ్రమైన సంక్షోభాలకు గురిఅయాయి. పరిశీలకుల వైఖరిని ఇవన్నీ పూర్తిగా మార్చేశాయి.

వ్యక్తిగతంగా సిరిసంపదలకూ, హోదాలకూ, అధికారాలకూ అప్పటిదాకా ఉండిన అర్థాలన్నీ తారుమారుకావడం మొదలైంది. సమాజంలో ఏది గొప్ప, ఎవరు గొప్ప, గౌరవమర్యాదలంటే అర్థ మేమిటి మొదలైన ప్రశ్నలన్నీ సామాన్యులకూ, పరిశీలకులకూ కూడా సవాళ్లు అయి కూర్చున్నాయి. వీటి వెంబడే అప్పటి పరిస్థితులు గతంలో జరిగిన ఎటువంటి పరిణామాల పర్యవసానమో చింతకులు వితర్కించుకో సాగారు. సామాజిక సంబంధాలు మార్పులేకుండా అనంతంగా కొనసాగలేవనీ, అదొక నిరంతర పరిణామక్రమంలోని భాగమేననీ అందరికీ అర్థం కాసాగింది.

మరొకవంక కొత్త పరిశ్రమలూ, వర్తకవాణిజ్యాల్లో అంతర్జాతీయ స్థాయిలో మొదలైన సరికొత్త అధ్యాయాలూ ప్రజల దృక్పథాలనూ, మేధావుల వైఖరులనూ చాలా విస్తృతం చెయ్యసాగాయి. ఇది అన్నిటికన్నా ప్రభావవంతమైన కొత్త పరిణామంగా రూపొందసాగింది. వ్యక్తులమధ్య సంబంధాలన్నీ సరికొత్త ఆర్థిక, వాణిజ్యపరమైన మార్పులవల్ల మారిపోయే పరిస్థితి కలిగింది. ఇదే నేపథ్యంలో మానవజాతి చరిత్ర యావత్తూ సింహావలోకనాలకూ, కొత్త విశ్లేషణలకూ లోనయింది. అందులో భాగంగా జాతుల్లోని వైవిధ్యమూ, కాలానుగుణంగానూ, ప్రదేశాన్నిబట్టీ సంస్కృతుల్లో తలెత్తే మార్పులూ అన్నీ చింతకులకు అర్థం చేసుకోక తప్పని పరిస్థితి ఎదురయింది. ఎన్నో శతాబ్దాలనుంచీ, కొన్ని సందర్భాల్లో వేల ఏళ్ల నుంచి కూడా కొనసాగుతూ వస్తున్న అభిప్రాయాలన్నీ తలకిందులు కాసాగాయి.

పారిశ్రామిక, సామాజిక విప్లవాల ప్రభావం అప్పట్లో ఎంత తీవ్రంగా ఉండిందంటే అప్పటిదాకా ఉపయోగంలోలేని పదాలూ, భావాలూ, పరిభాషా అప్పుడే మొదటగా భాషల్లోకి ప్రవేశించి, నేటికీ కొనసాగుతున్నాయి. ఫ్యాక్టరీల వంటివాటిని పరిశ్రమలుగా పేర్కొనడం, పారిశ్రామికవేత్తల ప్రస్తావన, ప్రజాస్వామ్యం, వర్గం, మధ్యతరగతి, మేధావి, హేతువాదం, మానవీయదృక్పథం, అణుసిద్ధాంతం, సామాన్య ప్రజానీకం, వ్యాపారసరళి, శ్రామికవర్గం, సామూహికతత్వం, సమానత్వం, ఉదారవాదం, వెనకబాటుతనం, విజ్ఞానవేత్త, బ్యూరోక్రసీ, పెట్టుబడిదారీ వ్యవస్థ, సంక్షోభం, ప్రయోజనవాదం మొదలైన పదాలన్నీ అప్పట్లో కొత్తగా సృష్టి అయినవేనని గమనించాలి. ఈ మాటలన్నీ కొత్తగా మొదలైన స్పష్టమైన సాంఘిక అవగాహనకు సూచికలని వేరే చెప్ప నవసరంలేదు.



ఆ కాలపు ఇతర పరిణామాలుకూడా ముఖ్యమైనవే. 1750-1850 మధ్యకాలంలో యూరప్ జనాభా 14 కోట్ల నుంచి 26.6 కోట్లకీ, ప్రపంచ జనాభా 72.8 కోట్లనుంచి వంద కోట్లకీ పెరిగింది. ఈ నేపథ్యంలోనే బ్రిటిష్ మేధావి మాల్థస్ (1766-1834) ప్రజల సంక్షేమం గురించిన తన ఆందోళనను వెలిబుచ్చాడు. నానాటికీ రోగాలూ రొష్టుల వల్ల జనాభా తగ్గే అవకాశాలు సన్నగిలడంతో ప్రపంచజనాభా అంతు లేకుండా పెరిగిపోతుందనీ, దానికి సరితూగే ఆహారోత్పత్తి జరగడం అసాధ్యమనీ అతను చెప్పాడు. ఇలా ప్రపంచస్థాయిలో ఆలోచించి అంచనాలు వెయ్యడం అప్పట్లో మొదలైన కొత్త ధోరణి.

మరొకవంక అప్పట్లో కొత్తగా ఏర్పాటైన కార్మికవర్గపు పరిస్థితుల గురించి రచయితలూ, పరిశీలకులూ తీవ్రమైన ఆందోళన వ్యక్తం చెయ్యసాగారు. అప్పటిదాకా పల్లెల్లో నిరుపేదలుగా బతికిన అనేకులకు పరిశ్రమలు కొంత ఆదాయాన్ని సమకూర్చినప్పటికీ, గ్రామీణజీవితాల్లో వారికుండిన సహజమైన వాతావరణమూ, సాంఘిక భద్రతా, సంప్రదాయిక సౌకర్యాలూ పెద్ద పారిశ్రామికవాడల్లో కరువైపోయాయని వారు గుర్తించారు. పెట్టుబడిదారులకు లాభాలు ఆర్జించిపెట్టడానికి వీరంతా కిక్కిరిసిన మురికివాడల్లో దుర్భరజీవితాలు గడుపుతూ, స్వచ్ఛమైన గాలికీ, నీటికీ, జీవన పరిస్థితులకూ దూరమైపోతున్నారని అందరూ గుర్తించారు. చేతుల్లో డబ్బు ఆడుతున్నప్పటికీ, స్థానికంగా వారికయే ఖర్చులకి అవి ఏనాడూ సరిపోవనేదికూడా గమనికకు వచ్చింది. అప్పట్లో ఆర్థికశాస్త్రాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేసినవారిలో కార్ల్ మార్క్స్ ముఖ్యుడు. అతని ఆలోచనల, రచనల ప్రభావం ఎంతో దీర్ఘకాలికంగా పనిచెయ్యసాగింది. అంతకుపూర్వం పారిశ్రామిక ప్రగతిని ద్వేషించిన లుడ్డైట్ ఉద్యమ కారులు నేత మిల్లులను నాశనం చేసే ప్రయత్నాలుకూడా చేశారు.

ఆధునిక అధ్యయనాలు కొత్త విషయాలు నేర్పాయి. సుమారు 30 లక్షల ఏళ్ల క్రితం తొలి మానవులు నిటారుగా నిలబడి, రెండుకాళ్లమీద నడవడం మొదలుపెట్టారు. దాదాపు 20 లక్షల ఏళ్ల క్రితం రాతిపనిముట్ల వాడకం మొదలై, మనుషుల మెదడు పరిమాణం పెరగసాగింది. ఏ 15 లక్షల ఏళ్ల కిందటో మనుషులకు వేటాడడం, నిప్పుచెయ్యడం అలవాటయాయి. రమారమి 5 లక్షల ఏళ్ల క్రితమే మరణించిన సాటి వారిని ఖననం చేసే ఆచారం మొదలైంది. 25 వేల ఏళ్ల కిందట గుహల్లో గీసిన కుడ్య చిత్రాలు లభించాయి. మొదటి నుంచీ ముఠాలుగా, తెగలుగా జీవించిన మానవ సముదాయాలకు సహజీవనం అనేది కొత్తకాదు. పాతరాతి యుగంలో దేశదిమ్మరుల్లాగా తిరుగుతూ, వేటాడి, ఏరుకు తింటూ బతికిన మానవులు కొత్తరాతియుగంనాటికల్లా వ్యవసాయం నేర్చుకుని స్థిర నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. ఆ తరవాత నిజమైన సమాజ జీవితం ప్రారంభమైంది.



ఆధునికజీవితం అలవడని ఆదిమతెగ కుటుంబం (ఇరవయ్యో శతాబ్దం తొలిరోజుల నాటి బ్రెజిల్ దేశపు ఫోటో)

అందువల్లనే ఇటువంటి మానవ సమాజాలకు ఎంతో చరిత్ర ఉంది. ఈనాటి సమాజంలో కనబడుతున్న సమకాలీన లక్షణాలు కొన్నింటికి మూలాలు ప్రాచీన కాలానికి చెందినవి. అలాగే కొన్ని లక్షణాలు ఏనాడో అంతరించి పోయినటువంటివి. ఆధునిక విజ్ఞానం, సాంకేతిక రంగాలు నేటి ప్రజల జీవిత శైలిని తీవ్రంగా ప్రభావితం చేసి, ఎంతోకాలంగా ఉండిన కొన్ని సామాజిక ధోరణులను మార్చేస్తున్నాయి. కొన్ని ఆదిమతెగలు మాత్రం ఇటీవలి దాకా కూడా పాత పద్ధతుల్లోనే జీవిస్తూవచ్చాయి (పటం). తొలి స్థిరనివాసాలన్నీ నదీ తీరాల్లోనూ, ఇతర వనరుల సమీపంలోనూ ఏర్పాటయాయి. తరవాతి కాలంలో మనుషులు నివాసయోగ్యం అనిపించని ప్రాంతాలకు కూడా తరలివెళ్లారు. ఎటువంటి వాతావరణాని కైనా, శీతోష్ణస్థితికైనా తట్టుకుని జీవించడం అలవాటు చేసుకున్నారు. ఒకదానికొకటి దూరంగా నెలకొన్న స్థావరాల మధ్య సంపర్కం అరుదుగా తప్ప సాధ్యమయేదికాదు. కాలం గడుస్తున్నకొద్దీ స్థానిక స్థితిగతులనుబట్టి సమాజనిర్మాణంలోనూ, కట్టుబాట్లలోనూ, వ్యక్తిగతసంబంధాలలోనూ వ్యత్యాసాలు ఏర్పడ్డాయి. ప్రాంతాల వారీగా వేరువేరు సంస్కృతులు తలెత్తడానికి అది కారణమయింది.

మానవశాస్త్రం, మానవ సమాజశాస్త్రం అధ్యయనం చేస్తున్నప్పుడు యుగాలవారీగా ఏమేం మార్పులు ఎప్పుడెప్పుడు, ఎందుకు, ఎలా జరిగాయో మనకు తెలుస్తుంది. మనం ఎక్కడినుంచి వచ్చామో, ఎటువేపుగా వెళుతున్నామో అర్థమవుతుంది. ప్రాచీనకాలపు వివరాల అన్వేషణలో అనేక సమస్యలు ఎదురవుతాయి. ముఖ్యంగా ఆ కాలపు సాహిత్యంగాని, ఖచ్చితమైన ఆధారాలుగాని దొరికే అవకాశాలు చాలా తక్కువ. అందుకని ఎన్నో విశేషాలను సేకరించి, మనకు కావలసిన సమాచారాన్ని పరోక్షంగా సంపాదించుకోవడం తప్పనిసరి అవుతుంది.

ఇటువంటి విషయాల్లోని ఆసక్తి ఈనాటిది కాదు. క్రీ.పూ. అయిదో శతాబ్దంలో గ్రీస్‌లో జీవించిన హెరొడోటస్ చరిత్రను సవ్యంగా అధ్యయనం చేసిన మొదటి పాశ్చాత్యుడు. ఆ తరవాత క్రీ.శ. మొదటి శతాబ్దంలో టాసిటస్ మొదలైన రోమన్ చరిత్రకారులు ప్రాచీన కెల్ట్ జాతుల గురించి పరిశీలనలు జరిపారు. పన్నెండో శతాబ్దపు చివరలో జీవించిన కార్పీనీవంటివారు యూరప్‌కు చెందని మంగోల్ జాతుల గురించి కూడా అధ్యయనం చేశారు. పదమూడో శతాబ్దంలో కాకతీయ రుద్రమదేవి కాలంలో మన ప్రాంతాలకూ, ఇతరదేశాలకూ ప్రయాణించిన వెనిస్ నావికుడు మార్కోపోలో వివిధదేశాల, జాతుల ప్రజలను పరిశీలించి, సక్రమంగా విశేషాలను సేకరించాడు.

పంతొమ్మిదో శతాబ్దం చివరి దశకాల్లో మానవసమాజాల ప్రారంభ దశలను వర్ణించి, విభజించే ప్రయత్నాలు జరిగాయి. 1877లో అమెరికాకు చెందిన ఎల్.ఎచ్.మోర్గన్ ప్రాచీనసమాజం (ఏన్షియంట్ సొసైటీ) అనే తన గ్రంథంలో ఆటవిక, బర్బర, నాగరికదశలను ప్రస్తావించాడు. వాటి లక్షణాలనూ, స్వభావాలనూ నిర్వచించే ప్రయత్నం చేశాడు. ఆ లెక్కన ఆటవికదశలోని ప్రారంభంలో మానవులు తిండి ఏరుకు తినేవారు. ఆ తరవాత మధ్యయుగంలో చేపలు పట్టడం, నిప్పు చెయ్యడం వగైరాలు వారికి అలవడ్డాయి. ఆటవికదశ అంతమయేనాటికి మానవులు విల్లమ్ముల ఉపయోగం మొదలుపెట్టారు. ఆ తరవాత మొదలైన బర్బరదశ ప్రారంభంలో మట్టికుండల తయారీ నేర్చుకున్నారు. బర్బరదశ మధ్యయుగంలో వారు మొక్కలూ, జంతువుల పెంపకం ప్రారంభించారు. బర్బరదశ అంతమయేనాటికి ఇనుము వాడకం మొదలయింది. ఆ తరవాత భాషలూ, లిపుల ఆవిర్భావంతో నాగరికదశ ప్రారంభమయింది. ఇదొక స్థూలవిభజన. ఇది పంతొమ్మిదో శతాబ్దంనాటి అధ్యయనం. మోర్గన్ తదితరులమీద డార్విన్ పరిణామ వాదంవంటి ఆధునిక సిద్ధాంతాల ప్రభావం ఉండింది.

నెపోలియన్ ఈజిప్టును జయించిన కాలంలో అక్కడి ప్రాచీన లిపులను తన దేశపు నిపుణుల చేత అధ్యయనం చేయించాడు. ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన చార్ల్స్ మేసన్ (1800-1853) బలూచిస్తాన్లో పర్యటించి,

హడప్పా శిథిలాలను గురించి 1842లో మొదటగా వర్ణించాడు. టైలర్ (1832-1917) మొదలైన బ్రిటిష్ శాస్త్రవేత్తలు స్వయంగా మెక్సికోవంటి ప్రాంతాలకు ప్రయాణించి, స్థానిక క్షేత్రాల్లో అధ్యయనం జరిపారు. ఇది ఆధునిక మానవశాస్త్ర పరిశోధనలకు నాంది అనుకోవచ్చు. బ్రిటన్కు చెందిన లూయిస్ లీకీ (1903-72), ఆయన భార్య మేరీ, కుమారుడు రిచర్డ్ ఆఫ్రికాలో ప్రాచీన మానవజాతుల పరిణామాన్ని బాగా అధ్యయనం చేశారు.

ఇరవయ్యో శతాబ్దంలో మానవశాస్త్రాన్ని ఆధునిక పద్ధతుల్లో చేపట్టడం మొదలయింది. ఇందులో ప్రయోగాత్మకంగా నిరూపించ గలిగిన, భౌతిక, రసాయన, జీవశాస్త్ర అంశాలూ, లలితకళలూ, సాహిత్యం మొదలైన సాంస్కృతిక వివరాలూ, సమాజశాస్త్రమూ అన్నీ ఉంటాయి. ఈ అధ్యయనం లోగడ వలస ప్రాంతాలను సామ్రాజ్యంగా అనుభవించిన దేశాల్లో ఒక విధంగానూ, తక్కిన దేశాల్లో మరొక విధంగానూ జరుగుతోంది. మొదటి పద్ధతిలో ఆయా దేశాలు తమతో సంపర్కం ఏర్పరుచుకున్న విభిన్న జాతుల, భాషల, సంస్కృతులపై ఎక్కువగా ఆధారపడడం కనిపిస్తుంది. తక్కిన పద్ధతుల్లో స్థానిక జానపద, సాంస్కృతిక అంశాలూ, గాథలూ మొదలైన వాటిది ముఖ్యపాత్ర.

ఈనాడు ప్రాచీన మానవ సమాజాల చరిత్ర అధ్యయనంలో జీవశాస్త్రం, సంస్కృతి, పురాతత్వ శాస్త్రం, ప్రాచీన భాషాశాస్త్రం మొదలైన అంశాలెన్నో ఉంటాయి. మానవుల పరిణామం, జీవపరిణామ విశేషాలూ, జనాభా పెరుగుదల వగైరాలన్నీ లెక్కలోకి వస్తాయి. మానవుల పూర్వీకులైన నరవానర జాతులూ, వాటికీ మనకూ ఉన్న జన్యుపరమైన తేడాలూ, శరీర నిర్మాణంలోని వ్యత్యాసాలూ మొదలైనవి విశ్లేషణకు గురవుతాయి. వివిధ జాతుల భాషలూ, సంస్కృతులూ, వాటిమధ్య కనబడే తేడాలూ పరిగణనకు వస్తాయి. సందర్భాన్నిబట్టి ప్రాచీన సమాజాల నిర్మాణమూ, వాటిలో అమలయే కట్టుబాట్లూ, సమస్యలను పరిష్కరించుకునే పద్ధతులూ అన్నీ అవగాహనకు లోనవుతాయి. పురా తత్వశాస్త్రంలో పాతకాలపు వస్తువులూ, పరికరాలూ వగైరాల పరిశీలన జరుగుతుంది. అవసరమై నప్పుడు శిథిలాలూ, శిలాజాలూకూడా అధ్యయనంలోకి వస్తాయి.

ఇటువంటి అధ్యయనాలు ఆధునిక పద్ధతిలో మొదలైన తరుణంలో భూస్వామ్యయుగం అంతమై సిరిసంపదలకు కొత్తరూపాలు ఏర్పడసాగాయి. డబ్బూ, ఆస్తులూ అన్నీ పరిశ్రమల, వ్యాపారసంస్థల, కార్ఖానాల అవతారాలు ఎత్తసాగాయి. భూములూ, స్థిరాస్తీ, నగలూ, నగదురూపాల్లో ఉంటూ వచ్చిన సంపదలు కంపెనీ షేర్లూ, బాండ్లుగా పరివర్తన చెందాయి. ఇవన్నీ ప్రజల మనస్తత్వాన్నీ, ఆర్థికశాస్త్రవేత్తల పరిశీలనలనూ గాఢంగా ప్రభావితం చేసిన విషయాలు. భూస్వామ్య యుగం అంతమై సిరిసంపదలకు కొత్తరూపాలు ఏర్పడసాగాయి. అలాగే ధనాధికారం క్రమంగా కొద్దిమంది చేతుల్లోకి వచ్చెయ్యడం మొదలయింది. దీన్ని సోషలిస్ట్ పరిశీలకులే కాక ఇతరులుకూడా గుర్తించారు. పాతకాలపు భూస్వామ్యహోదాలన్నీ పటాపంచలై కొత్త ధనస్వామ్యవర్గం ఒకటి ఏర్పడసాగింది.



నేత మిల్లులను నాశనం చేసే లుడ్డైట్ ఉద్యమకారులు

ఇవన్నీ ఇలా ఉండగా పారిశ్రామికీకరణంవల్ల జనాభా క్రమంగా పట్టణాలకు తరలసాగింది. పెద్ద నగరాల సంఖ్యా, వాటి పరిమాణమూ పెరిగాయి. అక్కడ నివసించసాగినవారి జీవితాలు పెనుమార్పులకు లోనయాయి. పల్లెల్లోలా కాకుండా నగరాల్లో ఎవరూ ఎవరికీ తెలియని పరిస్థితి ఏర్పడింది. ప్రతివారూ అపరిచితులే అయిన ఈ జీవితాల్లో అందరూ ఏకాకులై, పరాయీకరణానికి గురికాసాగారు. సంప్రదాయిక కుటుంబ వ్యవస్థలన్నీ విచ్ఛిన్నం అవడం మొదలయింది. వ్యక్తులమధ్య సంబంధాలు పెళుసెక్కాయి. దీని ప్రభావం మొత్తం సమాజంపై పడసాగింది. యంత్రాలయుగం ఆరంభమై, యాంత్రిక, సాంకేతిక పరిజ్ఞానమే పెత్తనం చలాయించసాగింది. మునుపెన్నడూ లేని పద్ధతిలో వేలాదిగా కార్మికులు పనుల్లోకి వెళ్లసాగారు. ఫ్యాక్టరీల కూతలతో మొదలయే సామాన్యుల జీవితాలన్నీ యాంత్రికంగా నడవసాగాయి. వీటన్నిటితోబాటే రాజకీయంగా ప్రజాస్వామ్యం కూడా మొదలయింది. మతవిశ్వాసాల పట్టు సడలడంతో బాటే పౌరులుగా గుర్తింపు పొందిన వారందరికీ ఎన్నికల్లో పాల్గొనేందుకు వోటు హక్కు కూడా లభించింది.

ఈ సందర్భంలో మనం గుర్తించవలసినదేమిటంటే ఒకవంక పంతొమ్మిదో శతాబ్దం పెద్ద మార్పులకు లోనవుతూ ఉంటే మరొకవంక అది వైజ్ఞానిక దృక్పథాన్నే మార్చెయ్యసాగింది. అప్పుడు మొదలైన శాస్త్రీయ పరిశోధనల ధోరణి కాలంతోపాటు మెరుగవుతూ మానవజాతి ఇప్పటివరకూ సాధించిన సామాజిక పరిణతిని అర్థం చేసుకోవడానికి తోడ్పడింది.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

**వచ్చే సంచికలలో...**

- ❖ **రెవెన్యూ పరిపాలన చరిత్ర - ఎస్. సరళావందనం**
- ❖ **తెలంగాణ దొరల రాజ్యం కాకూడదు - జంజర్ల రమేష్ బాబు**
- ❖ **చేనేత రాతలు - అందె నరసింహారావు**
- ❖ **కాశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కు పూర్వాపరాలు**

## వీక్షణం నవంబర్ 2010 సంచికలో వచ్చిన చలసాని శ్రీనివాస్ వ్యాసం 'యాభై నాలుగేళ్ల ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు'కి స్పందనగా ఎస్. కిశోర్ కుమార్ చర్చా లేఖ

'వీక్షణం' నవంబర్ 2010 సంచికలో ప్రచురితమైన 'యాభై నాలుగేళ్ల ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు' వ్యాసంలో రచయిత చలసాని శ్రీనివాస్ తన వ్యక్తిగత ఇచ్ఛానుసార వాదనకు ప్రతికూలంగా ఉన్న కోట్లాది వాస్తవాలను పూర్తిగా దాచిపెట్టి, దాటవేసి, అబద్ధాలను, కల్పితాలను అనేకం వ్యాసంలో కుమ్మరించారు. ఒప్పందాల పునాదుల మీద ఏర్పడిన యాభై నాలుగేళ్ల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రస్థానం విశ్లేషణలో తెలంగాణ ప్రాంతానికి జరిగిన తీవ్ర నష్టం పట్ల ఎక్కడా ప్రస్తావన, విచారం కూడా వ్యక్తం చేయకుండా 'సర్వేజనా సుఖినోభవంతు' అంటూ ఓ సాధు వచనంతో ముగించారు.

విశాలాంధ్రను వ్యతిరేకిస్తూ ఆనాడు (1956లో) తెలంగాణలోని అత్యధిక ప్రజానీకం ప్రాంతవ్యాప్తంగా తీవ్ర ఉద్యమాల ద్వారా వెలిబుచ్చిన భయాందోళనలను, నిరసనలను, తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఉంచాలంటూ వ్యక్తం చేసిన బలమైన మనోభావాలను నాటి హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు స్వీయ అధ్యయనంలో తెలుసుకున్న నిజాలను పదే పదే ప్రస్తావిస్తూ, నిస్వార్థంగా, నిష్పక్షపాతంగా, అత్యంత స్పష్టంగా ఆనాటి భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడు యు.ఎన్. ధేబర్‌కు స్వయంగా రాసిన ఉత్తరం నేటికీ బహిరంగమే కదా. కనుల ముందు కనిపించే చారిత్రక సత్యాన్ని కూడా రచయిత విస్మరిస్తూ బూర్గులకు సమైక్యవాదాన్ని అంటగట్టే ప్రయత్నం చేయడం, ఆనాడు అత్యధిక తెలంగాణ ప్రజలు విశాలాంధ్రను కోరుకున్నారనడం ముమ్మాటికీ దుర్మార్గం, దుష్ప్రచారం. అంతేగాకుండా సిరి సంపదలతో తులతూగిన నాటి హైదరాబాద్ రాష్ట్రం కన్నా, లోటు బడ్జెట్‌తో సతమతమవుతూ కనీస సౌకర్యాలు, జీతభత్యాలకు నిధులు కరువై గుడారాల కింద పరిపాలనా కేంద్రాలను ఏర్పరచుకున్న ఆంధ్ర రాష్ట్రం చాలా గొప్పదన్నట్లుగా అభివర్ణించారు. "మనకు హైదరాబాద్ దక్కినట్లయితే మన సమస్యలన్నీ పరిష్కారమవుతాయి" అంటూ 1954 జూన్ నెలలో ఆనాటి ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం పంతులు చేసిన ప్రకటన, "హైదరాబాద్‌కు వెళ్లేందుకు ప్రజలు ఆతృతతో ఎదురుచూస్తున్నారు. రాజధాని కర్నూలు నుంచి హైదరాబాద్‌కు మారుతున్నందుకు ఏ ఒక్కరూ ఇసుమంతైనా బాధపడటం లేదు" అంటూ 1956 ఆగస్టు నెలలో నీలం సంజీవరెడ్డి చేసిన ప్రకటన ఆనాటి ఆంధ్ర రాష్ట్ర, అక్కడి ప్రజల స్థితిగతులకు అద్దం పడుతున్నాయి. ఇక చరిత్రనే తారుమారు చేయడానికి పూనుకున్నాక గణాంకాలు ఓ లెఖ్ఖా? అన్నట్లుగా రచయిత తన వ్యాసంలో ప్రాంతేతరులకు ఆశ్రయమిచ్చి పోషించిన నాటి తెలంగాణను బలహీనమైనదిగా చిత్రీకరించారు.

1956లో రాజ్యాంగ బద్ధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటుకు పునాదిగా, ప్రధాన ఆధారంగా, నిలువెత్తు సాక్షిగా నిలిచిన చారిత్రాత్మక పెద్దమనుషుల ఒప్పందాన్ని రచయిత ఏమాత్రం విలువలేని దానిగా, పరిగణించరానిదిగా జమకట్టారు. వాస్తవానికి పెద్దమనుషుల ఒప్పందం లేకుంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం లేదనేది జగమెరిగిన చారిత్రక సత్యం. అయితే ఇక్కడ రచయిత కూడా ఏరుదాటాక తెప్ప తగలేసినట్లుగా వ్యవహరించారు. ఎందుకంటే రాష్ట్రం ఏర్పాటైన మరుక్షణం నుంచి ఆ ఒప్పందాన్ని ఉల్లంఘించి తెలంగాణ సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, భౌగోళిక జీవనంపై, ఆ ప్రాంతంలో అనుక్షణం భవిష్యత్ తరాల జీవనాన్ని కూడా నాశనం చేస్తూ ఆంధ్ర-సీమ పాలక నియంతలు, పెట్టుబడిదారులు, అధికార వర్గాలు సుదీర్ఘకాలం పాటు నిరంతరాయంగా సాగించిన అమానుష దోపిడీకి, విధ్వంసానికి మానసిక మద్దతు పలకాలి కదా! అందుకేనేమో రచయిత ఒకపక్క ప్రత్యేక రాష్ట్ర వాదనలను విస్మరించలేమంటూ మరోపక్క దేశవ్యాప్తంగా అత్యధిక ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహిస్తున్న రాజకీయ, సామాజిక, సాంస్కృతిక సంస్థల సంపూర్ణ మద్దతుతో ప్రత్యేక రాష్ట్రం కోసం తెలంగాణలో జరుగుతున్న సంఘటిత ప్రజల మహోద్యమానికి కారణాలను కనీసం ప్రస్తావించకుండా జాగ్రత్త పడ్డారు.

కొంతకాలం క్రితం హెచ్ఎంటివి ఆధ్వర్యంలో విజయవాడలో జరిగిన ఆంధ్రప్రదేశ్ దశ-దిశ కార్యక్రమంలో నాటి జై ఆంధ్ర, నేటి ప్రత్యేక ఆంధ్ర ఉద్యమ నేత హరిరామజోగయ్య మాట్లాడుతూ, 1972లో జరిగిన జై ఆంధ్ర ఉద్యమం ద్వారా అరు సూత్రాల పథకాన్ని సాధించుకున్నామని వ్యాస రచయిత సమక్షంలోనే స్పష్టంగా, సగర్వంగా చెప్పారు. ఇక్కడ ఈ ప్రస్తావన కేవలం బలమైన ఉదాహరణకు మాత్రమే. ఈ విషయంలో ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలు. అయినప్పటికీ రచయిత మాత్రం ఆరు సూత్రాల ఒప్పందంతో ఆంధ్ర-సీమ వాసులను తెలంగాణ నాయకులు ఇరికించారంటూ వ్యాసంలో వాపోయారు. ఇరికించారనడానికి, పోరాడి సాధించుకున్నామనడానికి మధ్య ఉన్న వ్యత్యాసం ఇంకా ఇక్కడ వివరించాల్సిన అవసరం లేదనుకుంటా. పైగా, ఆనాడు జై ఆంధ్ర ఉద్యమానికి తెలంగాణ నేతలు మద్దతివ్వలేదంటూ చేసిన ఆరోపణ మరింత హాస్యాస్పదం. ఇక్కడ రచయిత అవలంబించిన ధోరణిలోనే ఆలోచిస్తే, అంతకు కొద్దినెలల ముందు వరకు జరిగిన జై తెలంగాణ ఉద్యమానికి ఆంధ్ర-సీమ నాయకులు మద్దతిచ్చి ఉంటే 1972లో జై ఆంధ్ర ఉద్యమం వచ్చేదే కాదు, ఆ ఉద్యమంలో సుమారు 400 మంది ప్రాణాలు కోల్పోయేవారే కాదు. మరి ఆ పాపం ఎవరిది?

1969లో జై తెలంగాణ ఉద్యమాన్ని అత్యధికంగా ముస్లిం మైనారిటీలు అనేక కారణాలతో వ్యతిరేకించారనడం మరో పచ్చి అబద్ధం. అదే నిజమైతే ముస్లిం జనాభా అధికంగా ఉండే హైదరాబాద్ నగరంలో ఆనాడు ఉన్న హైదరాబాద్, సికిందరాబాద్ లోక్‌సభ నియోజక వర్గాలలో 1971లో జరిగిన సార్వత్రిక ఎన్నికలలో తెలంగాణ ప్రజాసమితి (టిపిఎస్) ఎలా గెలిచినట్లు? హైదరాబాద్ స్థానంలో ఎనిమిది మంది అభ్యర్థులు బరిలో నిలువగా సమీప ప్రత్యర్థి అయిన బద్రుద్దీన్ తయ్యబ్జీ కన్నా 21 శాతం ఓట్ల ఆధిక్యత టిపిఎస్ అభ్యర్థి జి.ఎస్. మెల్కోటే ఎలా పొందినట్లు? పోలైన మొత్తం ఓట్లలో మెల్కోటేకు లభించిన ఓట్లు 57.27 శాతం. కాగా, సికిందరాబాద్ స్థానంలో 16 మంది అభ్యర్థులు బరిలో నిలువగా సమీప ప్రత్యర్థి కన్నా 11 శాతం ఓట్ల ఆధిక్యతతో టిపిఎస్ తరపున ముస్లిం అభ్యర్థి ఎం.ఎం. హాషిం ఎలా గెలిచినట్లు? పోలైన మొత్తం ఓట్లలో హాషింకు లభించిన ఓట్లు 45.49 శాతం. ఈ రెండు స్థానాలలో అభ్యర్థుల గెలుపోటములను శాసించే స్థాయిలో నిర్ణయాత్మక శక్తిగా ఉన్న ముస్లింల నుంచి సంపూర్ణ మద్దతు లభించనట్లయితే టిపిఎస్ అభ్యర్థులకు ఘనవిజయం ఎలా సాధ్యమైనట్లు? మరి ఆ నాటికే రాయలసీమ-ఆంధ్ర ప్రాంతాల నుంచి రాజధానికి వచ్చి స్థిరపడిన ప్రజలు జై తెలంగాణ ఉద్యమానికి మద్దతుగా టిపిఎస్‌ను గెలిపించారా? రచయిత సమీప వాస్తవాలను కూడా కనీసం గ్రహించకుండా కేవలం తెలంగాణలో హిందూ, ముస్లిం ప్రజల మధ్యన అంతరాలను సృష్టించే ప్రయత్నం చేశారు. 14వ శతాబ్దం నుంచి నేటివరకు దాదాపు 700 సంవత్సరాలుగా తెలంగాణ ప్రాంతంలో ముఖ్యంగా ఆ ప్రాంతానికి రాజధానులుగా వర్ధిల్లిన, వర్ధిల్లుతున్న గోల్కొండ, హైదరాబాద్ ప్రాంతాల పరిధిలో భిన్న మతాలకు చెందిన వారైనప్పటికీ ఆరోపణలకు, నిష్ఠూరాలకు తావివ్వకుండా ఒకరి జీవనశైలిని, సంస్కృతిని మరొకరు గౌరవించుకుంటూ, వారి వారి జీవన మార్గాలలో స్వేచ్ఛగా జీవిస్తూ, సమస్యల పట్ల ఐక్యత చాటుతూ ఒకే సమాజంలో ఉమ్మడి జీవనం కొనసాగిస్తున్న హిందూ, ముస్లిం జనసామాన్యం మధ్య విభేదాలు, విద్వేషాలు, వైషమ్యాలు సృష్టించేందుకు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకై సాగుతున్న ఉద్యమాన్ని బలహీనపరచడమే లక్ష్యంగా వ్యాసాలు వస్తున్నాయి. వీ

## కాశ్మీర్‌లో మధ్యవర్తుల కమిటీ పర్యటన

కాశ్మీర్ ప్రజల మనోభావాలను తెలుసుకోవడానికి, వారి సమస్యలకు పరిష్కారాలు సూచించడానికి కేంద్రం ఏర్పాటు చేసిన ముగ్గురు మధ్యవర్తుల కమిటీ కాశ్మీర్‌లో 4 రోజులు పర్యటించింది. పడ్గోంకర్ నేతృత్వంలోని ఈ కమిటీ సభ్యులు డిసెంబర్ 27న మీడియాతో మాట్లాడారు. జమ్మూకాశ్మీర్‌లో ఏర్పడిన పరిస్థితులు సద్దుమణగాలంటే నిర్బంధంలోని రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని, అల్లర్ల సమయంలో అరెస్టు చేసిన యువకులను విడిచిపెట్టాలని, కర్ఫ్యూను తొలగించాలని పడ్గోంకర్ సూచించారు.

## 70 శాతం పైనే బాల్య వివాహాలు

చట్టాలు ఎన్ని చేసినా హిందీ మాట్లాడే రాష్ట్రాల్లోని 70 శాతం మంది బాలికలకు 18 ఏళ్ల లోపే పెళ్లిళవుతున్నాయని, ప్రధానంగా ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, బీహార్ రాష్ట్రాలలో జరుగుతున్న పెళ్లిళ్లపై జాతీయ మహిళా సంఘం (ఎన్‌సిడబ్ల్యు) ఆందోళన వ్యక్తం చేసింది. బాల్య వివాహ వివరాలను ఎన్‌సిడబ్ల్యు చైర్ పర్సన్ గిరిజా వ్యాస్ అక్టోబర్ 29న వెల్లడించారు. మధ్యప్రదేశ్‌లో అత్యధికంగా 73 శాతం ఉండగా ఆ తరువాతి స్థానాల్లో ఆంధ్రప్రదేశ్‌లో 71 శాతం, రాజస్థాన్‌లో 68 శాతం, బీహార్‌లో 67 శాతం, యుపిలో 64 శాతం గా ఉన్నాయి.

## ఐరోమ్ షర్మిలా దీక్షకు పదేళ్లు

మణిపూర్‌లో భద్రతా దళాలు హక్కుల ఉల్లంఘనకు పాల్పడుతున్నాయంటూ, అందుకు వ్యతిరేకంగా మణిపూర్‌లో ఐరోమ్ షర్మిలా ఆమరణ నిరాహార దీక్ష చేపట్టి నవంబర్ 2కు పదేళ్లు నిండాయి. మణిపూర్ మలోమ్‌లో తన ఇంటివద్ద పది మంది సామాన్య ప్రజలను భద్రతా దళాలు కాల్చి చంపడంతో ప్రత్యక్షంగా చూసింది. సైన్యానికి కల్పించిన భద్రతా దళాల ప్రత్యేక అధికారాల చట్టం (ఎ.ఎఫ్.ఎస్.పి.ఎ) 1958ని రద్దుచేయాలని డిమాండ్ చేస్తూ 2000 నవంబర్ 2న షర్మిలా దీక్ష ప్రారంభించారు.

## బీహార్‌లో మళ్లీ ఎన్‌డిఎ కూటమి

బీహార్ అసెంబ్లీకి నాలుగు విడతలుగా జరిగిన ఎన్నికల్లో నితీష్‌కుమార్ నేతృత్వంలోని జెడిఎస్-బిజెపి కూటమికే మెజారిటీ సీట్లు లభించాయి. బీహార్ అసెంబ్లీకి జరిగిన మొత్తం 243 స్థానాల్లో 206 స్థానాలను జెడియు-బిజెపి కూటమి గెలుచుకుంది. జెడియు 115, బిజెపి 91 సీట్లు గెలుచుకున్నాయి. ఆర్‌జెడి 22, ఎల్‌జెపి 3, కాంగ్రెస్ 4, స్వతంత్రులు 6, ఇతరులు 2 స్థానాలను గెలుచుకున్నారు. మొత్తం 243 స్థానాల్లో పోటీ చేసిన కాంగ్రెస్ పార్టీ కేవలం నాలుగు స్థానాల్లోనే గెలిచింది.

## ఆదర్శ్ కుంభకోణం

ముంబైలోని కొలాబా ప్రాంతంలో 3800 చదరపు మీటర్ల స్థలాన్ని పదవీ విరమణ సైనికాధికారులకు, కార్గిల్‌లో యుద్ధంలో మరణించిన సైనికుల కుటుంబాలకు కేటాయించారు. ఈ స్థలాన్ని 2004లో ఆదర్శ కోఆపరేటివ్ హౌసింగ్ సొసైటీకి ఇచ్చారు. ఈ స్థలంలో ఇళ్ల నిర్మాణంకోసం 6 అంతస్తులకే అనుమతి ఉండగా రాజకీయ నాయకుల, అధికారుల, మాజీ సైనికాధికారుల కోసం దానిని 31 అంతస్తులకు పెంచారు. నిబంధనలకు విరుద్ధంగా ఎందుకు నిర్మించారో సమాధానం ఇవ్వాలని పర్యావరణ శాఖ అదర్శ్‌కు నోటీసులు జారీచేసింది. ముఖ్యమంత్రి అశోక్‌రావు చవాన్ తన పదవి కోల్పోయారు. ఈ కుంభకోణంలో అధికారులకు, పలువురు మంత్రులకు, ప్రమేయం ఉన్నట్లు తెలుస్తుంది.

## వర్గీస్‌ది బూటకపు ఎన్‌కౌంటర్

1970 ఫిబ్రవరి 18న కేరళ వైనాడులోని తిరున్వేలి అటవీ ప్రాంతంలో నక్సలైట్ నాయకుడు వర్గీస్‌ను ఎన్‌కౌంటర్ చేశారు. ఈ ఎన్‌కౌంటర్ బూటకమని, నిరాయుధుడిని చిత్రహింసలు పెట్టి కాల్చి చంపారని కోచిలోని సిబిఐ కోర్టు అక్టోబర్ 27న మాజీ ఐజిపిని దోషిగా నిర్ధారించింది. అక్టోబర్ 28న ఐపిసి సెక్షన్ 302 కింద యావజ్జీవ శిక్షను విధించింది. వర్గీస్‌ను ఎన్‌కౌంటర్ చేసిన విషయాన్ని పోలీస్ కానిస్టేబుల్ కొన్నేళ్ల తర్వాత మీడియాకు చెప్పడంతో తిరిగి ఈ కేసు వివరాలు బయటికి వచ్చాయి.

## రాథోడ్‌కు బెయిల్

టెన్నిస్ క్రీడాకారిణి రుచికా గిర్హోత్రాను లైంగికంగా వేధించి ఆమె ఆత్మహత్యకు కారణమైన కేసులో శిక్షకు గురైన హర్యానా మాజీ డిజిపి ఎస్‌పిఎస్ రాథోడ్ జైలు శిక్ష అనుభవిస్తున్నారు. ఈ కేసులో 6 నెలలుగా శిక్ష అనుభవిస్తున్న రాథోడ్‌కు జస్టిస్ పి. సదాశివమ్, జస్టిస్ బిఎస్. చౌహాన్‌లతో కూడిన సుప్రీం కోర్టు నవంబర్ 11న బెయిల్ మంజూరు చేసింది. రాథోడ్‌పై నమోదైన 3 కేసులను సిబిఐ ఉపసంహరించుకున్నందువల్ల సుప్రీం కోర్టు ఆయనకు బెయిల్ మంజూరు చేసింది.

## రాజా రాజీనామా

దేశంలో వరుస కుంభకోణాల్లో ఐ.పి.ఎల్, కామన్‌వెల్త్ గేమ్స్, ఆదర్శ్ హౌసింగ్‌ల, వరుసలో దేశంలోనే పెద్దదిగా చెపుతున్న 1.76 లక్షల కోట్ల టెలికాం కుంభకోణం నిలిచింది. 2జి స్పెక్ట్రమ్ కేటాయింపుల్లో కేంద్ర టెలికమ్యూనికేషన్ శాఖ మంత్రి ఎ. రాజానే బాధ్యుడని తెలిసి అతనిపై ఒత్తిడి తేగా రాజీనామా చేశారు. డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికామ్ 2001లో నిర్ణయించిన 2జి స్పెక్ట్రమ్ ధరలతోనే 2008లో తొమ్మిది కంపెనీలకు 'అతి తక్కువ ధరకు' కేటాయించారని, ఆర్థిక, న్యాయ శాఖల సలహాలను కూడా పట్టించుకోలేదని కాగ్ తన నివేదికలో పేర్కొంది. దేశీయ సంస్థలు 2జి స్పెక్ట్రమ్ లైసెన్సులు పొందిన వెంటనే విదేశీ సంస్థలకు అధిక లాభాలకు అమ్ముకున్నాయని తేలింది.

## ఎన్‌కౌంటర్‌లో 20 మంది నక్సల్స్ మృతి?

ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర దంతెవాడ జిల్లాలోని జాగర్ గుండా అడవుల్లో భద్రతా దళాలకు నక్సలైట్లకు జరిగిన ఎదురు కాల్పుల్లో 20 మంది నక్సల్స్ మరణించారని ఐజి తెలిపారు. ఈ ఘటనలో సిఆర్‌పిఎఫ్ 111వ బెటాలియన్‌కు చెందిన ప్రత్యేక పోలీసుల బృందం, ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర పోలీసులు నవంబర్ 23న చేపట్టిన గాలింపులో ఈ ఘటన జరిగిందని అన్నారు. అక్కడ జరిగినకాల్పుల్లో 9 మంది నక్సల్స్ ప్రాణాలు కోల్పోగా మిగతా వారి శవాలను నక్సల్స్ తీసుకెళ్లి ఉంటారని సిఆర్‌పిఎఫ్ ఐజి పంకజ్‌కుమార్ తెలిపారు.

## బ్రెజిల్ తొలి మహిళా అధ్యక్షురాలు

బ్రెజిల్‌లో తొలిసారిగా అధ్యక్ష పదవికి మహిళ ఎన్నికయ్యారు. అక్టోబర్ 30న జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో దిల్మా రౌస్సెఫ్ ఎన్నికయ్యారు. ఆమెకు 56 శాతం ఓట్లతో గెలుపొందారు. ఆమె ప్రత్యర్థి సోషల్ డెమోక్రాట్ అభ్యర్థి జోస్ సెర్రాకు 44 శాతం ఓట్లు వచ్చాయి. వర్కర్స్ పార్టీ అభ్యర్థిగా దిల్మాను ప్రస్తుత అధ్యక్షుడు లూలా నామినేట్ చేశారు. 1 జనవరి 2011 నుంచి నాలుగు సంవత్సరాల పాటు ఆమె అధ్యక్ష పదవిలో ఉంటారు. ఈ సందర్భంగా దిల్మా లూలా విధానాలను కొనసాగిస్తానని చెప్పారు.

## పింఛను సంస్కరణల బిల్లు ఆమోదం

ఫ్రాన్స్‌లో తీవ్ర నిరసనలు ఎదుర్కొంటున్న పింఛను సంస్కరణల బిల్లును చట్టంగా మారుస్తూ అధ్యక్షుడు నికొలస్ సర్కోజీ నవంబర్ 10న సంతకం చేశారు. ఈ బిల్లు కారణంగా 2018 నాటికి పదవీ విరమణ వయస్సు 60 నుంచి 62 ఏళ్లకు, 65 నుంచి 67 ఏళ్లకు పెంచుతుంది. ఈ ప్రతిపాదన కింద కంపెనీలు చెల్లించాల్సింది తగ్గిపోయి 85 శాతం వరకూ వ్యయాలు కార్మికులే భరించాల్సి ఉంటుంది. ఈ బిల్లుకు వ్యతిరేకంగా గత నెల రోజులకుపైగా కార్మిక సంఘాలు, ఫ్రెంచ్ ప్రజలు తీవ్ర నిరసనలు తెలుపుతున్నారు.

## బ్రిటన్‌లో విద్యార్థుల నిరసన

ట్యూషన్ ఫీజు పెంపుదల, ఉన్నత విద్యా బడ్జెట్‌లో కోతలు పెట్టాలని చూస్తున్న ప్రభుత్వ ప్రయత్నాలకు వ్యతిరేకంగా బ్రిటన్‌లో విద్యార్థులు నిరసన తెలుపుతున్నారు. కన్సర్వేటివ్ – లిబరల్ డెమోక్రాట్ల సంకీర్ణ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్యార్థులు భారీ ఎత్తున ఆందోళనకు దిగారు. యాభై వేల మందికి పైగా విద్యార్థులు నిరసన ప్రదర్శనలో పాల్గొన్నారు. నిధులు కొరతతో ఇప్పటికే దిగజారుతున్న విశ్వవిద్యాలయాలకు 290 కోట్ల పౌండ్ల మేరకు కోత విధించడం వల్ల లక్షలాది మంది సాధారణ బ్రిటన్ పౌరుల జీవితాలు నాశనమవుతాయని విద్యార్థులు తీవ్ర ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. నిరసనకు విశ్వవిద్యాలయ అధ్యాపకులు కూడా మద్దతు తెలిపారు.

## బర్మాలో ఎన్నికలు

బర్మాలో దాదాపు ఇరవై ఏళ్ల తర్వాత తొలిసారిగా నవంబర్ 7న ఎన్నికలు జరిగాయి. జాతీయ పార్లమెంట్ ఉభయ సభలు, 14 ప్రాంతీయ పార్లమెంట్‌కు ప్రతినిధులను ఎన్నుకొంటారు. దేశవ్యాప్తంగా నలభై వేల పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేశారు. ఈ ఎన్నికలలో అధికార మిలిటరీ అండ ఉన్న యూనియన్ సాలిడారిటీ డెవలప్‌మెంట్ పార్టీ (యు.ఎస్.డి.పి.) 1159 స్థానాల్లో 1112 మందిని నిలబెట్టింది. ప్రధాన ప్రత్యర్థి నేషనల్ యూనిటీ పార్టీ 995 మందిని బరిలో నిలబెట్టింది. అతి పెద్ద ప్రతిపక్షం నేషనల్ డెమొక్రటిక్ ఫోర్స్ కేవలం 164 మంది అభ్యర్థులనే పోటీకి నిలిపింది.

## ఇరాక్‌కు అధ్యక్షుడిగా తలాబాని

ఇరాక్‌లో నవంబర్ 11న జరిగిన అధ్యక్ష పదవి ఎన్నికలలో అధ్యక్షుడు జలాల్ అల్ తలాబానీ తిరిగి ఎన్నికయ్యారు. స్పీకర్ పదవికి జరిగిన ఎన్నికల్లో ఒసామా అల్ నజైఫీ ఎన్నికయ్యారు. మొదటిరౌండ్‌లో తలాబానీకి మూడింట రెండొంతుల ఓట్లు లభించకపోవడంతో రాజ్యాంగ నిబంధనల ప్రకారం మరోసారి ఓటింగ్‌ని నిర్వహించారు. రెండోరౌండ్‌లో పోలైన 213 ఓట్లలో ఆయనకు 195 ఓట్లు లభించాయి. దీంతో ఆయనను అధ్యక్షుడిగా ఎన్నుకొన్నారు.

## ఆంగ్‌సాన్ సూచీ విడుదల

బర్మా ప్రజాస్వామిక నేత, నోబెల్ శాంతి విజేత, ప్రతిపక్ష నేషనల్ లీగ్ డెమొక్రటిక్ నాయకురాలు ఆంగ్‌సాన్ సూచీ నవంబర్ 13న విడుదలయ్యారు. గత ఏడు సంవత్సరాలుగా గృహ నిర్బంధంలో ఉన్న ఆమెను ప్రభుత్వం బేషరతుగా విడుదల చేసింది. మయన్మార్ సైనిక పాలనకు వ్యతిరేకంగా పోరాటం ఆగబోదని ఈ సందర్భంగా సూచీ ప్రకటించారు. తనతో ముఖాముఖి చర్చలు జరపాలని మయన్మార్‌ను పాలిస్తున్న సైనిక నేత జనరల్ థాన్ ష్వేకు పిలుపునిచ్చారు. గడచిన 21 సంవత్సరాల్లో 15 సంవత్సరాలు ఆమె గృహనిర్బంధంలోనే ఉంది. విడుదలైనాక సూచీ చిన్న కుమారుడు కిమ్ అరిస్‌ను పదేళ్ల తర్వాత నవంబర్ 22న కలుసుకున్నారు. సూచీ విడుదలతో మయన్మార్ ప్రజలు హర్షం వ్యక్తం చేశారు.

## కాంబోడియాలో తొక్కిసలాట

కాంబోడియా రాజధాని నామ్‌పెన్‌లో నవంబర్ 22న జరిగిన జలోత్సవం సందర్భంగా జరిగిన తొక్కిసలాటలో 380 మందికి పైగా మరణించారు. ఎనిమిది వందల మందికిపైగా గాయపడ్డారు. డైమండ్ దీవిలో ఒక సంగీత కార్యక్రమం అనంతరం టోన్లే నదిలో ప్రధాన ఆకర్షణగా జరిగే పడవ పందాలను చూడడానికి జనం పెద్ద సంఖ్యలో వచ్చారు. ఒక చిన్న వంతెన మీదికి ఇరవై లక్షల మందికి పైగా చేరడంతో ఒక్కసారిగా ఆందోళన చెలరేగింది. కొంతమంది ఊపిరాడక స్పృహకోల్పోవడంతో జనాలు భయంతో పరుగులు తీశారు. దీంతో తొక్కిసలాట జరగడంతో చాలా మంది కాళ్లకింద నలిగిపోయారు. మరికొంత మంది ప్రాణభయంతో నదిలోకి దూకారు. మృతుల్లో అధికంగా మహిళలూ, పిల్లలూ ఉన్నారు. అత్యధిక మరణాలు ఊపిరాడక, అంతర్గత గాయాల వల్ల జరిగాయని అధికార వర్గాలు తెలిపాయి. ఈ ఘటనపై ప్రధాని హన్‌సేన్ దిగ్భ్రాంతి వ్యక్తం చేస్తూ దర్యాప్తుకు ఆదేశించారు. 25 నవంబర్ న జాతీయ సంతాప దినంగా ప్రకటించారు.

## ఉత్తర – దక్షిణ కొరియాల మధ్య ఘర్షణలు

దక్షిణ కొరియాకు చెందిన యియోన్‌ప్యాంగ్ ద్వీపంపై ఉత్తర కొరియా దళాలు నవంబర్ 23న శతఘ్నులతో దాడి చేశాయి. దీంతో మళ్లీ రెండు కొరియా దేశాల మధ్య యుద్ధ మేఘాలు అలుముకున్నాయి. ఈ దాడిలో దక్షిణ కొరియాకు చెందిన ఇద్దరు సైనికులు, ఇద్దరు సామాన్య పౌరులు మరణించారు. 21 మంది గాయపడ్డారు. కొన్ని భవనాలు నేలమట్ట మయ్యాయి. ఉత్తర కొరియా భూభాగానికి దూరంగా సముద్రంలో అమెరికాతో కలిసి దక్షిణ కొరియా జరుపుతున్న నావికాదళ డ్రిల్లును తక్షణమే ఆపాల్సిందిగా ఉత్తర కొరియా నవంబర్ 22న హెచ్చరికలు చేసినా, వాటిని బేఖాతరు చేసి శతఘ్నులను ప్రయోగించిందనీ అందువల్లనే ఈ చర్యలకు పాల్పడవలసి వచ్చిందని ఉత్తర కొరియా అధికార వర్గాలు తెలిపాయి. వీ

# వీక్షణం 2010 సూచిక

తెలంగాణ ఉద్యమం – కొత్త సవాళ్లు – ఎడ్ల పోచయ్య
ప్రాంతీయ అసమానతలు : ప్రత్యేక రాయలసీమ – అంగడి రంగారెడ్డి
నిరాశపర్చిన కోపెన్‌హాగెన్ సదస్సు – ఎ. నరసింహారెడ్డి
నారాయణపట్నా వేస్తున్న ప్రశ్నలు – సుధా రామచంద్రన్
సామాన్యుల సంక్షోభం – సంపన్నుల సంక్షేమం – ఇ.ఎస్. బ్రహ్మచారి
బ్యాంకింగ్‌లో అమలు కాని రిజర్వేషన్‌లు – ఆస శ్రీరాములు
పాలస్తీనా పోరాట నేపథ్యం – కె. నరేంద్రమోహన్
రాయలసీమ అస్తిత్వాన్ని గుర్తించాలి – పాణి
సోషలిజం మార్గదర్శి ఇస్త్వాన్ మెస్జరోస్ – జాన్ బెలామీ ఫాస్టర్
మతవిశ్వాసాల పునాదులు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
దేశీయం
అంతర్దేశీయం
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**మే 2010** **సంచిక 106**

**❖ ఫోకస్ : కార్మిక జీవితాలు – స్థితిగతులు**

లోలోపల రాజుకుంటున్న రాష్ట్రం (సంపాదకీయం)
దంతెవాడ ఘటన ఎందుకు జరిగింది?; థాయిలాండ్,
కిర్గిజిస్తాన్ ప్రజాగ్రహం (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
జవాన్లను బలిగొన్నది చిదంబరమే – వి. హనుమంతరావు
దంతెవాడ : ఒకానొక వెనుకంజ – జి.కె. పిళ్లై
రెండు వైపులా ప్రజలే – పి.యు.డి.ఆర్. ప్రకటన
రెండు పక్షాలూ ఒకటి కాదు – సుమంతా బెనర్జీ
తాడిమెట్ల దాడి ఎందుకు జరిగింది? – మావోయిస్టు పార్టీ
విద్యా హక్కు చట్టం పూర్వాపరాలు – డా. ఎం. గంగాధర్
జవహర్‌లాల్ నెహ్రూ పట్టణ నవీకరణ పథకం – ఎస్. సరళ వందనం
హైదరాబాద్ అల్లర్ల వెనుక అసలు ఉద్దేశాలు – యాటెల్లి రామచంద్రం
❖ 'మేడే' స్ఫూర్తితో ఉద్యోగ, కార్మిక పోరాటాలు – దేవిప్రసాద్
❖ బీడీ కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యలు – వనమాల కృష్ణ
❖ బీడీల్లో పొగచూరుతున్న బతుకులు – ఎన్. అరుణ
❖ భవన నిర్మాణ కార్మికుల స్థితిగతులు – జి. అనురాధ
❖ సింగరేణి కింది స్థాయి కార్మికుల వ్యథలు – ఎం. మయూర్
❖ కార్మికులు దోపిడీదారులెలా అయ్యారు? – పి.వి. రమణ
సంస్మరణ – భమిడిపాటి రామగోపాలం (భరాగో)
తెలంగాణ ఉద్యమం – ఆలోచించాల్సిన అంశాలు – పులుగుజ్జు సురేష్
ప్రజాస్వామిక తెలంగాణ – లంబాడీలు – పోరిక ఉదయసింగ్ నాయక్
సంస్మరణ – పైలా వాసుదేవరావు
రాయలసీమ వెనుకబాటు – కొన్ని ప్రశ్నలు – డా. కృష్ణమూర్తి, డా. మాధవస్వామి
రాయలసీమకు తెలంగాణ తేజం ఎప్పుడు? – అంగడి రంగారెడ్డి
సంక్షోభాన్ని అధిగమించే ఆర్థిక విధానం – డా. వి. త్రివేణి
ప్రాచీన యుగాల్లో శ్రమ విభజన – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
సంస్మరణ – ఎం.ఎ. వనజ
ప్రపంచ దేశాలపై అమెరికా ఆధిపత్యం – విద్యాభూషణ్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**జూన్ 2010** **సంచిక 107**

**❖ ఫోకస్ : అరవై సంవత్సరాల రాజ్యాంగం**

రాష్ట్రాన్ని ముంచెత్తుతున్న యాత్రలు (సంపాదకీయం)
మరణశిక్షతో సమస్య సమసిపోతుందా?; థాయిలాండ్‌లో
పాలకుల దమనకాండ (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
కుల గణనకు జాప్యం ఎందుకు? – వెంకట్ సాధం
కాలుష్యానికి బలికావాల్సిందేనా? – ఎన్. భగవాన్ రెడ్డి
పోరాటాల స్ఫూర్తితో భవిష్యత్తు నిర్మిద్దాం – ఎస్. సుధాకర్
తెలంగాణపై ఎవరి అభిప్రాయాలు అవసరం? – కడియాల సుబ్బనాచారి
నాయకత్వంలో అణగారిన కులాలెక్కడ? – డా. తడకమళ్ల శేఖర్
ప్రజా పోరాటాల విజయదుర్గం – రాయ్‌గఢ్ – నక్కా హేమా వెంకట్రావ్
❖ ఆదేశిక సూత్రాలే అంతిమ లక్ష్యం – కె.జి. కన్నబిరాన్
❖ వలస చట్టాల ప్రభావం – '24 గంటలు' పుస్తకం నుంచి
❖ సమాఖ్యకు సమాధి కట్టిన రాజకీయం – మాడభూషి శ్రీధర్
❖ అరవై సంవత్సరాల చరిత్రలో రాజ్యాంగం – ఎస్. శేషయ్య
❖ అరవై ఏళ్ల రాజ్యాంగం – అంబేద్కర్ – మల్లేపల్లి లక్ష్మయ్య
సామాజిక న్యాయం అందేదెప్పుడు? – తోట సత్యనారాయణ, తిరునగరి మనోహరస్వామి
జాతీయ ఆహార భద్రత చట్టం – వి. చలపతిరావు
అమెరికా స్తబ్ద దశాబ్దం – ఇ.ఎస్. బ్రహ్మచారి
కౌటిల్యుని అర్థశాస్త్రం సర్వరోగ నివారిణా? – మచ్చ ప్రభాకర్
రాయలసీమ వెనుకబాటు వెనుక – రాయలసీమ విద్యావంతుల వేదిక
చరిత్ర – సంవిధానం – బెన్ ఫైన్, ఆల్ఫ్రెడో సాద్ – ఫిల్హో
తొట్టతొలి దేవాలయాలు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**జూలై 2010** **సంచిక 108**

**❖ ఫోకస్ : పర్యావరణ సంక్షోభం**

ఏడాదిలో ఏమున్నది గర్వకారణం? (సంపాదకీయం)
'వామపక్ష' ప్రభుత్వాల భవిష్యత్తు;
నెత్తురోడుతున్న కిర్గిజిస్తాన్ (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
భోపాల్ బయటపెడుతున్న అసలు సంగతి – ఎన్. వేణుగోపాల్
ఆపరేషన్ గ్రీన్‌హంట్ పట్నపు అవతారం – అరుంధతీ రాయ్
ఈ జాతి అచేతనంగా ఉందా? – మోహన్ మూర్తి
జనం తాగితేనే ప్రభువులకు భద్రత – ఎడ్ల పోచయ్య
పర్యాటక రంగం సవ్యంగానే ఉందా? – ఎస్. సరళా వందనం
ప్రసారభారతీ, మమ్మల్ని క్షమించు! – వి. గోపీచంద్
ఛత్తీస్‌ఘడ్ జైళ్లలో అక్రమాలు – వొగ్గె చంద్రమౌళి
❖ పర్యావరణ సంక్షోభానికి కారకులెవరు? – పి. వరలక్ష్మి
❖ ఎవరి అభివృద్ధి కోసం కోస్తా విధ్వంసం? – జె.వి. రత్నం
❖ గల్ఫ్ ఆఫ్ మెక్సికో దోషులెవరు? – పి.వి. రమణ
❖ మన కాలపు పర్యావరణ సంక్షోభం – రణధీర్ సింగ్
❖ అంతరించిపోతున్న అడవి – బి. వేణుగోపాల్
పోలీసులా? కీచకులా? – డా. జి. లచ్చయ్య
సహజ సంపదే శాపమైన ఈస్ట్ టిమోర్ – కె. నరేంద్రమోహన్
నూతన పారిశ్రామిక విధానం – అజంజాహీ మిల్లు – డా. ఎం. విద్యాసాగర్ రెడ్డి, డా. మహ్మద్ మస్లియుద్దీన్
ఆర్థిక సామర్థ్యాన్ని పెంచే పాడి పరిశ్రమ – లింగబత్తిని మల్లయ్య, వంగ రజిత
ఆదిమ సమాజాల్లో వర్గ విభజన – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**ఆగస్ట్ 2010** **సంచిక 109**

**❖ ఫోకస్ : వ్యవసాయరంగం – నేటి స్థితి**

సోంపేట ప్రజా ప్రతిఘటన నేర్పే పాఠం (సంపాదకీయం)

